దక్షిణభారతంలో ఆయుర్వేదౌషధ నిర్మాతలుగా 75 సం॥లుగా ప్రఖ్యాతి వహించి అనేక వైద్య సమ్మేళనముల యందు స్వర్ణపతకములను, యోగ్యతాపత్రములను పొందిన సుప్రసిద్ధ ఆయుర్వేద ఔషధ నిర్మాణసంస్థ.

సంస్థాపకులు

**"వైద్యరాజ" ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు**

ప్రధాన చికిత్సకులు & మేనేజింగ్ ప్రొప్రైటర్

**ద్విభాష్యం వెంకట సూర్యనారాయణమూర్తి గారు**

ఆంధ్రదేశమంతటా గల మా బ్రాంచీలు, ఏజన్సీల ద్వారాగాని లేక మా హెడ్ ఆఫీస్ ద్వారాగాని మీరు కావలసిన ఆయుర్వేదౌషధములు లభించగలవు.

# శ్రీవెంకటేశ్వర ఆయుర్వేద నిలయము

**చింతలూరు – ఆలమూరు తాలూకా**

తూర్పు గోదావరి జిల్లా.

ప్రథమ ప్రచురణ 17–3–1980

రౌద్రి - ఉగాది

ప్రతులు 2000

వెల Rs. 16.00

ముద్రణ నిర్వాహకులు

శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు

బి. వి. అండ్ కో ప్రెస్,

త్యాగరాజనగరు, రాజమండ్రి-1

గ్రంథప్రాప్తి స్థానము

దత్తాత్రేయ అండ్ కో.,

(ఆయుర్వేద & హోమియో మెడికల్స్)

కోటగుమ్మం, రాజమండ్రి-1

Pin Code 533 101

శ్రీ ధన్వంతరయే నమః



శాంతం కృపాజలనిధిం అక్రోధం శాస్త్రపారగం
దేవతా రక్షక శ్రేష్ఠం వ్యాధిమాన విదారణమ్ ।
ఔషధగ్రాహ నిపుణం భిషక్శాస్త్ర విశారదం
సర్వేషాం జ్ఞానసంపన్నం ధ్యాయేద్ధన్వంతరిం సదా ॥

వైద్య గంటి కల్యాణశర్మ

# అంకితము

ధన్వంతరీ స్మరణపూర్వకముగా

బ్రహ్మశ్రీ
ద్విభాష్యం వెంకట సూర్యనారాయణమూర్తి గారికి
భక్తితో సవినయముగా సమర్పితము.

# విషయ సూచిక





# పీఠిక

ఈనాడు దేశవ్యాప్తంగా ఆయుర్వేద పట్టభద్రుల పాఠ్యప్రణాళికాంశాలను ఒకేవిధంగా రూపొందించడం జరిగింది. ఇది చట్టబద్ధంగా చేయబడిన నిర్ణయం. విషయప్రధానంగానూ గ్రంథప్రధానంగానూ ఆయుర్వేద శాస్త్రమును బోధించడము జరుగుతుంది. గ్రంథపరంగా అష్టాంగ సంగ్రహం సూత్రస్థానాన్ని మొదటిసంవత్సరము, చరకసంహితను చివరి రెండు సంవత్సరాలు బోధిస్తారు. మిగతా పాఠ్యప్రణాళిక యావత్తూ విషయపరంగా వుంటుంది. అంటే విషయప్రాధాన్యం గల గ్రంథాలు క్రొత్త పాఠ్యప్రణాళికను అనుసరించి రచింపబడాలి. ఇటువంటివిషయప్రాధాన్యంగల ఆయుర్వేద శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు హిందీభాషలో వున్నంత విరివిగా మరియే ఇతర భారతీయ భాషలలోనూ ఇంతవరకు రచింపబడియుండలేదు. తత్కారణంగా రాష్ట్రీయస్థాయిలోగల ఆయుర్వేద కళాశాలలందు ప్రాంతీయభాషల్లో ఆయుర్వేద బోధనకు ఎన్నో యిబ్బందులు కలుగుతున్నాయి.

ఆర్ష గ్రంథాలలోని విషయపరంగా నిర్ణయింపబడిన భాగాలు దుర్లభముగా ఉన్నాయి. అంతేకాదు భాషకూడ జటిలమై ఉండుటచే నేటి విద్యార్థులు వానిపై టీకమాత్రము చదువగల్గుచున్నారు. విషయ సేకరణకొరకై అనేక గ్రంథా

లను పరిశీలించవలసివచ్చుట తప్పనిసరి అవుతూన్నది. ఈ కారణాలవల్ల ఈనాటి పాఠ్యప్రణాళిక ననుసరించి ప్రాంతీయభాషల్లో సులభగ్రాహ్యమైన శైలిలో శిష్టవ్యావహారిక భాషలోనే గ్రంథరచనలు గావించి వానిని ప్రచురించడం చాల అవసరం.

డా. కె. ఆర్. శ్రీకంఠమూర్తిగారు (ప్రిన్సిపాల్, తారానాథ్ ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, బళ్ళారి, కర్నాటక) గొప్ప ఆయుర్వేద శాస్త్రజ్ఞులేకాక ఘనతవహించిన ప్రాధ్యాపకులుకూడ. అట్టి అనుభవజ్ఞునిచే కన్నడభాషలో "ఆయుర్వేద వికృతి విజ్ఞానము" అను చక్కని గ్రంథము రచింపబడి కర్నాటక విశ్వవిద్యాలయం, ధార్వాడ వారిచే ప్రచురింపబడినది. ఈ ప్రయోజనకరమైన గ్రంథమును వారిశిష్యులు డా. గంటి కల్యాణశర్మ **M. A., B. Sc., B. S. A. M.** కన్నడమాతృకకు ఏవిధంగాను భంగము వాటిల్లకుండా ఆంధ్రీకరించారు. శ్రీ కల్యాణశర్మ యువతరంవారు. అయినా సద్వైద్య సంప్రదాయంలో శ్రీకంఠమూర్తిగారు, శ్రీ పార్థనారాయణ పండితులవంటి మహనీయులదగ్గర శిక్షణపొందినందువల్ల శాస్త్రమర్యాదలు బాగుగా అలవరచుకొనగలిగినారు.

ఏశాస్త్రానికయినా సంపూర్ణత్వం సాఫల్యం సిద్ధించవలెనంటే ఆ శాస్త్రానికి ఒక మౌలికమగు సిద్ధాంతప్రాతిపదిక, ఆ సిద్ధాంతాలద్వారా వ్యవహారసౌలభ్యం తదుపరి అందువల్ల

కలిగే సత్ఫలితాలు ముఖ్యం. ఆయుర్వేదము అటువంటి సంపూర్ణశాస్త్రం. దానికి విశిష్టమైన మూలసిద్ధాంతాలంటూ కొన్నిఉన్నాయి. దోష, ధాతు, మల విజ్ఞానముద్వారా దేహ ప్రకృత్యవస్థను సంపూర్ణముగా అవగాహనము చేసకొన వీలవుతుంది. ప్రకృతి సామ్యావస్థ చెడి వికృతిచెందటమే రోగోత్పత్తికినాంది. దోషముల పరిచయము, సప్తధాతుపరిగణన, అగ్నివిచారణ, ఆమోత్పత్తి, మలములు, క్రియాకాలములు మున్నగు విషయములు ఆయుర్వేద శాస్త్రముద్వారా భారతీయ మేధ ప్రపంచానికి ప్రసాదించిన మహోన్నతసిద్ధాంతాలు. వీటిని అవగాహనచేసకొనాలంటే శాస్త్రార్థమెరిగిన గురువులవద్ద శిక్షణ, సంతతశాస్త్రాధ్యయనము, శ్రద్ధ ముఖ్యావసరాలు.

ఈనాటి పరిస్థితుల కనుగుణంగా శాస్త్రజ్ఞులైన వైద్య ప్రముఖులు శాస్త్రీయ విషయములను లఘుగ్రంథములుగా రచించినచో జిజ్ఞాసువులైన వైద్యులకు, విద్యార్థులకు ప్రయోజనకరముగానుండును.

ఈగ్రంథశైలి కేవలము అనువాదశైలియని యనిపించుకొనకుండా, సరళముగానుండి స్వతంత్ర రచనయూ అనుభావము కల్గించునంత లలితముగానుండి విషయగ్రహణమునకు సులభముగ తోడ్పడుచున్నది. అయితే కన్నడమాతృకతో దీనిని పోల్చిచూడగా మాతృకకు తు. చ. తప్పనిరీతిగా అనువదింప

బడింది. శ్లోకములు అధ్యాయాంతమున నుండుటచే చదువరు లకు గ్రంథపఠనములో అడ్డుతగులుట లేదు. శాస్త్రాభిలాష మెండయినప్పుడు, మూలగ్రంథమును చూడాలన్నప్పుడు ఈశ్లోకములు చాల ఉపయోగకరముగా వుంటాయి. ఈగ్రంథము తెలుగుదేశమందలి వైద్యుల ఆదరాభిమానములను చూరగొని ఆదరింపబడుతుందని నా విశ్వాసము.

హైదరాబాద్
9-3-1980

(సం.) డా॥ ఇటికాల సంజీవరావు
G C.I M (Madras) D.Ay M. (Benaras)
Project Officer
&
Head of the Research Department
(Ayurveda)
Govt of Andhra Pradesh,
Hyderabad.

# కన్నడ గ్రంథకర్త తొలిపలుకులు

ఆయుర్వేదాధ్యయనానికి ముఖ్యావసరమైన పాఠ్య గ్రంథాల అభావం ఎంతైనావుంది. పూర్వకాలంలోలాగ మావద్గ్రంథాన్ని కంఠస్థంచేయగల సమర్థత ఆధునిక విద్యార్థికిలేదు. ఆయుర్వేదానికి సంబంధించిన ఆర్షగ్రంథాలయందలి భాషాక్లిష్టత, విషయాంతరవిమర్శ, అస్తవ్యస్త విషయ ప్రతిపాదనక్రమం మున్నగునవి నేటికాలపు విద్యార్థికి సులభంగా గ్రహింపగలవి కావు. ఆధునిక విద్యావిధానంలో విషయ ప్రతిపాదనకు, గ్రాహ్యతకే ప్రాధాన్యం. ఇందుకు తగినవిధంగా పాఠ్యగ్రంథముల రచనసాగాలి. ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలలయందు, తదితర విద్యాలయాల్లోనూ క్రమబద్ధంగా దాదాపు నాల్గుదశాబ్దాలుగా ఆయుర్వేదాధ్యయనం జరుగుతూవున్నా, సంప్రదాయబద్ధులైన వైద్య అధ్యాపకుల పట్టుదలవల్ల ఆర్షగ్రంథాధ్యయనానికే ప్రాధాన్య మివ్వాలనే కారణాలవల్ల ఈవైద్యం చదువవచ్చే విద్యార్థుల అల్పసంఖ్య, అధ్యాపకులకు గ్రంథరచనయందు సమర్థతలేకుండుట, ఆయుర్వేద గ్రంథాల ప్రచురణవల్ల తగినంత లబ్ధియుండదని ప్రకాశకులు తటస్థనైఖరి నవలంబించుట మొదలగు కారణాలవల్ల పాఠ్య గ్రంథాల ప్రచురణ జరగటంలేదు. రాష్ట్రాల్లోని విశ్వవిద్యాలయాలు మాతృభాషలందు పుస్తకప్రచురణ కార్యక్రమం ద్వారా ఆయుర్వేద పాఠ్యగ్రంథాలను ప్రచురణచేసి ఆయు

ర్వేద శాస్త్రాభివృద్ధికి తోడ్పడాలి. ఈ విషయంలో ఆసక్తి చూపుతున్న మైసూరు, కర్నాటక విశ్వవిద్యాలయాలు అభినందనార్హములు.

విద్యార్థికి ఉపయోగకరంగా వుండేలాగున మంచి పాఠ్యగ్రంథరచన కూడా అధ్యాపకుని కర్తవ్యంగా భావించి నేను రచించిన గ్రంథాల్లో ఇది మూడవది. మైసూరు ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలయందు వికృతి విజ్ఞానమును దాదాపు పదిసంవత్సరములు బోధించిన అనుభవంతో ఈ గ్రంథమును రూపొందించడం జరిగింది. నేటి ఆయుర్వేద కళాశాలల్లోని బి. ఎ. యం. యస్. డిగ్రీ సిలబస్ ప్రణాళికానుగుణంగా విషయ సంగ్రహణం చేయబడింది. ఆర్ష గ్రంథాలలోని విషయముల విపులవివరణను అనుసరించుటకు విశేషంగా ప్రయత్నించితిని. విద్యార్థులకుపకరించే ముఖ్యసిద్ధాంతములను "సారాంశము" అను శీర్షికతో పొందుపరచితిని. ప్రధానంగా అధ్యాపకుల ఉపయోగంకోసం ఆర్ష గ్రంథాలలోని మూలపాఠాలను సంగ్రహించి "శాస్త్రోక్తప్రమాణ శ్లోకాలు" అన్న శీర్షికతో సూచించితిని. విషయములను నిర్దుష్టంగా విపులంగా తెలియ చేయుటకు అనేక నూతన శీర్షికలతో పాటు కొన్ని సందర్భాలలో నా అనుభవాలనుకూడా చేర్చి వ్రాసితిని. ప్రాచీన సిద్ధాంతాలనే నూతనరీతిలో తెలియచేయుటకు నేఁజేసిన

ప్రయత్నమువలన విద్యార్థులును, అధ్యాపకులును విశేషసాఫల్యమును పొందగలరని విశ్వసిస్తున్నాను.

మా కళాశాల ప్రధానాచార్యులుగాను, కర్నాటక విశ్వవిద్యాలయ ఆయుర్వేద శిక్షణ సలహాసమితి అధ్యక్షులుగా నుండిన డా॥ బి. యం. శర్మ గారికిని, ఉపాధ్యక్షులుగానుండిన బీజాపూరు ఆయుర్వేద కళాశాల ప్రిన్సిపాల్ డా॥ యస్. ఆర్. హీరేమఠ్ గారు ఈ గ్రంథమును సమితిద్వారా ఆమోదింపచేసి ప్రకటించుటకు సూచనలనిచ్చి ప్రోత్సహించినందులకు వీరికిని సదా కృతజ్ఞుడను. కర్నాటక విశ్వవిద్యాలయ పాఠ్యపుస్తక నిర్దేశకులైన ప్రొ॥ యస్. యం. వృషభేంద్రస్వామిగారు అత్యంతాసక్తితో ముద్రణకార్యక్రమములో సహకరించి జయప్రదముగావించి నందులకు వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు. అటులనే వ్రాతప్రతిని దిద్దుటలో సహాయకులైన శ్రీ యస్. యస్. భూసరెడ్డిగారి సేవకు కృతజ్ఞతలు. ఈగ్రంథము వ్రాతప్రతిని సిద్ధముచేయుటలో సహకరించిన కుమారి జి. వేంకటలక్ష్మి, కుమారి మనోన్మణి అను నావిద్యార్థినులకు ధన్యవాదాలు.

బెంగుళూరు ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలయందు నావిద్యార్థియైన డా॥ గంటి కల్యాణశర్మ ఈ గ్రంథమును ఆంధ్రీకరించి తెలుగు ఆయుర్వేద విద్యార్థులకు, అధ్యాపకు

లకు, వైద్యులకు అందజేసి ప్రశంసాపాత్రులైనారు. డా॥ కల్యాణ శర్మగారికి ఆయుర్వేదమునందుగల అభిమానమును, ఆయుర్వేద గ్రంథములను క్షుణ్ణముగా అధ్యయనముచేయు సహిష్ణుతను నేను ఆనందముతో గమనించియుంటిని.

ఈగ్రంథముద్వారా నన్నును, ఆయుర్వేదశాస్త్రమునకు సమర్పితమైన నా చిన్నకానుకైన యీ గ్రంథమును తెలుగు దేశమునకు పరిచయముచేసిన డా॥ కల్యాణశర్మగారికి మరియు వారి పితృపాదులైన డా॥ దత్తాత్రేయమూర్తి గారికి కృతజ్ఞతల నర్పించుచున్నాను. డా॥ కల్యాణశర్మగారికి ఇంకను అధికముగా ఆయుర్వేదసేవ చేయుటకు ఆయురారోగ్యములను ప్రసాదించుగాక యని భగవంతుడగు ధన్వంతరిని ప్రార్థించుచున్నాను. తెలుగు అనువాదమును చదివి నాకు వినిపించిన తారానాథ్ ప్రభుత్వ ఆయుర్వేదకళాశాల సహాధ్యాపకులు డా॥ యం. ఈశ్వరరెడ్డిగారికి నేను కృతజ్ఞుడను.

ఈ అనువాదగ్రంథమునందు దురదృష్టవశాత్తు కొన్ని దోషములు కొన్ని వచ్చిపడినవి. గ్రంథాంతమునగల తప్పొప్పుల పట్టికనుచూచి సందేహనివారణ పొందవలెనని పాఠకులను కోరుచున్నాను.

బళ్ళారి,
6–3–80.

డా॥ కె. ఆర్. శ్రీకంఠమూర్తి.

# అనువాదకుని నివేదనము

ఆయుర్వేదవిజ్ఞానం యావత్తూ సంస్కృతభాషలోనే ఉండడంవల్ల ఇటీవలికాలంలో ఈ శాస్త్రాధ్యయనపరుల సంఖ్య బాగాతగ్గిపోయింది. ఆంధ్రదేశంలో పాఠశాలాస్థాయిలో సంస్కృతబోధన జరగకపోవడంవల్ల సంస్కృతభాషాధ్యయన వ్యాప్తికి భంగం వాటిల్లింది. తత్కారణంగా జిల్లా, తాలూకా పట్టణ ప్రాంతాలలోకూడా ఆయుర్వేదవైద్యులనేవారు లేకుండా పోయారు. ఎక్కడైనా నామమాత్రంగా వున్నా, శాస్త్రపరిజ్ఞానలోపంవల్ల వారీవైద్యవిశిష్టతను ప్రజలకు అందించి సేవాతత్పరులుకాగల ఘనత పొందలేకపోతున్నారు.

మనదేశం స్వాతంత్ర్యం పొందినతర్వాత ఉత్తరభారతం అంతా ఆయుర్వేదాభివృద్ధిని బాగా సాధించి ఎన్నెన్నో నూతన కళాశాలలను స్థాపించుకొని విశ్వవిద్యాలయస్థాయిలో ఏకపాఠ్య ప్రణాళికానుసారంగా ఆయుర్వేదబోధన కొనసాగించుతూ వుంది. ఇటీవలికాలంలో ఆ పాఠ్యప్రణాళికనే చట్టబద్ధంచేసి అన్ని ప్రాంతీయకళాశాలలు దానినే అనుసరించి ఆయుర్వేద బోధ జరుగవలెననే నిర్ణయం తీసుకోబడింది.

ఉత్తరభారతంలో పలుప్రాంతాల మాతృభాష హిందీ కావటంవలన ఆ భాషలోనికి అనేక ఆయుర్వేద ఉద్గ్రంథాలు

అనువదింపబడి విద్యార్థులకు, వైద్యులకు ప్రయోజనకరంగా ప్రచురింపబడుతున్నాయి. తెలుగుదేశంలో ఆయుర్వేదవైద్యం బాగా క్షీణించిఉండటంవల్ల ఈ గ్రంథాలేవి ఇటీవలికాలంలో అనువదింపబడటంగాని, శాస్త్రాధారంగా రచింపబడటంగాని అరుదైపోయింది. జిజ్ఞాసువులైనవారికి గ్రంథం లభించకపోవడం వల్ల, సంస్కృత మూలగ్రంథాధ్యయనం కష్టసాధ్యం అయినందువల్ల పలువురికి ఈ శాస్త్రాధ్యయనంపట్ల విముఖత ఏర్పడుతూవున్నది.

ఆంధ్రప్రాంతంలో ఆయుర్వేదవ్యాప్తికి గ్రంథరచన తెలుగులో జరగవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ముఖ్యంగా ప్రమాణ మౌలికగ్రంథాలు సర్వత్రా సులభమైన వాడుక భాషలోనే అనువదింపబడి ప్రచురింపబడాలి. ఈవిషయాన్ని నేను ఆయుర్వేద విద్యార్థిగా ఉన్నకాలంలోనే గ్రహించి మాగురుపాదులు శ్రీ శ్రీకంఠమూర్తిగారి ఆశీస్సులతో ఈ గ్రంథానువాదాన్ని ప్రారంభించాను. ఇది తెలుగు వైద్య సహోదరులకు విద్యార్థులకు ప్రయోజనకరంగా తప్పక ఉపయోగపడుతుందని నా అభిప్రాయము. కొన్నేళ్ళుగా నా ఈ ప్రయత్నానికి సహృదయులు, ఆయుర్వేదాభిమానులు ఆదరంతో నన్నాశీర్వదించి, ఇతోధికంగా తెలుగువారికి ఆయుర్వేద సేవ చేయడంలో నాకృషిని సఫలీకృతంచేయగలరని ఆశిస్తున్నాను.

ఇందు పొరపాట్లు ఏమైనావుంటే పాఠకసహృదయులు వానిని నాకు తెలియపరచినచో పునర్ముద్రణంలో సవరించు కుంటాను.

మా గురుదేవుల ఆశీఃప్రభావంతో ఈ గ్రంథానువాదాన్ని 1977లోనే పూర్తిగావించినా ప్రచురణకు వీలు కలుగలేదు. దీనికి ముఖ్యకారణం ఆయుర్వేదగ్రంథాల ప్రచురణపట్ల ప్రకాశకులెవ్వరూ ఆసక్తిచూపకపోవడమే. నన్ను ప్రోత్సహించి గ్రంథానువాదము గావింపజేసిన మా గురువరేణ్యులు శ్రీ శ్రీకంఠమూర్తి గారికి త్రికాలములందును సాష్టాంగ వందనములను అర్పించుకుంటున్నాను.

నేను అర్థించినదేతడవుగా తమకు తగినంత తీరికలేక పోయిననూ. నా అనువాదముచదివి మూలగ్రంథముతో సరి పోల్చి యీగ్రంథమునకు పీఠికను వ్రాసిన డా॥ ఇటికాల సంజీవ రావు, ప్రాజెక్ట్ ఆఫీసర్ అండ్ హెడ్ ఆఫ్ ది రిసెర్చ్ డిపార్ట్ మెంట్ (ఆయుర్వేద) గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్, గారికి కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించు కుంటున్నాను.

కర్నాటక విశ్వవిద్యాలయ టెక్స్ట్ బుక్ డైరెక్టరేట్, ధార్వాడ వారు ఈ గ్రంథానువాదమునకు ప్రచురణకు అనుమతించినందుకు వారికి నా కృతజ్ఞతాపూర్వక అభివందనములు.

రాజమహేంద్రవర ప్రభుత్వకళాశాలా ఆంధ్రప్రాధ్యాపకులు డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు **M.A., Ph. D.,** గారు అత్యంతాదరణతో నావ్రాతప్రతిని సరిదిద్ది తోడ్పడినందులకు వారికి సదా కృతజ్ఞుడనై నమస్కరించుచున్నాను.

విద్వాన్ బ్రహ్మశ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు నాయందు ప్రతివాత్సల్యముతో ఈ గ్రంథముద్రణమును గావించియిచ్చినందులకు వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్సుల నర్పించుకొనుచున్నాను.

త్యాగరాజనగర్
రాజమండ్రి—1
9—3—1980

వైద్యగంటి కల్యాణశర్మ.

ఓం గణేశాయ నమః

# అధ్యాయం 1

# విషయ ప్రవేశం

ఆయుర్వేద శాస్త్రోక్త మూలసిద్ధాంతము లన్నింటిలోకి "దోష ధాతు మలా మూలం హి శారీరం" (శరీరానికి దోష ధాతు మలములే మూలకారణము) అను సిద్ధాంతము అతి ప్రధానమైనది. ప్రాచీనమైనదికూడా. (1) వాతపిత్తకఫము లనబడే మూడు ద్రవ్యరూప శారీరకదోషాలు, రజస్సు తమస్సు అనే గుణాత్మకమైన రెండు మానసిక దోషాలు. రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రం అనే సప్తధాతువులు (మరియు స్తన్యం, ఆర్తవం, సిరా, త్వక్, స్నాయు, కండరాలు మొదలగు ఉపధాతువులు. ఈ ధాతువుల సారరూపమైన ఓజస్సు, పురీష, మూత్ర, స్వేదములనే త్రిమలాలు - వీటి అన్నింటియొక్క సువ్యవస్థిత సంయోగ రూపమే ఈ శరీరము. ఈ శరీరంలోని ప్రతికణం, అణువు, ఈ పై రస రక్తాది సప్తధాతువుల అసంఖ్యాకమైన అతిసూక్ష్మ పరమాణువులవల్లనే నిర్మింపబడ్డది. (2) త్రిదోషమల ప్రాబల్యమువల్ల, శక్తివలన ఈ అతిసూక్ష్మ కణా లన్నింటిలోను వాటి వాటి వ్యాపారాలు నిర్వర్తించబడతాయి. ఈ కార్యనిర్వహణకు అత్యంత ఆవశ్యకమైన చేతనాశక్తిని ప్రాణశక్తిని ఆత్మతత్వం శరీరం అంతట ప్రవేశింపజేసి నిర్వహిస్తూ ఉంటుంది. (3) ఈ ఆత్మ సంయోగంచేతనే అచేతనమైన ఈకట్టెలో చైతన్యం కల్గుతుంది. (4) ప్రాణి నిలుస్తూ జీవయాత్ర సాగతూ ఉంటుంది. ఆత్మఉన్న శరీరమే సజీవశరీరము. ఈ సజీవశరీరముయొక్క కణకణాల్లోనూ జీవచైతన్య లక్షణాలైన సృష్టి స్థితిలయాలు అనవరతం సాగతూనే ఉంటాయి. ఈ విధంగా చేతన శరీర భౌతికస్థూల నిర్మాతలైన త్రిదోష సప్తధాతు త్రిమలాల స్వరూపస్వభావాలలో అనుక్షణం కొంచెం కొంచెం మార్పులు కల్గుతూన్నను వాటి పరిమాణ, గుణ, కర్మలను శరీరంయొక్క వయస్సుకు తగినట్లుగ సిద్ధాంత

చేయవచ్చును. (5) ప్రామాణికమైన ఈ నిర్ధారణస్థితిని సామ్యమని, ప్రకృతి యని, దాని వివరణను తెలిపే శాస్త్రాన్ని ప్రకృతి విజ్ఞానమని అందురు. (6)

ప్రకృతివిజ్ఞానం అంటే త్రిదోష సప్తధాతు త్రిమలములయొక్క సామ్యస్థితిని తెలిపే శాస్త్రము. శరీరంలో బాహ్య అభ్యంతర అవయవాల సహజస్థితి, సామ్యత, వాటి లక్షణాలు, వాని కర్మలు, మరియు వాటి ప్రయోజనాలు అనువానిని గూర్చి తెల్పుతుంది.

మానవుడు నిత్యము సేవించే అనియమిత ఆహార విహారాదులు, అలవాట్లు, బాహ్యవాతావరణంలో వచ్చే మార్పులు మొదలైన కారణాల ఫలితంగా దోష ధాతుమలములయొక్క సహజప్రమాణ గుణకార్యములలో తీవ్రమైన వ్యత్యాసాలు కల్గుతూ ఉంటాయి. ఈ వ్యత్యాసాన్ని వైషమ్యం అనీ వికృతి యనీ అంటారు. ఈ వికృతినిగూర్చి పూర్తిగా వివరించే శాస్త్రమునే వికృతి విజ్ఞానం అందురు. (7)

పైని చెప్పిన దోష ధాతు మలాల విషమస్థితికి కారణాలు, ఈ విషమ స్థితిలో శరీరములో జరిగే బాహ్య అభ్యంతరిక మార్పులు, రోగోత్పత్తి క్రమము, రోగలక్షణాలు మరియు రోగపరిసమాప్తి వీటన్నింటిని వివరంగా తెలియజెప్పేదే వికృతివిజ్ఞానం. దీనిప్రత్యేకత ఏమిటంటే ఇందులో రోగం నిర్దేశింపబడుతుంది. నిశ్చయ పూర్వకంగా చెప్పబడుతుంది. మరియుశరీరంలో రోగప్రాదుర్భావానికి కారణాలు ఇవి అని చెప్పేదే రోగ విజ్ఞానము (8)

గ్రంథములు :- ఆయుర్వేద మూలగ్రంథాలైన చరకసంహిత, సుశ్రుత సంహిత, అష్టాంగ హృదయం మున్నగువాటిలో ఈపై దోష ధాతుమలముల సంపూర్ణ వివరణ, వాని సహజస్థితి, వైషమ్యస్థితి, సంపూర్ణంగా వాని వర్ణన, 'సూత్రస్థానం' అనే అధ్యాయంలో వివరింపబడ్డాయి. వ్యాధి సంప్రాప్తికి కారణాలు, వ్యాధిలక్షణాలు, వ్యాధిపరిసమాప్తి, వీని వివరణ

సంపూర్ణంగా సూత్రస్థానంలో ఉంటుంది. కాని చికిత్సాస్థానంలో వ్యాధి లక్షణాలతో బాటు వాని నివారణోపాయం కూడా చెప్పబడుతుంది ఈ పై వికృతి విజ్ఞానం గూర్చి, రోగవిజ్ఞానం గూర్చి, విపులమైన, పరిపూర్ణమైన జ్ఞానం కావాలంటే పై ఆర్ష గ్రంథాలనే పఠించాలి. కాని వాటియందు విషయప్రతిపాదన క్రమరహితంగాను, క్లిష్టంగాను ఉండటంమూలమున వాటి అధ్యయనం సామాన్యులకు కష్టతరమే. పై ఉద్గ్రంథాలను చదివి అర్థం చేసికోలేని అల్పబుద్ధిమంతులైన వైద్యులకు వ్యాధి విజ్ఞానాన్ని చక్కగా సులభంగాబోధించేనిమిత్తమై క్రీ.శ. 7,8 శతాబ్దములలో వంగదేశస్థ వైద్య, ఇందుకరాత్మజుడైన మాధవకరుడు 'రుగ్వినిశ్చయము' అనే గ్రంథాన్ని రచించాడు. ఈయన పై ఆర్ష గ్రంథాలసారాన్ని క్రోడీకరించి, సారాంశాన్ని సులభతరం చేసి, రోగలక్షణాలైన నిదాన, పూర్వరూప, రూప ఉపశయ, సంప్రాప్తుల విపుల వివరణతో ఈరుగ్వినిశ్చయాన్ని రచించాడు. ఈగ్రంథము సంగ్రహంగా ఉన్నప్పటికీ మూలగ్రంథాన్ని చదివితే కల్గేఆనందం, ఉత్సుకత, విషయజ్ఞానం కల్గుతాయి సరళమైన శైలి, క్రమమైన వివరణ, సారవంతమైన భావాలతో నిండి, నాతి సంక్షేప విస్తరమైన 'ఈ రుగ్వినిశ్చయం' అనే గ్రంథము మాధవునకు 'నిదానే మాధవః శ్రేష్ఠః' అన్న ప్రశస్తిని సంపాదించి పెట్టినది. ఈ గ్రంథము 'రుగ్వినిశ్చయం' అని పేరు పెట్టబడినా, 'మాధవనిదాన' మను పేరుతోనే ప్రసిద్ధి పొందినది. నాటినుండి నేటివఱకూ వ్యాధివిజ్ఞానాన్ని సమ్యగధ్యయనం చేయడానికి ఈమాధవనిదానాన్ని మించిన గ్రంథము మఱొక్కటి లేదు. అందువలననే 'బృహత్త్రయి' తరువాత అంతటి పాండిత్య ప్రకర్ష కల్గిన లఘుత్రయిలో మొదటిస్థానాన్ని పొందినది. ఈ గ్రంథము ఉపయోగాన్ని, జనప్రియతనూ గమనించి క్రీ॥శ॥ 14వ శతాబ్దిలో 'విజయరక్షితుడు' అను నతడు ఈగ్రంథానికి మధుకోశ వ్యాఖ్యానాన్ని అత్యంతరమణీయంగా సంస్కృత భాషలో వ్రాశాడు. ఈయన ముదిమివలన 8 అధ్యాయాలు మాత్రమే వ్రాసి తనువు చాలించగా ఆయన శిష్యుడగు శ్రీ కంఠదత్తుడు గుర్వాజ్ఞ మేరకు మిగిలిన అధ్యాయాలను చక్కని వ్యాఖ్యానంతో అదే శైలిలో పూర్తి చేసాడు. ఈ మధుకోశ వ్యాఖ్యానం శతాబ్దాల క్రితం

వ్రాయబడ్డా ఈనాటికీ నూతనత్వాన్ని కలిగి ఉంది. తరువాత క్రీ.శ. 18వ శతాబ్దంలో నివసించిన వాచస్పతి మిశ్రుడనే వైద్యుడు 'ఆతంక దర్పణం' అనే పేరుతో మాధవ నిదానానికి రెండవ వ్యాఖ్య వ్రాసాడు. పిదప ఈమధ్య ఇరువదవశతాబ్ద ఆరంభములో వంగదేశ వైద్యుడైన'గణనాథ సేన్' గారు'సిద్ధాంతనిదానం' అనే పేరుతో క్రొత్తగ్రంథాన్ని రచించి, ఇందులో ప్రాచీన మాధవనిదానంలో వివరింపని కొన్ని క్రొత్తవ్యాధులను, వాటి నిదానాన్ని వివరించాడు. ఈ వ్యాఖ్యలన్నీ కూడా చదివి అర్థంచేసికోవ టము క్రొత్తగా ఆయుర్వేదశాస్త్రప్రవేశం చేసేవారికి అత్యంత ఉపయో గము.

అధ్యయనక్రమము :- ప్రాకృతవిజ్ఞానం పూర్తిగా అవగాహన అయినపిదపనే వికృతివిజ్ఞానం అధ్యయనంచేయాలి. ఆరోగ్యస్థితిలో శరీరం లోని అవయవాల, మరియు వివిధశారీరక క్రియల సహజస్థితి, వాటిగుణ కర్మలు తెలియని వైద్యుడు వాటి వికృతస్థితి, ఆస్థితిలో వచ్చేమార్పులు, వాటివల్ల శరీరంలో వచ్చే రోగలక్షణాలు తెలిసికోవడానికి అర్హుడు కాడు. కనుక ధాతుసామ్యస్థితి ఆరోగ్యమనియు, దోషవికృతస్థితి రోగమనియు పూర్తిగా అవగాహన చేసికోలేని వైద్యుడు ఇక చికిత్స ఏమి చేయగలడు ? కనుక శారీరకసహజస్థితిని రోగవిజ్ఞాన్ని సమగ్రంగా అధ్యనం చేసినతర్వా తనే,ఆత్మవిశ్వాసంతో వైద్యుడు శరీరకసామాన్యస్థితినివిశ్లేషించి, ఇది రోగ లక్షణమా ? లేక ఆరోగ్యలక్షణమా? అను మీమాంసకు లోనుగాకుండా సత్వరనిర్ణయం చేయగల్గుతాడు. కనుక శారీర సహజస్థితి అంటే ప్రకృతి విజ్ఞానము. దీనిని సమగ్రంగా తెలిసికొన్నతర్వాతనే వికృతి లేదా విషమం అంటే ఏమిటో తెలిసికోవాలి.

శాస్త్రాన్ని తెలిసికొని విజ్ఞానాన్ని పొందటం రెండువిధాలుగా ఉం టుంది. మొదటిది ఆర్ష గ్రంథ అధ్యయనము. రెండవది_వీటి అధ్యయనంవల్ల కలిగే శాస్త్రజ్ఞానం చేత ప్రత్యక్ష కర్మద్వారా అనుభవజ్ఞానం పొంద టం. ఈ రెండిటి, సంయోగంచేత అత్యుత్తమమైన నిశ్చయజ్ఞానము లభి స్తుంది. (9) ఈ రెంటిలో ఏఒక్కటి లోపించినా - నిశ్చయజ్ఞానం కొర

పడుతుంది. అందువల్ల పరిపూర్ణమైన నిశ్చయాత్మక అనుభవజ్ఞానం కావాలంటే శాస్త్రాధ్యయనం తప్పకుండా చేయాలి. ఈ చదివినదాన్ని ఆచరణలో కూడ చూపించాలి.

వికృత విజ్ఞానాన్ని స్థూలంగా రెండుభాగాలుగా విభజింపవచ్చును. (1) సర్వరోగసంప్రాప్తి (2) ప్రత్యేక రోగసంప్రాప్తి.

సర్వరోగసంప్రాప్తి - అన్నిరోగాలకు అన్వయించుకునే లాగున సామాన్యమైన రోగకారణము, (నిదానము) పూర్వరూపము, రూపము, ఉపశయం, సంప్రాప్తి - అనే 5 లక్షణాల (అంగాల) సంపూర్ణ వివరణతో కూడినదే సర్వరోగసంప్రాప్తి.

ప్రత్యేకరోగసంప్రాప్తి - ప్రత్యేకంగా ఒక్కొక్క రోగానికి వాటి వాటి నిర్దిష్టమైన ప్రత్యేకకారణము, వాటి పూర్వరూపము, రూప, ఉపశయ, సంప్రాప్తులు వీటి యన్నింటి సమగ్రవివరణ ప్రత్యేకరోగసంప్రాప్తిలో ఉంటాయి. మొదటగా సర్వరోగసంప్రాప్తిని క్షుణ్ణంగా తెలిసికోవాలి. దాని తరువాత నే ప్రత్యేకంగా ఒక్కొక్క రోగకారణాన్ని తెలిసికొనేందుకు వీలవుతుంది. ఇలా కాకుండా మొట్టమొదటే వివిధరోగాల ప్రత్యేక రోగకారణము తెలిసికుంటూ పోతే సర్వరోగ సంప్రాప్తి జ్ఞానము లోపిస్తుంది. అదే కారణం చేత చరక సుశ్రుతాది ఆర్షగ్రంథాలలో కూడా నిదానస్థానము మొదటి అధ్యాయంలో "నిదానపంచకం" అనే శీర్షికతో సర్వరోగ సంప్రాప్తిని, దాని ఆవశ్యకతను విశదంగా విపులీకరించారు. అందువల్లనే మాధవనిదానంలోని మొదటి అధ్యాయానికి కూడా "పంచలక్షణనిదానం" అనేపేరు ఒసంగబడినది. అన్నిరోగాల ఉత్పత్తి కారణాలను వాటిలక్షణాలను, సూక్ష్మముగా తెలియజెప్పటమే మాధవ నిదాన ముఖ్యోద్దేశము.

## సర్వరోగ సంప్రాప్తి - దాని వివరణ :

మానవుడు జన్మించినది మొదలు ఆఖరుశ్వాస వదిలేదాకా సాగే ఈ జీవయాత్రలో శారీర కార్యనిర్వహణకు మూలకారణాలైన దోషధాతు మలాలు వాటివాటి సామ్యస్థితిలో ఉంటూ, శారీర ఆరోగ్యాన్ని రక్షిస్తూ

ఉండడానికి అనవరతం ప్రయత్నం చేస్తుంటాయి. కాబట్టి సామాన్యంగా మనిషికి ఆరోగ్యకాలములో ఏవిధమైన బాధా లేకుండా, శరీరం సుఖాన్ని అనుభవిస్తూ ఉంటుంది. కాని మితిమీరిన తిండి, సరిపడని ఆహార విహారాదులు, వేళతప్పిన భోజనము, నిద్ర, అలవాట్లు మున్నగు కారణాలవలన వాతావరణముల మార్పువలన దోష ధాతుమలాల సామ్యస్థితిలో మార్పు వచ్చి వాటిచే నిర్వహింపబడే బాహ్య అభ్యంతర అవయవాల కార్యనిర్వహణలో కూడా మార్పువస్తుంది. ఈ మార్పు చేత శరీరారోగ్యం విషమించి కొంతదుఃఖాన్ని, బాధను, అసౌఖ్యాన్ని కలిగిస్తుంది. శరీరానికి కలిగే ఈ అసౌఖ్యం దుఃఖం రోగం అనబడుతుంది. (10) ఈ వివిధరోగాల సంపూర్ణ జ్ఞానం ఉంటేనే తప్ప వాటి నివారణ సాధ్యం కాదు. అందువల్లనే వైద్యుడైనవాడు మొట్టమొదట రోగాన్ని నిర్ణయించి అనువైన చికిత్సకు తలపడాలి. (11) అని ఆయుర్వేదశాస్త్రం గట్టిగా ఘోషిస్తోంది.

## రోగాల్ని తెలిసికొనే ఉపాయాలు .-

రోగాన్ని తెలిసికొనుటకు 5 సులభమైన అతిముఖ్యమైన మార్గాలు లేదా సాధనాలు ఉన్నాయి. (12) అవి ఏమిటంటే

(1) నిదానం .- అంటే రోగకారణము.

(2) పూర్వరూపం - రోగం వల్లకన్పించే సామాన్య లక్షణాలు

(3) రూపం :- రోగంయొక్క నిర్దిష్టలక్షణాలు.

(4) ఉపశయం :- (అనుపశయ) : కొన్ని ఔషధాలు, ఆహారం మరియు అలవాట్ల వలన రోగం శమించడం లేదా ఎక్కువ అవడం.

(5) సంప్రాప్తి - వ్యాధి ప్రారంభమైన క్షణంనుంచీ చివరిదాకా శరీరంలో కన్పించే క్రమమైన వికృతి జన్య లక్షణాలు.

ఈ పైని వివరించిన నిదాన, పూర్వరూప, రూప, ఉపశయ, సంప్రాప్తి-ఈ 5 ప్రత్యేకంగా ఒక్కొక్కటి రోగనిర్ణయానికి సహాయపడతాయా లేక అయిదు కలిపి రోగనిర్ణయానికి సహాయపడతాయా? అన్న ప్రశ్న ఇక్కడ సహజంగా ఉదయిస్తుంది. ప్రతి రోగంలోను పై అయిదు

లక్షణాలను క్షుణ్ణంగా తెలిసికొని రోగనిర్ణయం చేయటం శ్రేష్ఠమైనపద్ధతి. ప్రతివైద్యుడు ఇందుకే ఇదేవిధంగా ప్రయత్నించాలి. కాని ప్రత్యేక వ్యాధులలో పై అయిదు నిదాన లక్షణాలను కలిపి రోగనిర్ణయం చేసే కన్నా - ఒక్కొక్క లక్షణం స్వతఃగా రోగనిర్ణయానికి ఉపయోగ పడుతుంది.

ఉదాహరణకు -

## నిదానం (కారణం) తో రోగనిర్ణయం :- (14)

మట్టితినుటవల్ల పాండురోగం మక్షికాభక్షణచే ఛర్ది, వేళతప్పి భోజనం చేయడం వల్ల అజీర్ణం, క్రొత్తబియ్యంఅన్నం తిన్నందువల్ల ప్రమేహ వ్యాధి-ఈవిధంగా కొన్ని రోగలక్షణాలకు వాటివాటి ప్రత్యేకనిర్దిష్టమైన కారణం అంటూ ఒకటి ఉంటుంది. ఈవిధమైన కారణాల వృత్తాంతాన్ని రోగి కనుక వివరించినట్లైతే ఈనిదానం ఒకటివల్లనే వైద్యుడు సులభంగా రోగనిర్ణయం చేయగల్గుతాడు.

## పూర్వరూప జ్ఞానంతో రోగనిర్ణయం (15)

ఒకేకారణంతో అనేక రోగాలు ఉద్భవిస్తాయి. అటువంటప్పుడు కేవలం ఈకారణం (నిదానం) వల్ల రోగ నిర్ణయం చేయజాలము. కొన్ని రోగాలను ప్రత్యేకంగా వాటి పూర్వజ్ఞానంవల్ల నిర్ణయింపవచ్చును.

ఉదాహరణకు :-

పిత్తవృద్ధి చేసే ఆహారపు టలవాట్లవల్ల రక్తపిత్తం, ఆమ్లపిత్తం అనే 2 వ్యాధులు జన్మించే అవకాశం ఉంది. కాని హృదయంలో శూల. రక్తస్రావం, దౌర్బల్యం మున్నగు లక్షణాలు కన్పిస్తే అది రక్తపిత్తమనీ - పుల్లనిత్రేణుపులు, దాహం, భ్రమ, తలత్రిప్పుట, వికారం మున్నగు లక్షణాలు ఉద్భవిస్తే అది ఆమ్లపిత్తరోగమనీ, నిర్ణయింపవచ్చును. మరియు పసుపురంగుతో కూడిన మూత్రంలో రక్తం, రక్తపిత్తవ్యాధిలోనూ పిత్తజ ప్రమేహంలోనుకూడా, కన్పిస్తుంది. కాని ప్రమేహరోగానికి పూర్వరూపాలైన నోటితీపెకనము, శరీరం బరువు, అతిమూత్రప్రవృత్తి మున్నగు లక్షణాల

వృత్తాంతం లేకపోయినట్లయితే, అది రక్తపిత్తంఅనీ, ఉన్నట్లైతే ప్రమేహ రోగం అనీ, నిర్ణయింప వచ్చును.

## రూపజ్ఞానంతో రోగనిర్ణయం (16)

ప్రతి రోగానికి నిర్దిష్టంగా కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉంటూ ఉంటాయి. శాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన వైద్యునకే రోగిని పరీక్షించి లక్షణాలను తెలిసికొని రోగనిర్ణయం చేయడం సాధ్యపడు తుంది.

ఉదాహరణకు :

శరీర ఉష్ణం ఎక్కువైతే జ్వరం వచ్చిందనీ, చిక్కని తెల్లనిమూత్రం ఎక్కువగా విసర్జిస్తూ ఉంటే ప్రమేహరోగమనీ, ఇదేవిధంగా కొన్ని ప్రత్యేక లక్షణాలవల్ల రోగనిర్ణయం చేయవచ్చును.

అనుభవశాలియైన వైద్యుడు నూటికి 90 వంతులు రోగనిర్ణయం ఈ ప్రత్యేక లక్షణాల ఆధారంతోనే చేయగల్గుతాడు.

## ఉపశయజ్ఞానంతో (సాత్మ్యంతో) రోగనిర్ణయం. (17)

రెండు వేర్వేరు రోగాలలో కనపడే లక్షణాలు ఒక్కలాగే ఉండ వచ్చును. లేదా ఆయా లక్షణాలు అస్పష్టంగాను, అత్యల్పంగాను కూడా ఉండవచ్చును. ఇటువంటపుడు వ్యక్తమైన లక్షణాలనుబట్టి రోగనిర్ణయం చేయడం కష్టసాధ్యం. అపుడు వైద్యుడు కొన్ని ఔషధాలు, ఆహారాలు అలవాట్లమూలకంగా రోగికి, అవి - హితకరములో అహితకరములో గమ నించి వాటివల్లవచ్చే లక్షణాలు గమనించి, రోగనిర్ణయం చేయగల్గుతాడు.

ఉదాహరణకు :

ఒకరోగికి ఒక తొడ చేష్టాహీనమై పడిఉంటుంది. ఈలక్షణం ఊరు స్తంభరోగానిది. మరియు శుద్ధవాతవ్యాధికూడా కావచ్చును. అందుచే రోగనిర్ణయం సంశయంలో పడుతుంది. అటువంటప్పుడు ఆప్రదేశానికి స్నేహక్రియచేస్తే బాధ అధికమైన యెడల, అది ఊరుస్తంభవ్యాధి యని.

బాధలు ఉపశమించిన అది వాతవ్యాధి యనీ నిర్ణయింపవచ్చును. ఎందు కంటే ఊరు స్తంభవ్యాధిలో వాతానికి కఫానుబంధముచే స్నేహక్రియ కఫోద్రేకాన్ని కల్గించి బాధను అధికం చేస్తుంది. అదే స్నేహక్రియ వాత వ్యాధిలో రూక్షతను పారద్రోలి బాధను ఉపశమింపఁ జేస్తుంది. ఈ విధంగా సాత్మ్య, అసాత్మ్య (ఉపశయ, అనుపశయ) ముల ద్వారా రోగ నిర్ణయం చేయవచ్చును.

## సంప్రాప్తి జ్ఞానం ద్వారా రోగనిర్ణయం .- (18)

రోగావస్థలో శరీరసంబంధ కార్య నిర్వహణకు మూల భూతాలైన దోషధాతు మలముల సామ్యస్థితిలో కలిగే మార్పుల పరంపరయే సంప్రాప్తి అనబడుతుంది ప్రతిరోగంలోనూ ఈదోషవైషమ్యపరంపర నిర్దిష్టంగా కనబడుతుంది. శాస్త్రగ్రంథాలలో ఈసంప్రాప్తి వివరణ చాలా విపులంగా ఉంది. శాస్త్రజ్ఞుడైన వైద్యుడు రోగిని పరీక్షించి, అతని శరీర క్రియా కలాపములలో జరిగే మార్పులను, తద్ద్వారా వ్యక్తమగు లక్షణాలను, గుర్తించి; రోగాన్ని నిర్ణయిస్తాడు.

ఉదాహరణకు - ఒకరోగిలో రసధాతువు వృద్ధి చెందిన లక్షణాలు, రక్తధాతువు క్షీణించిన లక్షణాలు, శరీరసహజవర్ణం మారి పాండువర్ణం వచ్చుట - ఈమూడు లక్షణాలు ఏకకాలంలో కనిపిస్తే ఆరోగి పాండు రోగగ్రస్తుడయ్యాడని నిర్ణయింపవచ్చును. ఎందువల్లనంటే శాస్త్రప్రకారం ఈ లక్షణ సముదాయం పాండురోగాన్ని సూచిస్తుంది.

ఇదే విధంగా ఈపంచలక్షణ నిదానాలు, ప్రత్యేకంగా ఒక్కొక్కటీ, మఱియు వాటి సముదాయ జ్ఞానం, ప్రత్యేక రోగాన్ని నిర్ధారించ డానికి కూడా ఉత్కృష్ట సాధనాలుగా ఉన్నాయి. (19) అందుచే యశఃకాముడైన వైద్యుడు ఈ నిదాన పూర్వరూపాది పంచ లక్షణ రోగ జ్ఞానోపాయాలను స్పష్టంగానూ, విశదంగానూ తెలిసి కోవడం అత్యావశ్యకం. మఱియు నిదాన పరివర్జనకు, చికిత్స చేయడానికి ఆరోగ్య రక్షణకు కూడా ఈ నిదాన పంచక జ్ఞానం అత్యంతావశ్యకము.

## అధ్యాయ సారాంశము

(1) శరీర సహజక్రియా కలాపాలలో వికృతి యంటే శారీరకార్య నిర్వహణకు మూల స్తంభాలైన దోషధాతు మలముల వైషమ్యస్థితిని తెల్పుతుంది :- ఈ వికృతి విజ్ఞానాన్ని పైదోషధాతు మలాల సామ్యస్థితిని ఆరోగ్యస్థితిలో వాటి గుణకర్మలను అంటే ప్రకృతివిజ్ఞానాన్ని అధ్యయనం చేసిన మీదటే తెలిసికోవాలి.

(2) ఈ వికృతి విజ్ఞానం సర్వరోగ సంప్రాప్తి, ప్రత్యేక రోగ సంప్రాప్తి అనే రెండు భాగాలుగా విభజింపబడి ఉంది.

(3) నిదాన పంచకాలైన నిదాన పూర్వరూప, రూప, ఉపశయ, సంప్రాప్తులు ప్రత్యేకంగా ఒక్కొక్కటిగానూ మరియూ సమగ్రంగా అన్నీ కలిసీ కూడా రోగనిర్ధారణలో సాయపడతాయి.

## అధ్యాయం 1

### శాస్త్రప్రమాణాలు :-

1. దోషధాతు మలా మూలం
   సదా దేహస్య తం చలః ।
   ఉచ్ఛ్వాసో శ్వాస నిశ్వాస
   చేష్టా వేగ ప్రవర్తనైః ॥
   సమ్యగ్గత్యాచ ధాతూనాం ... (అ. హృ. సూ 11/17)

2. శరీరావయవాస్తు ఖలు పరమాణు భేదేన అపరి సంఖ్యేయాః భవంతి ।
   (చ. శా. 7/17)

3. నిర్వికారపరః స్త్వాత్మా సత్త్వభూత గుణేంద్రియైః ।
   చైతన్యే కారణం నిత్యో ద్రష్టా పశ్యతి హిక్రియాః ॥
   (చ. సూ. 1/52)

4. శరీరేంద్రియ సత్త్వాత్మ సంయోగో ధారి జీవితం ।
నిత్యగశ్చాను బంధశ్చ పర్యాయై రాయు రుచ్యతే ॥
(చ. సూ. 1/43)

5 రాత్రి దిన భోజనానాం తాసు తాస్వవస్థాసు శ్లేష్మాది
ప్రకోపాదీనాం నిత్యం ధాతు వైషమ్య మస్తి .. తేన
దివారాత్ర భోజనావస్థాది జనితం ధాతువైషమ్య
ముద్వేజక వికారాకర్తృత్వేన సుఖమితి వ్యవహ్రియతే ।
(చక్రపాణి చ. సూ. 9/4)

6. వికారో ధాతువైషమ్యం...సామ్యం ప్రకృతి రుచ్యతే
(చ. సూ. 9/4)

7. నిర్దిశ్యతే వ్యాధి రనేనేతి నిదానం...నిర్దిశ్య దీయతే ।
ప్రతిపాద్యతే వ్యాధిరనేనేతి నిదానం ..వ్యాధి నిశ్చయ కరణం
నిదానం
నిధీయతే నిబధ్యతే వ్యాధి రనేనేతి కృత్వా (మధుకోశ 1/4)

8. ప్రకృతిజ్ఞానానంతరత్వాత్ వికృతి జ్ఞానస్య...
(చక్రపాణి. చ. చి 15/3)

యతః ప్రకృతిజ్ఞానాధీనం వికృతిజ్ఞానం భవతి...
ప్రకృతి జ్ఞానాంత రీయకత్వాత్ వికృతి జ్ఞానస్య ..(చక్రపాణి)

9. ప్రత్యక్షతోహి యద్దృష్టం శాస్త్రదృష్టం చయద్భవేత్।
సమాసతః తదుభయం భూయోజ్ఞాన వివర్ధనమ్ ॥ (సు. సూ. 5/48)

10 ...దుఃఖసం యోగాత్ వ్యాధయః । (సు. సూ 24/4)

11. రోగమాదౌ పరీక్షేత తతో ఽనంతర మౌషధమ్ ।
తతః కర్మ భిషక్ పశ్చాత్ జ్ఞానపూర్వం సమాచరేత్ ॥
(చ. సూ. 20/20)

12. నిదానం పూర్వరూపాణి రూపాణ్యుపశయ స్తథా ।
సంప్రాప్తిశ్చేతి విజ్ఞానం రోగాణాం పంచధా స్మృతమ్ ॥
(మా. ని. 1/4)

13. ఏతే పంచ వ్యస్తాః సమస్తాశ్చ వ్యాధి బోధకాః ।
(మధుకోశ 1/4)

14. యథా మృద్భక్షణాత్ పాండురోగః ।
మక్షికా భక్షణాచ్ఛర్ది రవశీయతే. (మధుకోశ. (మా. ని) 134)

15. తస్మాత్ కేవల నిదానా న్న వ్యాధి జ్ఞానం భవతీతి
పూర్వ రూపాదీనాం ఉపాదానమితి .. । (మధుకోశ. 1/4)

16. అసతి రూపాభిధానే వ్యాధే రశేష విశేషేణ ... ।
(మధుకోశ 1/4)

17. అసత్యుపశయాభిధానే సంకీర్ణ లక్షణే అనభివ్యక్తే
లక్షణే వా వ్యాధా విశేష బోధో న స్యాత్ ॥
(మధుకోశ 1/4)

18. అసత్యాం చ సంప్రాప్తౌ పూర్వరూపాది ప్రతీతస్యాపి
వ్యాధే శ్చికిత్సోపయోగినో అంశాంశ వికల్పనా
బలకాల దేశ ప్రతీతే శ్చికిత్సా విశేషో న స్యాత్ ।
(మధుకోశ. మా. ని. 1/4

19. తస్మాత్ పంచాపి నిదానాదయో వక్తవ్యాః । (మధుకోశ. 1/4)

—•••—

# అధ్యాయము 2

## నిదాన వివరణ :-

ఐదువిధాలైన రోగజ్ఞాన ప్రాయాల్లోకి మొదటిదైన నిదానం అనే పదానికి రోగకారణం (1) అని యర్థము. ఈఅర్థమే ముఖ్యమైనది, ప్రధానమైనది, కూడా. అందుమూలంగా ముందు ముందు ఈగ్రంథములో వచ్చే అన్ని సందర్భాలలోనూ నిదానం అనే శబ్దానికి రోగానికి ముఖ్యకారణం అని అర్థము చెప్పుకోవాలి. నిదానశబ్దానికి నిమిత్త, హేతు, ఆయతన, ప్రత్యయ, ఉత్థాన, కారణ, మూల, యోని, ప్రకృతి అనే అనేక పర్యాయ పదాలున్నాయి. (2)

రోగకారణాన్ని తెలిసికొనేముందు దానికి ఆధారభూతమైన కార్యానికి సిద్ధాంతాన్ని తెలిసికోవడం అతిప్రధానం. న్యాయ, వైశేషిక దర్శనం ప్రకారం కారణ విమర్శ ఈవిధంగా ఉంది.

దేనిచేత కార్యం జరుగుతుందో దానిని కారణం అంటారు. కారణం లేక కార్యమంటూ ఉండదు. కార్యము ఎల్లప్పుడు కారణాన్నే అనుసరించి ఉంటుంది.

ఈకార్యకారణాలు రెండిటికీ నికటసంబంధం ఉంది. మరియు ప్రపంచం లోని పదార్థాలు కూడా ఈకార్యకారణ స్వరూపాలే. ఈకారణము సమవాయి, అసమవాయి, మరియు నిమిత్తము అని మూడువిధాలు. కార్యకారణాలు ఒకటిగా ఉన్నప్పటికీ కారణ నాశంతోపాటు కార్యం కూడా నాశనమైతే అటువంటి కారణాన్ని 'సమవాయి' అంటారు.

ఉదాహరణకు ఇవన్నీ వస్తురూపంలోనే ఉంటాయి. ఆభరణంలోని బంగారం, బట్టలోని దారం, కుండలోని మట్టి మున్నగునవి.

(2) అసమవాయి :- కారణకార్యాలు కలసియున్నా కూడా కారణ నాశంతోపాటు కార్యనాశనం జరుగనిది అసమవాయి కారణం అంటారు. ఉదాహరణకు ఆభరణం లోని వివిధ భాగాల సంయోజనం, బట్టలో దారాల చేరిక, కుండ పెంకుల కలయిక మున్నగునవి. (3) నిమిత్తకార

ణము :_ కార్యకారణాలు వేరే అయినప్పటికీ కారణ నాశంతో పాటు కార్యనాశం జరుగనివి నిమిత్తకారణాలు. ఆభరణాన్ని తయారుచేసే కంసాలి, అతని ఉపకరణాలు; బట్టను నేసే నేతగాడు, (3) అతని మగ్గం మొ॥వి. ఈ నిమిత్త కారణాన్ని మరల ప్రధాన, గౌణ అని రెండు భాగాలుగా విభజింపవచ్చును.

ఆయుర్వేదంలో చెప్పబడ్డ రోగకారక సిద్ధాంతం కూడా పైవివరించిన దార్శనిక సిద్ధాంతానికి అనురూపమే. ఈశరీరం రస, రక్త, మాంసాది సప్తధాతు నిర్మితము. ఈ ధాతువులే శరీరం. శరీరానికి వచ్చే రోగాలు, ఈ ధాతువులనే ఆశ్రయిస్తాయి. ఇది నిశ్చయము. ధాతునాశం కనుక జనట్లయితే, ధాతునిర్మితమైన శరీరము, దాన్ని ఆశ్రయించే రోగాలుకూడా నాశనం అవుతాయి. అందువల్లనే సప్తధాతువులు రోగోత్పత్తికి సమవాయి కారణము.

ధాతువులను ఆశ్రయించిన వాతపిత్తకఫాలు అనే త్రిదోషాలు శారీరక సహజక్రియాకలాపాలు జరుపుతూ ఉంటాయి. ఈ త్రిదోషాలకు, సప్తధాతువులకూ ఎల్లప్పుడూ సంయోగం ఉండనే ఉంది. శరీరంలో రోగత్పత్తికి ఈసంయోగం అంటే దోషదూష్య (భావం) సమ్మూర్ఛనం అత్యంతావశ్యకం. ఇది రోగోత్పత్తికి అసమవాయి కారణము.

ధాతువులను ఆశ్రయించిన త్రిదోషముల వైషమ్యం ధాతువులందు కూడా వికృతిని కల్గిస్తుంది. ఈ ధాతువికృతి మూలంగానే రోగోత్పత్తి జరుగుతుంది ఈరోగప్రాదుర్భావానికి ఈదోషాలే బలిష్ఠమైన కారణాలు. అందుచేత అవి నిమిత్త కారణాలు అనబడతాయి. మానవుడు సేవించే ఆహార విహారాదులు, వాతావరణంలో కలిగే మార్పులు, మొదలైన వాటి వల్ల దోషాలు వైషమ్యాన్ని పొందుతాయి. కనుక ఈదోష వైషమ్యాన్ని నిమిత్తకారణానికి సహాయపడేగౌణ (సహకారి) కారణాలుగా విభజింపవచ్చును. ఈసహకారిగౌణ కారణాలే రోగోత్పత్తిలో ముఖ్యమైన అతికీలకమైన పాత్ర వహిస్తాయి. అందువల్లనే ఆయుర్వేదశాస్త్రం రోగవివ

రణ చేసేటప్పుడు "రోగకారణాలు" అనే పేరుతో ఈ ఆహారవిహారాదులు, ఈఋతువైషమ్యాలు వీటికే ప్రాధాన్యం ఇస్తుంది. పైగా ఈ రోగకారణాలను పరివర్జించుటయే సగము చికిత్సగా అభివర్ణించింది కూడా. ఆరోగ్యరక్షణనుగూర్చి ఉచితమైన యుక్తి యుక్తమైన సలహాలివ్వడం చికిత్సా సమయంలో పథ్యాపథ్యాలు సూచించటం మొదలైన రోగ సహకారి కారణాల జ్ఞానం వైద్యులకు ఆవశ్యకం అనే ఉద్దేశంతోనే ప్రాచీనాచార్యులు ప్రతిరోగంలోనూ ఈరోగ సహకారి (గౌణ)కారణాలనే ముంగుగా వివరించారు రోగోత్పాదనకు నిమిత్తకారణాలైన త్రిదోషాలు అసమవాయి కారణమైన దోషదూష్య సమ్మూర్ఛనం సమవాయి కారణమైన ధాతువికృతి- వీటి అన్నింటి సంయోగరూపాన్నే సంప్రాప్తి అనే పేరుతో వివరించారు.

పై త్రిదోషాలు రోగోత్పత్తికి ముఖ్యకారణాలా? కావా ? అనే ఈ విషయంలో ప్రాచీన విద్వాంసులకు నిర్దిష్టనిర్ణయం లేదు. కొంతమంది ఆచార్యులు దోషాలను సమవాయికారణమనీ కొందరు అసమవాయి అనీ మరికొందరు నిమిత్తకారణమనీ వాదించారు. కానీ ఈపైవాదాలన్నింటినీ విశ్లేషించి సుశ్రుతాచార్యుల వారు త్రిదోషాలు రోగోత్పత్తికి నిమిత్తకారణమాత్రమే అని తమ నిర్దిష్టమైన నిర్ణయాన్ని వెలిబుచ్చారు. ఏల యంటే త్రిదోషాలను విడచి జ్వరాదిరోగాల అస్తిత్వం లేకపోయినప్పటికీ త్రిదోషాలకు జ్వరాలకు నిత్యమైన సంబంధం ఏదీలేదు. మెఱపు, గాలి, వర్షము ఆకాశాన్ని విడచి ఉండనేరవు ఆకాశం నిత్యమై నిర్వికారమై ఉన్నప్పటికీ పైమెఱపు గాలి వర్షములు నిమిత్తాలు మాత్రమే. కెరటాలు, నీటి బుడగలు ఏవిధాన నీటి విశేషాలో అదే విధంగా జ్వరాదిరోగాలు వాతాది త్రిదోషాల వికారరూపమేగాని మఱొక్కటి గాదు. ఈవికారానికి మూలవస్తువుకూ ఉన్న సంబంధం సమవాయి కాదు, అసమవాయీ కాదు. అందువల్ల అది నిమిత్తకారణమే అవుతుంది. (సు సూ. స్థా 24/11). ఇదే అభిప్రాయాన్ని విజయరక్షితుడుకూడా మధుకోశ వ్యాఖ్యానంలో వ్యక్తం చేసాడు.

# 16

## రోగకారణం - దాని ప్రభేదాలు

రోగోత్పత్తికి కారణ భూతాలైన సహకారి కారణాలను 3 విధాలుగా విభజింపవచ్చును.

(1) అసాత్మ్య ఇంద్రియార్థసంయోగ (2) ప్రజ్ఞాపరాధ (3) పరిణామ - ఈపైమూడు కారణాలలోను ప్రత్యేకంగా ఒక్కొక్కటి హీన, అతియోగ, మిథ్యాయోగం అనే 3 వికల్పములు అంటే విషమయోగాలను పొందినది. ఇంకా వివరించాలంటే హీన, అతి, మిథ్యాయోగాలను పొందిన నిమిత్తకారణాలైన అసాత్మ్య ఇంద్రియార్థసంయోగ, ప్రజ్ఞాపరాధ పరిణామాలే అన్నిరోగాలకు మూలకారణములుగా (4) ఉద్ఘోషింపవచ్చును. దీనినే ప్రకృతివిజ్ఞానంలో కాల, అర్థ, కర్మలయొక్క హీన మిథ్యాతియోగాలనే పేరుతో వివరించారు. (5)

(1) అసాత్మ్యఇంద్రియార్థసంయోగ :- అంటే హానికల్గించే రీతిలో ఇంద్రియాలను, ఇంద్రియార్థాలను సంయోగింప చేయుటం. చక్షుః, శ్రోత్ర, ఘ్రాణ, రసనా, స్పర్శ అనే పంచేంద్రియాల ద్వారా క్రమంగా రూప, శబ్ద, గంధ, రుచి, స్పర్శ - అనే విషయాలను మానవుడు అనుభవిస్తూ ఉంటాడు. శరీరఆరోగ్యానికి హానికల్గింపని పద్ధతిలో ఈ ఇంద్రియాలకు, విషయాలకు కల్గే సంబంధం, ఏవిధమైన వికారం లేకుండా శరీరఆరోగ్యాన్ని కాపాడుతుంది. దీనికే సమ్యగ్యోగం అని పేరు. కొన్ని పరిస్థితులలో మనుష్యునకు ఇంద్రియాలు తత్సంబంధ విషయాలతో అకస్మాత్తుగానో లేదా అని వార్యంగానో కల్గే సంబంధం అతి తక్కువగానో, అతి ఎక్కువగానో లేదా విరుద్ధ పద్ధతిలోనో కల్గితే శరీర ఆరోగ్యానికి అది హానికరము. దీనివల్ల శరీరం, ఇంద్రియాలు, మనస్సు- వీటిలో తీవ్రమైన మార్పు కలిగి ఆరోగ్యానికి హాని చేకూరుతుంది. ఈవిధంగా శరీరారోగ్యానికి హానికరమైన ఇంద్రియ, ఇంద్రియార్థాల సంయోగాన్ని ఈ క్రింది విధంగా వివరించారు.

1. చక్షురింద్రియము (కన్ను) రూపదర్శనము (6)

1) అతియోగము :- అతిప్రకాశవంతమైన వస్తువులను ఎక్కువసేపు చూచుట

(2) అయోగం .- అతి తక్కువ వెలుతురులో చాలసేపు చదువుట మొదలగునవి.

(3) మిథ్యాయోగం :-అతి దగ్గరగా లేదా కన్నుకు అతిదూరంగా ఉండే వస్తువులను చూడడానికి ప్రయత్నించటం. మరియు రౌద్ర భయానక అద్భుత భీభత్స వికృతదృశ్యాలను చూడటం.

2. శ్రోత్రేంద్రియము :- (చెవి) - శబ్దగ్రహణము. (7)

(1) అతియోగము - అతితీవ్రమైన భయంకర శబ్దాలు వినుట.

(2) అయోగము .- అసలు ఏవిధమైన శబ్దాలను వినకుండుట.

(3) మిథ్యాయోగం .- ద్వేషాన్నికల్గించే మాటలను, తిట్లను, శాపాలను ఖేదాన్ని, దుఃఖాన్ని కల్గించేమాటలను, బంధుమిత్రుల మరణవార్తలను, ధననాశనం మొదలగు వార్తలను వినుట.

3. ఘ్రాణేంద్రియం (ముక్కు) గంధగ్రహణం. (8)

1. అతియోగం:-అతితీక్ష్ణ ఉగ్రగంధాదులను పీల్చుట, తెలివితప్పించి మత్తుకల్గించే పదార్థాలను ఎక్కువసేపు పీల్చుట.

2. అయోగం :- ముక్కుతో ఏవిధమైన వాసనలను చూడకుండుట.

3. మిథ్యాయోగం:- కుళ్లిన, పుచ్చి పురుగులువచ్చుచున్న, పదార్థాలను గాంచుట, వాటి వాసనపీల్చుట, మరియు అసహ్యము కల్గించు మలమూత్రముల, కుళ్లినశవాల, వాసనను గ్రహించుట మొదలైనవి.

4. రసనేంద్రియము (నాలుక) (9) రుచి తెలిసికొనుట.

(1) అతియోగము :- అన్నిరకాల రుచులను ఎక్కువగా చాలసేపు భుజించుట.

(2) అయోగము .- ఏవిధమైన రుచిలేని పదార్థసేవనం.

(3) మిథ్యాయోగము - ఆహారనియమాలకు విరుద్ధంగా ఇష్టంవచ్చిన రీతిలో, ఇష్టం వచ్చినవేళలలో అనియమితంగా అత్యుగ్ర రసాలను, తీక్ష్ణ రసాలను చాలసేపు సేవించటం.

స్పర్శనేంద్రియము (చర్మము) స్పర్శజ్ఞానము (10)

1) అతియోగము:- అతిచల్లని, అతివెచ్చని వస్తువులు తాకుట, స్నాన అభ్యంగాలను అతిగా చేయుట, మితిమీరి శరీరానికి లేపనములు మొదలగు వానిని పట్టించుట.

2) అయోగము :- స్నానాదులు చేయకుండా ఉండుట.

3) మిథ్యాయోగం :- నియమ విరుద్ధంగా స్నానాదులు, విషమ రీతిలో వస్త్రధారణ, అసన వ్యాయామాలు, ఆచరించుట, క్రిమికీటకాల స్పర్శ, భూతస్పర్శ మున్నగునవి.

ఈ పై వివరించిన అసాత్మ్య ఇంద్రియార్థ సంయోగం ముఖ్యంగా ఇంద్రియాలకు తద్వారా ఇంద్రియాధిష్ఠాన మనస్సుకు చెలుపుచేసి, రోగాలను కల్గిస్తాయి.

విశేష సూచన:- స్పర్శేంద్రియ మిథ్యాయోగంలో చెప్పిన భూత స్పర్శకు 2 విధాలుగా అర్థం చెప్పుకోవచ్చు. దయ్యాలు, శక్తులూ, గాలి, ధూళి, పిశాచం వగైరా పేర్లతో పిలువబడే కంటికి అగపడని కొన్ని క్షుద్ర శక్తులు మానవశరీరాన్ని ఆవేశించే అవకాశం ఉంది. దీనినే భూతావేశం అంటారు. ఈ భూతశబ్దానికి 'ప్రాణి' అనే అర్థం కూడా ఉంది. అందుకే ఈప్రపంచాన్ని భూతగ్రామం అంటారు. కనుక భూతస్పర్శ అంటే- కొన్ని ప్రాణులు శరీరాన్ని తాకుట అనికూడా అన్వయించుకోవచ్చును. దీనినే భూతాభిషంగం అని కూడా అనవచ్చును. జగత్తులోని ప్రాణులన్ని హింస్రములనియు, క్షుద్రములనియు రెండు విధాలు. మనుష్యునికన్న బలిష్ఠమైన భయంకరమైన శరీరంకల పులి, సింహం, ఏనుగు మొదలగు జంతువులను హింస్రప్రాణులు. మనిషి శరీరంకన్న క్షుద్రమైన, బలహీనమైన జంతువులును (కుక్క, నక్క, పిల్లి, ఎలుక వగైరాలు) మరియు కళ్ళకు కనపడని క్రిమికీటకాదులు కూడా క్షుద్రప్రాణులే. ఎప్పుడో అవు

1. చక్షురింద్రియము (కన్ను) రూపదర్శనము (6)

1) అతియోగము :- అతిప్రకాశవంతమైన వస్తువులను ఎక్కువసేపు చూచుట

(2) అయోగం :- అతి తక్కువ వెలుతురులో చాలసేపు చదువుట మొదలగునవి.

(3) మిథ్యాయోగం :-అతి దగ్గరగా లేదా కన్నుకు అతిదూరంగా ఉండే వస్తువులను చూడడానికి ప్రయత్నించటం. మఱియు రౌద్ర భయానక అద్భుత భీభత్స వికృతదృశ్యాలను చూడటం.

2. శ్రోత్రేంద్రియము :- (చెవి) - శబ్దగ్రహణము. (7)

(1) అతియోగము :- అతితీవ్రమైన భయంకర శబ్దాలు వినుట.

(2) అయోగము :- అసలు ఏవిధమైన శబ్దాలను వినకుండుట.

(3) మిథ్యాయోగం :- ద్వేషాన్ని కల్గించే మాటలను, తిట్లను, శాపాలను ఖేదాన్ని, దుఃఖాన్ని కల్గించేమాటలను, బంధుమిత్రుల మరణవార్తలను, ధననాశనం మొదలగు వార్తలను వినుట.

3. ఘ్రాణేంద్రియం (ముక్కు) గంధగ్రహణం. (8)

1. అతియోగం:-అతితీక్ష్ణ ఉగ్రగంధాదులను పీల్చుట, తెలివితప్పించి మత్తుకల్గించే పదార్థాలను ఎక్కువసేపు పీల్చుట.

2. అయోగం :- ముక్కుతో ఏవిధమైన వాసనలను చూడకుండుట.

3. మిథ్యాయోగం:- క్రుళ్లిన, పుచ్చి పురుగులువచ్చుచున్న, పదార్థాలను గాంచుట, వాటి వాసనపీల్చుట, మఱియు అసహ్యాము కల్గించు మలమూత్రముల, కుళ్లినశవాల, వాసనను గ్రహించుట మొదలైనవి.

4. రసనేంద్రియము (నాలుక) (9) రుచి తెలిసికొనుట.

(1) అతియోగము :- అన్నిరకాల రుచులను ఎక్కువగా చాలసేపు భుజించుట.

(2) అయోగము :- ఏవిధమైన రుచిలేని పదార్థసేవనం.

(3) మిథ్యాయోగము:- ఆహారనియమాలకు విరుద్ధంగా ఇష్టంవచ్చిన రీతిలో, ఇష్టం వచ్చినవేళలలో అనియమితంగా అత్యుగ్రరసాలను, తీక్ష్ణ రసాలను చాలసేపు సేవించటం.

స్పర్శనేంద్రియము (చర్మము) స్పర్శజ్ఞానము (10)

1) అతియోగము -అతిగల్లని, అతివెచ్చని వస్తువులుతాకుట, స్నాన అభ్యంగాలను అతిగాచేయుట, మితిమీరి శరీరానికి లేపనములు మొదలగు వానిని పట్టించుట.

2) అయోగము :- స్నానాదులు చేయకుండా ఉండుట.

3) మిథ్యాయోగం - నియమ విరుద్ధంగా స్నానాదులు, విషమ రీతిలో వస్త్రధారణ, ఆసన వ్యాయామాలు, ఆచరించుట, క్రిమికీటకాల స్పర్శ, భూతస్పర్శ మున్నగునవి.

ఈ పై వివరించిన అసాత్మ్య ఇంద్రియార్థ సంయోగం ముఖ్యంగా ఇంద్రియాలకు తద్ద్వారా ఇంద్రియాధిష్ఠాన మనస్సుకు చెఱుపుచేసి, రోగాలు కల్గిస్తాయి.

విశేష సూచన:- స్పర్శేంద్రియ మిథ్యాయోగంలో చెప్పిన భూత స్పర్శకు 2 విధాలుగా అర్థం చెప్పుకోవచ్చు. దయ్యాలు, శక్తులూ, గాలి, ధూళి, పిశాచం వగైరా పేర్లతో పిలువబడే కంటికి అగపడని కొన్ని క్షుద్ర శక్తులు మానవశరీరాన్ని ఆవేశించే అవకాశం ఉంది. దీనినే భూతావేశం అంటారు. ఈ భూతశబ్దానికి 'ప్రాణి' అనే అర్థం కూడా ఉంది. అందుకే ఈప్రపంచాన్ని భూతగ్రామం అంటారు. కనుక భూతస్పర్శ అంటే_కొన్ని ప్రాణులు శరీరాన్ని తాకుట అనికూడా అన్వయించుకోవచ్చును. దీనినే భూతాభిషంగం అని కూడా అనవచ్చును. జగత్తులోని ప్రాణు లన్ని హింస్రములనియు, క్షుద్రములనియు రెండువిధాలు. మనుష్యునికన్న బలిష్ఠ మైన భయంకరమైన శరీరంకల పులి, సింహం, ఏనుగు మొదలగు జంతువు లను హింస్రప్రాణులు. మనిషి శరీరంకన్న క్షుద్రమైన, బలహీన మైన జంతువులును (కుక్క, నక్క, పిల్లి, ఎలుక వగైరాలు) మఱియు కళ్ళకు కనపడని క్రిమికీటకాదులు కూడా క్షుద్రప్రాణులే. ఎప్పుడో అవు

దుగా మనిషిపైకి ఈ హింస్ర ప్రాణుల దాడియుండవచ్చును. అయితే క్షుద్రప్రాణుల దాడిమాత్రము మనిషికి అనుక్షణం ఉంటుంది ఎందుకంటే ప్రపంచంలో క్షుద్రప్రాణులులేని స్థలమే ఉండదు కాబట్టి.

## అథర్వవేదంలో క్రిమి వర్ణన (5)

వేదకాలంలోనే భారతీయులకు (క్రీ॥ పూ॥ 3,000 సం॥రములు) సూక్ష్మక్రిముల జ్ఞానం నిర్దిష్టంగా ఉన్న విషయాన్ని అథర్వవేదం ఘోషిస్తోంది అందులోని రోగోత్పాదక క్రిమివర్ణన అత్యంత ఆశ్చర్యం గొల్పుతుంది. ఆ క్రిముల స్వభావం, లక్షణాలు, ఆశ్రయ స్థానము, సంచార స్థానం, వాటివల్ల ఉత్పన్నమగు రోగాలు, వీటి సంపూర్ణ వివరణ మనకు లభిస్తుంది. అథర్వవేదంలోని క్రిముల పేర్లు ఈవిధంగా ఉన్నాయి-

గంధర్వ (శబ్దం చేస్తూ ఆకాశంలో సంచరించే క్రిములు)
అప్సర = (నీటిలో సంచరించేవి)
పిశాచ = (మాంసమును భక్షించేవి)
అత్రి = (భక్షణశీలక్రిములు)
కణ్వ = (ఆర్తనాదాన్ని చేసేవి)
అరయు = (శత్రురూపం గలవి)
ఇత్యాదిపేర్లు వాటి వివరణ వాటి స్వభావసూచకాలు.

గంధర్వులు అప్సరసల భర్తలు (అథర్వవే 11-9-24) వాటి ఆహారం తృణం. (అ॥వే॥ 4 38-11) చెట్లు చేమలు వాటి నివాసస్థానం. నీటిలో కూడ అవి వుంటాయి. (అ॥వే॥ 12-1-23) అవి విషసర్పాలతో గూడి సంయోగిస్తాయి. ఇత్యాది వివరణ కొన్ని అతిసూక్ష్మక్రిములకు, బ్యాక్టీరియాలకు, దోమలకు అన్వయించుకోవచ్చును. కృమి-క్రిమి అను 2 విధాలైన శబ్దాలు అథర్వవేదలో వివరింపబడ్డాయి. కృమి అంటే కృ-క్రామతి-ప్రాకడిది అనే అర్థంచేత నల్లి, పేను, చెదలు, తేలు వగైరాలను సూచిస్తుంది. క్రిమి అంటే క్రి-పరిసర్పణే వృద్ధిపొందేది అనే అర్థంలో అతి

సూక్ష్మక్రిములను సూచిస్తుంది. వీటిలో కొన్ని కనబడనివి, కొన్ని కనబడేవి. (5-23-8 అ॥వే॥) (2-31-5 అ॥వే॥) అవి చెట్లచేమలలోనూ, పర్వతాలపైనా, నీటిలోనూ, ప్రాణుల శరీరంలోనూ, గాలిలోనూ ఎల్లెడలా ఉంటాయి. (అ॥వే॥ 2-31-5) వీటిలో కొన్ని ప్రేగులలో వసిస్తాయి. (అన్వాంత్ర్య, శీర్షణ్య తలలో ఉండేవి), నాలుగు కన్నులు గల్గి తెల్లగా చుక్కలు కల్గి ఎల్లెడలా తిరుగాడే క్రిములు. త్రిశీర్షక, త్రికకంద మొ॥ పదాలు వాటి ఆకారాన్ని సూచిస్తాయి. క్రిములు మనుష్యుల తల, ముక్కు కన్నులు, నోరు వీటియందు సంచరిస్తూ ఉంటాయి. మరికొన్ని ఉదరంలో ఉంటాయి. సూర్యుడు వీటిని నాశనం చేస్తాడు.

వచ -క్రిమి నాశక ఔషధి.అన్వాంత్ర్యములు ప్రావావరోధాన్ని,శీర్షణ్యములు మోహాన్ని, పార్శ్వీయాలు ప్రక్క ఎముకల రోగాన్ని, వ్యధ్వరలు, విశిష్టరోగాలను కల్గిస్తాయి ఈవిధంగా అథర్వవేదంలో సూక్ష్మక్రిముల వర్ణన విశదంగా ఉంది. ఇవి రోగాన్ని జనియింప చేస్తాయన్నది నిస్సందేహం. అందువల్ల వీటి నివారణకై అథర్వవేదంలో నివారణ క్రమం కూడా చెప్పబడి యుంది. అత్రి, అగస్త్య, కణ్వ, జమదగ్ని, అథర్వ అనే పేరు గల ఋషులు ఈ నివారణోపాయాలను చక్కగా తెలిసి ఉన్నవారని అథర్వవేదంలో చెప్పబడింది (అ॥వే॥ 5-23-10) ఆయుర్వేదగ్రంథాలలో కూడా సూక్ష్మక్రిముల వర్ణన, వాటిఅస్తిత్వం, వాటివల్లకలిగే రోగాల విశద వర్ణనలభ్యమౌతాయి.కుష్ఠురోగాన్ని కల్గించేరక్తజక్రిములు,జ్వర,రాజయక్ష్మ, నేత్రాభిష్యంద మొ॥రోగాలవ్యాప్తి, వ్రణచికిత్సలో రక్షణోపాయాలు మొ॥ వివరణవల్ల ప్రాచీనాచార్యులు సూక్ష్మక్రిములవిషయమై ఖచ్చితమైన జ్ఞానాన్ని కల్గియున్నారన్నది నిస్సందేహం. వ్యాధుల కారణత్వవిభజనలో ఆధిభౌతికం అనే ఒకప్రత్యేక వర్గీకరణవల్ల వ్యాధుల ఉత్పత్తికి క్రిములు ముఖ్యకారణం అనేది నిస్సందేహంగా తెలుస్తూంది. ఈవిధంగా సూక్ష్మక్రిములు శరీరంలో ప్రవేశించి వ్యాధులు కల్గించునసే అర్థాన్ని 'భూతాభిషంగం' అనే పదానికి అన్వయించుకోవాలి.

## క్రిములు రోగకారణాలా? ఒకవిమర్శ:-

సూక్ష్మక్రిములు రోగోత్పత్తిని చేసేసమర్థతను కల్గియున్నాయని మన పూర్వాచార్యులు తలంచినప్పటికీ సూక్ష్మక్రిములే రోగోత్పత్తికి అతిముఖ్య కారణాలు అని పరిగణించలేదు. ఈభూతాభిషంగాన్ని అంటే క్రిమి సంపర్కాన్ని రోగోత్పత్తికి సహకారి(నిమిత్త) కారణంగానే వివరించారు. ఈసహకారి కారణాలు దోషధాతుమలాలను దూషీకృతం గావించుటలో మాత్రమే కృతకృత్యములవుతాయి. కాని స్వశక్తిచేత రోగాన్ని ఉత్పత్తి చేయనేరవు ఎంతవరకు దోషధాతుమలాలు సామ్యావస్థలో ఉండి ఆరోగ్యాన్ని కాపాడుతూ ఉంటాయో, అంతవరకు (వ్యాధిక్షమత్వం శరీరానికి ఉండేదాకా) ఈక్రిములేవీ శరీరానికి రోగాన్ని కల్గింపనేరవు. అయితే అత్యధిక సంఖ్యలో క్రిములు వృద్ధిచెంది దోషధాతుమలాలను వైషమ్య పఱచినపుడు, మఱియు అన్యకారణములచేత దోషధాతుమలాల సామ్య స్థితి తప్పినపుడు మాత్రమే రోగోత్పత్తిని కల్గింపగలవు. అందువల్ల ఈ క్రిములు స్వతంత్రంగా వాటంతట అవి ఉత్పత్తి చేయకుండా, దోషధాతుమలాల సామ్యస్థితిలో వైషమ్యాన్ని కల్గించినమీదటే రోగం ఉత్పత్తి అవుతుంది. కనుక శరీరంలో వ్యాధి ఉత్పత్తికి దోషధాతుమలాలే ప్రధానకారణంఅని చెప్పుకోవాలి.అందుచేతనే ఆయుర్వేదశాస్త్రం వ్యాధి ఉత్పత్తిలోనూ చికిత్సలోనూ కూడా దోషధాతు మలాలకే ప్రాధాన్యం ఇచ్చింది కాని, నిమిత్తకారణాలైన క్రిములకు ప్రాధాన్యంఇవ్వలేదు కనుక ఎంతమాత్రము క్రిములు రోగోత్పత్తికి ప్రధాన కారణం కావు. సారవంతముకాని భూమిలో వేసిన బీజం ఏలాగున మొలకెత్తదో-అదేవిధంగా ఆరోగ్యస్థితిలో ఉన్న దోషధాతుమలాలకు సూక్ష్మ క్రిములు ఏవిధంగానూ హాని చేయలేవు. శరీరబలాన్ని అంటే (శరీరానికి రోగాలు రాకుండా ఎదుర్కొనే శక్తిని- వ్యాధిక్షమత్వాన్ని) రక్షించి దాన్ని వృద్ధిచేసేక్రమాన్ని మాత్రమే చికిత్సలో ప్రతిపాదించి, క్రిముల నివారణోపాయాన్ని బహుశా పూర్వాచార్యులు ఇదే ఉద్దేశంతో అలక్ష్యం చేసియుండవచ్చును.

క్రీ. శ. 19 వ శతాబ్ద మధ్య భాగంలో జన్నర్ మఱియు లిస్టర్ అనే పాశ్చాత్య వైజ్ఞానికులు సూక్ష్మక్రిములనుగూర్చి పరిశోధన చేసారు.

వారి తర్వాత 'లూయీపాశ్చర్' అనే శాస్త్రవేత్త క్రిముల రోగకారణత్వ సిద్ధాంతాన్ని దృఢపఱచిన తరువాత పాశ్చాత్యవైద్య విధానంలో ఊహింపని మహత్తర పరిణామాలు ఏర్పడ్డాయి. 'మానవునికి సర్వరోగాలకు క్రిములే కారణం.' ఈ క్రిములను నాశనం చేస్తేనే రోగనివారణ అవుతుంది- అనేవఱకు ఈ సిద్ధాంతం ప్రచలినది. ఈ విధంగా క్రిమినాశక ఔషధశోధన, తయారీ అప్పటినుండి అనేకముఖాలుగా అభివృద్ధి చెందినవి. దీనితోబాటు చికిత్సలో కూడా ఈ క్రిమిసంహారక ఔషధాల ఉపయోగమే నూటికి తొంభైపాళ్లు చోటుచేసుకొంది. అయితే ఈ దశాబ్దం మొదటినుండి ఇప్పటి వరకు జరుగుచున్న పరిశోధనల ఫలితంగా రోగకారణాలకు ఈ క్రిములే మూలకారణం, క్రిమిప్రాదుర్భావం లేనిదే రోగప్రాదుర్భావం జరుగదు అన్న సిద్ధాంతంపై వారికి రోజు రోజూ నమ్మకం సన్నగిల్లుతోంది ఈ పూర్వ సిద్ధాంత ఖండనను తఱచు మనం ఏదోవిధంగా తెలిసికొంటూనే ఉన్నాము.

మన ప్రాచీనాచార్యులు చెప్పినట్లుగా రోగోత్పాదనలో క్రిములు గౌణ, నిమిత్తకారణాలే తప్ప ప్రధానకారణాలు మాత్రం కావనియూ ఏ ఒక్క క్రిమినాశక ఔషధం కూడా సంపూర్ణ ఫలితాలను శాశ్వతంగా కల్గించ నేరదనియూ; అసంఖ్యాకమైన క్రిమికీటకాలు, వాటినుండి ఉత్పన్నమగు ఇంకా అనేక క్రొత్తక్రిములు, వాటి మాతృక్రిములకంటె ఎన్నో రెట్లు బలవత్తరమైనవీ భిన్నగుణాలు కల్గినవీ అవటంచేత - క్రిమి నివారణ ఒక్కటే పరిపూర్ణ రోగచికిత్స కాదనియూ; ప్రఖ్యాత పాశ్చాత్య వైద్యశోధకులు ఈమధ్య అభిప్రాయపడుతున్నారు. ఈ దిశలో ఆలోచిస్తే నేటి ఆధునిక విజ్ఞానం, తత్పరిశోధన ఆయుర్వేద సిద్ధాంతాల ఔన్నత్యానికి, శాశ్వతత్వానికి అనుగుణంగా ఉండి, వాటిని సమర్థిస్తున్నాయి.

ప్రజ్ఞాపరాధం :- ప్రజ్ఞ అంటే సరియైన జ్ఞానము.

అపరాధం అంటే అజ్ఞానానికి భంగం కల్గించుట. అపచారం చేయటం. బుద్ధిచేత మనస్సుద్వారా విషయాలను సరియైనరీతిలో గ్రహింపక, విషమరీతిలో విషయగ్రహణం చేయడాన్ని ప్రజ్ఞాపరాధం అంటారు. (12)

మనుష్యుడు ప్రతినిమిషం పంచేంద్రియాలద్వారా అనేకవిషయాలను గ్రహిస్తూ ఉంటాడు. ఈవిధంగా పొందిన విషయజ్ఞానాన్ని, మనస్సు విమర్శించి, బుద్ధినిర్ణయించి, సరియైన విషయజ్ఞానాన్ని గ్రహింపజేస్తుంది. దానినే ప్రజ్ఞ అంటారు. ఈ ప్రజ్ఞ సరియైనరీతిలో గ్రహింపబడాలంటే మానసికశక్తులైన ధీ, ధృతి, స్మృతులు వికారరహితంగా కార్యనిర్వహణ చేస్తూ ఉండాలి. ధీ - అంటే మంచి చెడులను నిర్ణయించేశక్తి. ధృతి - అంటే మంచి చెడులను నిర్ణయించిన మీదట మంచిని మాత్రమే చేయుచు మఱియు చెడును చేయకుండా, మనస్సును వశపఱచుకొనే శక్తి. స్మృతిఅంటే క్రిందటి అనుభవాలను జ్ఞాపకం చేసికొని జాగ్రత్తగా హితాన్నే చేయించే శక్తి. (13) ఈ మూడుశక్తులూ సక్రమ మార్గంలో ఉన్నమనస్సు విషయార్థాలను సరిగా విమర్శించి తనకార్యాలను హితమైన శ్రేష్ఠమైన రీతులలో చేయిస్తుంది. ఇది ఆరోగ్యానికి ఎన్నడూ సుఖ ప్రదమే.

మనస్సుకు సత్త్వరజస్తమాలనే మూడుగుణాలు ఉంటాయి. ఈ మూడింటిచేత మనస్సు ప్రభావితం అవుతుంది. సత్త్వగుణం నిర్మలంగానూ, ప్రకాశంగానూ ఉండటం చేత దాని ప్రభావంవల్ల మనస్సు సరియైనమార్గంలో విషయాలు గ్రహించి, వివేచించి కార్యనిర్వహణ కావిస్తుంది. అందుచేత సత్త్వగుణమే మనస్సుకు శ్రేష్ఠమైన గుణం, దాని వృద్ధిచేత శరీరారోగ్యం, మానసికారోగ్యం కూడా హితంగానే ఉంటాయి. (14)

రజోగుణం చంచలం, గతిశీలం, కార్యప్రవర్తకం. శీఘ్ర, బలిష్ఠ, లఘు - ఈగుణాలతోకూడి మనస్సునుకూడా చంచలమైన కార్యప్రవృత్తిలో ఉంచుతుంది. మఱియు రాగద్వేషాలకు, మదమాత్సర్యాలకు, చింతా, శోక, భయ, క్రోధాలకు మనస్సును లోనుకావిస్తూ, ఉద్వేగాన్ని కల్గిస్తుంది. ఈవిధమైన రజఃప్రవృత్తిగల మనుష్యుడు విషయగ్రహణం, వాటి వివేచనా, కార్యప్రవృత్తీ, సరిగా చేయలేక ఆరోగ్యమును కోలుపోతాడు. (15)

(3) తమోగుణము :- మంద, స్థిర, అవసాదక, ఆవరోధక గుణాల తోకూడి, వాటి ప్రాధాన్యంవల్ల మానసిక కార్యాలలో అతి స్తబ్ధత, బద్ధకం, ఆలస్యం, మోహం, అజ్ఞానం, చింత; చోటుచేసుకుంటాయి. ఇట్టి ప్రవృత్తికల మనుష్యులలో అహితకార్యాలే జరిగి అవి రోగాన్ని కల్గిస్తాయి. అందువల్లనే సత్త్వగుణం ఒక్కటే మనస్సుకు హితకరం. రజస్తమస్సులు రెండూ రోగకారణాలే. (16)

మనస్సు ఎప్పుడైతే రజస్తమోగుణాల ప్రాబల్యానికి లోనవుతుందో అపుడు మానసికశక్తులైన ధీ, ధృతి, స్మృతులు నాశనమౌతాయి. ఈ ధీ, ధృతి, స్మృతులు నాశనం చెందిన మనస్సు ఎల్లప్పుడూ అసుఖ ఆరోగ్యకార్యాలనే ఆలోచిస్తుంది. చేస్తుంది. (17)ఈవిధంగా శరీరంలోని త్రిదోషాలుకూడా వికృతిచెంది అనేక రోగాలు కల్గిస్తాయి. ఇదే ప్రజ్ఞాపరాధం అంటే.

మానవుడుచేసే కర్మలు కాయిక,వాచిక, మానసికాలని త్రివిధాలు. అదేవిధంగా ప్రజ్ఞాపరాధం కూడా కాయిక, వాచిక, మానసిక ప్రజ్ఞాపరాధాలని మూడు విధాలు. ఈ మూడు విధాలైన ప్రజ్ఞాపరాధాలలోను హీన, మిథ్య, అతియోగాలని మూడు వికల్పాలు ఉంటాయి. ఇవి క్రింద వివరించబడ్డాయి.

### I శారీరిక (కాయిక) ప్రజ్ఞాపరాధం- వివరణ :-

అ) అతియోగం - అంగ ప్రత్యంగములచేత చేసేపనిని అతి ఎక్కువ చేయటం. ఉదాహరణకు అతి వ్యాయామం, అతిమైథునం, అతి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మొదలగునవి.

ఆ) అయోగం (హీన) :- ఏపనీ చేయకుండా సోమరిగా కూర్చోవటం, శారీరక వ్యాయామం, మైథునం మొ॥ కార్యాలు పూర్తిగా మానివేయుట.

ఇ) మిథ్యాయోగం:- మలమూత్రాదుల వేగాలను అరికట్టుట లేదా మలమూత్రాదులను ఆపివేయుట మరియు వాటిని బలవంతముగా విసర్జించుట, విపరీతపద్ధతిలో చరించుట, ఎత్తునుండి దుముకుట, కుస్తీలుపట్టుట మొదలగువి అతిగా ఆచరించుట.

II మానసిక ప్రజ్ఞాపరాధము .-

(1) అతియోగము .- మనస్సుతో అతిగా ఆలోచించుచు పనులు చేయుట.

(2) అయోగము - బొత్తిగా ఆలోచింపకుండ స్తబ్ధుగా ఉండుట.

(3) మిథ్యాయోగము:- విపరీతమైన భయాందోళనలకు క్రోధలోభ మోహాదులకు మనస్సును గురిచేయుట, మిథ్యాదర్శనము (ఇతరుల దోషాలనే ఎల్లప్పుడు వెదకుటలో మనస్సును నియమించుట)

III వాచిక ప్రజ్ఞాపరాధము :-

(1) అతియోగము - దీర్ఘకాలము బిగ్గరగా అరచుచు అతిగా మాటాడుచుండుట, పాటపాడుట వగైరాలు.

(2) అయోగము :- పూర్తిగా మాటాడుట విసర్జించి ఎల్లప్పుడు మౌనంగా ఉండుట.

(3) మిథ్యాయోగము :- అసత్యవచనాలు, అప్రియాలు, పరుష వచనాలు, హేయవచనాలు, ఎల్లప్పుడు మాటాడుచుండుట, మరియు సమయాసమయములు లేకుండ అకారణముగా కలహించుట మున్నగునవి

పరిణామము:- అంటే మార్పు. ప్రపంచంలోని అన్ని పదార్థాలు,ఋతువులు మార్పుచెందుతూనే ఉంటాయి. వెనుకటిస్థితినుండి మరొకస్థితిని పొందుతూనే ఉంటాయి. ఈస్థితిగతుల అవస్థలమధ్య సమయాన్ని కాలం అని అంటారు. కనుక పరిణామం అంటే కాలమే. (19) ఈ కాలము నిత్యము, శాశ్వతము, గతించేదీ అయినప్పటికీ వ్యవహారముకోసము దాన్ని లెక్కించేటప్పుడు కనిష్ఠపరిమితి నిమిషంగా నిర్ణయించి, అచటినుండి ప్రారంభించి ఒకసంవత్సరం వఱకుగలకాలాన్ని లెక్కకు తీసుకొని దాన్ని వ్యావహారిక కాలం అంటున్నాం. (20)

ఆయుర్వేదశాస్త్రంలో కాలం అన్నపదానికి సంవత్సరం పొడుగునా మారే ఋతువు లనియూ వాతావరణంలో మార్పులనియూ ఒక విశేష అర్థం ఉంది. నిర్దిష్టప్రదేశంలో ఈ కాలంలోని మార్పులు ఒక క్రమాన్ని అనుసరించి జరుగుతాయి. ఈ ప్రమాణాన్ని ఆధారం చేసికొని ఒక ఏడాదికాలాన్ని వాటి గుణధర్మాలప్రకారం ఆరు ఋతువులుగా విభజించి

యున్నారు. అవి శిశిర, వసంత, గ్రీష్మ, వర్ష, శరద్ హేమంతములు ఈ ఋతువుల లక్షణాలు మానవుని శరీరంపైనా, అతని ఆరోగ్యంపైనా తప్పక ప్రభావం చూపుతాయి. కనుక మానవుడు తనస్వాస్థ్య రక్షణకు రోగనివారణకు ఆయా ఋతుమార్పులకు తగినట్లుగా ఆహార విహారాలను అనుసరించటం శ్రేయస్కరం. ఆయా ఋతువుల ప్రత్యేక నిర్దిష్టలక్షణాలు స్వాభావికంగా సహజంగా ఉంటే అది ప్రాకృతమని చెప్పవచ్చును. కాని ఈనాడు మనం చూస్తున్న విధంగా అనేక కారణాంతరాలచేత ఋతువులలోకూడా మార్పువచ్చి అవికూడా అతియోగ, అయోగ, మిథ్యాయోగాలుగా పరిణమించి మార్పుచెందాయి. (21)

(1) అతియోగము - ఆయా ఋతువులలో కన్పించే లక్షణాలు అతితీవ్రంగా ఉండటం. ఉదాహరణకు గ్రీష్మంలో మామూలుకన్నా అతి ఉగ్రమైన భరింపరాని ఎండలు. అట్లే వర్షాలు మొదలైనవి.

(2) అయోగము :- ఆయా ఋతులక్షణాలు స్వాభావికంగా కంటె అతితక్కువగా ఉండటం.

(3) మిథ్యాయోగము :- గ్రీష్మఋతువులో వర్ష ఋతు లక్షణాలు, వర్షర్తువులో గ్రీష్మర్తు లక్షణాలు మొదలైనవి.

ఈ వైపరీత్యాలకు అధర్మమే మూలం.

వ్యక్తియొక్కయు, సమాజముయొక్కయు అధర్మాచరణము వల్లనే అసాత్మ్య ఇంద్రియార్థసంయోగ, ప్రజ్ఞాపరాధ, మఱియు పరిణామాల విపరీత యోగాలు కల్గుతూంటాయి. అధర్మాచరణం వల్లనే లోకరక్షకులైన దేవతలు కోపించి శపిస్తారనీ ఆ శాపాలే రోగాలరూపంలో ప్రాణికోటిని పీడిస్తాయనీ ఒక నమ్మకం. ఈ రోగాలనుండి శాపాలనుండి విముక్తి పొందడానికి రోగగ్రస్తులు దేవతార్చనా, జప, హోమ, యాత్రా, దానాదులు చేయాలని మన పూర్వీకుల నమ్మకం.

ప్రతివ్యక్తి చేసే అధర్మాచరణం గోచరం-దృష్టం.(అంటే ఈ జన్మలో చేసినది) మఱియు అదృష్టం (పూర్వజన్మలో చేసినది) అని రెండువిధాలు. ఈ రెండూకూడా ప్రత్యేకంగానూ, రెండూకలసి వ్యాధులనుత్పత్తి చేస్తాయి. అందులో వ్యాధులు కొన్ని దృష్టాపచారజము లనియు, పూర్వాపచారజము

లనియు సంకరజము లనియు త్రివిధాలు. (22) దృష్టాపచారజ రోగాలకు మూలం మనుష్యుడు ప్రతినిత్యంఆచరించే ఆహారవిహార ఆచారాలలో క్రమం తప్పుట. తనకు హితమైన రీతిలో నియమంగా ఆహారవిహారాలను సేవించినట్లైతే అతనికి రోగాలుకలిగే భయంఉండదు.శరీరానికి కీడు కల్గించే విధంగా నియమరహితంగా ఆహారవిహారాదులను సేవించినట్లైతే అతనికి తప్పకుండా రుగ్మతలు కల్గుతాయి. ఈ అసాత్మ్య ఇంద్రియార్థసంయోగ, ప్రజ్ఞాపరాధ పరిణామాలు మూడూకలసి ఒక్కటిగాచేరి మిధ్యాహారవిహారాదులు అనే ఒకపదంతో పిలువబడినవి. సమస్తరోగాలకు మిధ్యాహార విహారాదులే ప్రచోదక (ఉత్పత్తి) కారణాలు. ఇవి తమశక్తి ననుసరించి శరీరంలోని త్రిదోషాలను, సప్తధాతువులను, త్రిమలాలను వికృతపరిచి రోగోత్పత్తికి నాంది పలుకుతాయి.

## రోగకారణాన్ని స్వభావాన్ని సూచించే శబ్దాలు

పైని వివరించిన విధంగా వ్యాధి ఉత్పత్తికి సహకారికారణాలను, వాటి లక్షణాలను, లక్షణాల శక్తిని, వ్యాధులతో వాటి సంబంధాన్ని మొదలైనవాటిని వివరించే అనేకశబ్దాలు ప్రాచీనగ్రంధాలలో మనకు లభిస్తాయి. అవి ఏవంటే ? (23)

1) సన్నికృష్టకారణాలు -రోగోత్పత్తికి ముఖ్యమైన మిక్కిలి దగ్గరి కారణము. ఉదా - మధ్యాహ్నం ఎండవేళవచ్చిన కఫరోగానికి ఆ రోజు ఉదయం వృద్ధిపొందినకఫం ప్రధానమైన దగ్గరికారణం. క్రిందటిరోజు చేసిన రూక్షాహార సేవనవల్ల జ్వరం వచ్చినట్లైతే జ్వరానికి రూక్ష సేవన మిక్కిలి దగ్గరి కారణము అట్లే సామాన్యంగా రోగోత్పత్తికి దోషధాతుమలాలు సన్నికృష్టకారణాలు.

2) విప్రకృష్టకారణాలు.- రోగోత్పత్తికి రోగకారణానికి దూరపు సంబంధం తెలిపేవి ఉదాహరణకు - హేమంతంలో కూడి వృద్ధిచెందిన కఫం వసంతంలో కఫవ్యాధులకు కారణం అవుతుంది. ఇది విప్రకృష్ట కారణము. అట్లే రోగోత్పత్తికి మిధ్యాహారవిహారాదులు విప్రకృష్ట కారణాలు.

(3) ప్రధాన కారణం :- అన్యసహాయాలు లేకుండా స్వయంగా తన బలిమిచేత రోగాలను కల్గింపగల కారణము. ఉదా - విష సేవనము.

(4) వ్యభిచారి కారణము :-దుర్బలమైన కొన్ని కారణాలు ఒకటిగా కలసి రోగోత్పత్తిని కల్గించిన ఆ కారణాలను వ్యభిచారియని- గౌణ అని పిలుస్తారు. ఉదా - క్రిమిరోగోత్పత్తికి అవ్యాయామం, అపక్వాహార సేవనం, గుడ సేవనం మొదలైనవి.

(5) ఉత్పాదక కారణములు :- ముందుగా వివరించిన ప్రధాన కారణం వలెనే ముఖ్యమైన కారణము. హేమంతఋతువులో మధురరస సేవనవలన కఫవృద్ధి అవుతుంది.

(6) వ్యంజక కారణాలు :- అప్రధానమైన సహాయకారణాలు. ఉదా - హేమంతఋతువులోని కఫసంచయం వసంతంలోని సూర్యకిరణాలవల్ల వేడికి కరగి కఫవ్యాధుల్ని కల్గిస్తుంది.

(7) ప్రాకృతకారణము - కాలానికి అనుగుణమైన కారణము. ఉదా - వసంతఋతువులో జరిగే కఫవృద్ధి

(8) వైకృతకారణము - కాలానికి అనుగుణంగాలేని కారణము ఉదా - వర్షఋతువులో ప్రధానంగా వాతదోషం ఉండగా కఫరోగ ఆవిర్భావము జరుగుట.

(9) అనుబంధ్యకారణము :- అనేక గౌణకారణాలద్వారా అనుసరింపబడే ప్రముఖ కారణము. ఉదా :- విషము.

(10) అనుబంధకారణము - ముఖ్యకారణాన్ని తగ్గింపచేసే దుర్బల కారణము. ఉదా .- విషంలో శీతల ఆహారవిహారాదులు.

(11) బాహ్యకారణాలు - (ఆగంతుక) శరీరానికి వెలుపల ఉన్న కారణాలు. ఉదా :- ఆహారం, నీరు, గాలి, క్రిమి, శల్య, ఋతువు మార్పు, శస్త్రము మొదలయినవి.

(12) అభ్యంతరకారణాలు :- (నిజ) శరీరంలోనే ఉండే దోష కారణాలు. ఉదా - దోషాలు, దూష్యాలు.

(13) దోషప్రకోపకారణాలు .- (హేతువు) దోషాలను వృద్ధి చెందించే కారణాలు. ఉదా - మధుర, ఆమ్ల రసాదులు.

(14) వ్యాధి ఉత్పాదక హేతువులు:- వ్యాధినిమాత్రమే కల్గించు కారణాలు. ఉదా :- మృద్భక్షణ పాండురోగానికి కారణము.

(15) ఉభయహేతువులు -దోషప్రకోపాన్ని, వ్యాధిఉత్పత్తిని, ఒకే మారు కల్గింపజేసే కారణాలు. ఉదా -విరుద్ధ ఆహారవిహారాదులు మొ॥వి.

(16) ఆశయాపకర్ష (రూప) కారణాలు :- సామ్యస్థితిలో ఉన్న దోషాలకు వాటిస్వస్థానం మరచి కదల్చి అన్యస్థానాలకు కొనిపోయి వాటిని ప్రకోపింపచేసి వ్యాధిని కల్గించే కారణాలు. ఉదా :- వాత దోషము . వాతదోషము చలనరహితమైన పిత్తాన్ని దానిస్థానం నుంచి బయటకులాగి దాహం, వాంతి, భ్రమ మొదలైన పిత్తలక్షణాలను కల్గింప జేస్తుంది.

(17) నిదానార్థకర రోగకారణాలు (24) అనేక సమయాలలో ముందుగా ఒకరోగం జనించి, దానివెనుక మరొక రోగోత్పత్తికి కారణ భూతం అవుతుంది. ఇటువంటప్పుడు కారణరూపమైన వ్యాధిని నిదానార్థ కర రోగం అనిపిలుస్తారు ఉదాహరణకు పగటి నిద్రవలన రొంప, జలుబు, వీటినుండి దగ్గు - దగ్గువలన క్షయవ్యాధి సంభవిస్తాయి. ఈ విధంగానే జ్వరంవల్ల రక్తపిత్తం, రక్తపిత్తంవల్ల జ్వరం, ఈ రెండింటివల్ల క్షీణత, అర్శస్సు (మూలశంక) వల్ల ఉదరగుల్మాలు ఏర్పడతాయి.

## అధ్యాయ సారాంశము

(1) ప్రతిరోగోత్పత్తికి సమవాయి అసమవాయి నిమిత్త మరియు సహకారి అనే 3 విధాలైన కారణాలు ఆవశ్యకములు.

(2) అసాత్మ్యేంద్రియార్థ సంయోగము, ప్రజ్ఞాపరాధ, పరిణామాలు, మరియు వాటి అతియోగ, అయోగ, మిథ్యాయోగాలే సర్వరోగాలకు ముఖ్యమైన సహకారి కారణాలు. వీటిని మిథ్యాహారవిహారాదులు అని కూడా అంటారు.

(3) సన్నికృష్ట, విప్రకృష్ట అనే శబ్దాలు (కారణాలు) కారణ కార్యాల సంబంధాన్ని సూచించేవే తప్ప ముఖ్యవిశేషాలు కావు.



నిదాన తాళికా
సమవాయి (దూష్యములు)
అసమవాయి (దోషదూష్యసంమూర్ఛనం)
నిమిత్త
ప్రధాన దోషములు
గౌణ (సహకారి)
మిథ్యాహార విహారాదులు
మిథ్యాహార విహారాదులు
అసాత్మ్యేంద్రియార్థ సంయోగ (అర్థ)
చక్షుస్
శ్రోత్ర
స్పర్శ
ఘ్రాణ
రసన
అతి.అ.మి.
అతి.అ.మి
అతి.అ.మి.
అతి.అ.మి.
అతి.అ.మి.
పరిణామ (కాలం)
అతియోగ
అయోగ
మిథ్యాయోగ
ప్రజ్ఞాపరాధ (కర్మ)
కాయిక
వాచిక
మానసిక
అతియోగ
అయోగ
మిథ్యాయోగ
అతియోగ
అయోగ
మిథ్యాయోగ
అతియోగ
అయోగ
మిథ్యాయోగ

# అధ్యాయం - 2

## శాస్త్రోక్త ప్రమాణ శ్లోకాలు

1. వ్యాధి ఉత్పత్తి హేతుః నిదానమ్ (మధుకోశ మా. . 1/4)
2. నిమిత్త హేత్వాయతన ప్రత్యయోత్థాన కారణైః।
   నిదాన మాహుః పర్యాయైః ... ... (మా. ని.1/4)
3. కారణం త్రివిధం సమవాయి, అసమవాయి నిమిత్తభేదాత్ ।
   యత్ సమవేతం తురీవేమాదికం పటస్య
   (తర్కసంగ్రహం - ప్రత్యక్షపరిచ్ఛేదం)
4. ఇత్యసాత్మ్యేంద్రియార్థ సంయోగ, ప్రజ్ఞాపరాధ, పరిణామ
   శ్చేతి త్రయః త్రివిధ వికల్పా హేతవో వికారాణామ్
   (చ. సూ. 11/39)
5. కాలార్థకర్మణాం యోగో హీన మిథ్యాతి మాత్రకః।
   సమ్యగ్యోగశ్చ విజ్ఞేయో, రోగారోగ్యైక కారణమ్॥
   (అ. హృ. సూ. 1/19)
6. తత్ర అతిప్రభవతాం దృశ్యానా మతిమాత్రం దర్శన మతియోగః
   అతి క్లిష్ట, అతి విప్రకృష్ట, రౌద్ర, భైరవాద్భుత ద్విష్ట, బీభత్స,
   వికృత, విత్రాసనాది రూపదర్శనం మిథ్యా యోగః॥
   చ. సూ.(11/39)
7. తత్ర అతిమాత్ర స్తనిక పటహోత్కృష్టాదీనాం శబ్దానాం అతిమాత్ర
   శ్రవణం అతియోగః, సర్వశో అశ్రవణం అయోగః, పరుషేష్టవినా
   శోపఘాత, ప్రదర్షణ, భీషణాది శబ్దశ్రవణం మిథ్యా యోగః॥
   చ. సూ 11/38.
8. అతితీక్ష్ణ ఉగ్రాభిష్యందానాం గంధానా మతిమాత్రం ఘ్రాణ మతి
   యోగః, సర్వశో అఘ్రాణ మయోగః, పూతి ద్విష్టా మేధ్య క్లిన్న
   విషపవన, కుణప గంధాది ఘ్రాణం మిథ్యాయోగః॥
   (చ. సూ. 11/33)

9. రసానా మత్యాదానం అతియోగః, సర్వశో అనాదాన మయోగః।
(చ. సూ 11/38)

10. అతి శీతోష్ణానాం, స్పృశ్యానాం స్నానాభ్యంగోత్సాదనాదీనాం చ అత్యుపసేవన మతియోగః, సర్వశో అనుపసేవన మయోగః॥
స్నానాదీనాం, శీతోష్ణాదీనాం చ స్పృశ్యానా మననుపూర్వ్యోప సేవనమ్।

విషమస్థానాభిఘాత అశుచిభూత సంస్పర్శాదయ శ్చేతి మిథ్యా యోగః॥
(చ. సూ 11/38)

11. భూతాః ప్రాణినః పిశాచ ప్రభృతయశ్చ॥
(చక్రపాణి) చ. శా. 11/38)

12. బుద్ధ్యా విషమ విజ్ఞానం విషమం చ ప్రవర్తనమ్।
ప్రజ్ఞాపరాధం జానీయాత్ మనసో గోచరం హి తత్॥
(చ. శా. 1/109)

13. ధీ ధృతి స్మృతయః ప్రజ్ఞాభేదాః (చక్ర. చ. శా. 1/68)
ధీః (బుద్ధి) సమం బుద్ధి ర్హి పశ్యతి. చ. శా. 1/99)
ధృతి ర్హి నియమాత్మికా (చ. శా 1/100

14. సత్త్వం లఘుప్రకాశక మిష్టం ఉపష్టంభకం హి రజః।
గురువరణక మేవ తమః ప్రదీపవచ్చార్థతో వృత్తి॥
సాంఖ్యకారికా.
తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్।
సుఖసంగేన బధ్నాతి॥ (భగవద్గీతా 14/6)

15. రజోరాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినామ్॥
(భగవద్గీతా 14/7

16. తమ స్తు అజ్ఞానజం విద్ధి మోహానం సర్వదేహినామ్।
ప్రమా దాలస్య నిద్రాభిః తన్నిబధ్నాతి భారత॥(భగవద్గీతా14/8)

17. రజస్తమోభ్యాం హి మనోనుబద్ధం
జ్ఞానం వినా తత్ర హి సర్వదోషాః।
గతిప్రవృత్త్యోస్తు నిమిత్త ముక్తం
మనః సదోషం బలవచ్చ కర్మ॥ (చ. శా. 2/36)

ధీధృతి స్మృతివిభ్రష్టః కర్మ యత్ కురుతే అశుభమ్।
ప్రజ్ఞాపరాధం తం విద్యాత్ సర్వదోష ప్రకోపణమ్॥

(చ. శా. 1/102)

యశ్చాన్య దీదృశం కర్మ రజో మోహసముత్థితమ్ ।
ప్రజ్ఞాపరాధం తం శిష్టా బ్రువతే వ్యాధికారణమ్ ॥

(చ. శా. 1/108)

18. కర్మణః వాఙ్మనశ్శరీరే ప్రవృత్తిః,
తత్ర వాఙ్మన శ్శరీరే అతిప్రవృత్తి రతియోగః,
సర్వశో అప్రవృత్తి రయోగః
వేగ ధారణోదీరణ విషమ స్ఖలన పతనాంగ, ప్రణిధానాంగ ప్రదో
షణ, ప్రహారమర్దన, ప్రాణోపరోధ, సంక్లేశనాది శారీరో మిథ్యా
యోగః,
భయ, శోక, క్రోధ, లోభ, మోహ, మానేర్ష్యా
మిథ్యాదర్శనాదిః మానసో మిథ్యాయోగః। (చ. సూ. 11/39)

19. కాలః పునః పరిణామ ఉచ్యతే॥ (చ. సూ. 11/42)

20. శీతోష్ణ వర్షాలక్షణాః పునః హేమంత గ్రీష్మ
వర్షాః సంవత్సరః॥ (చ. సూ. 11/42)

21. తత్ర అతిమాత్ర స్వలక్షణః (కాలః) కాలాతియోగః,
హీనస్వలక్షణః (కాలః) కాలాయోగః,
యథాస్వలక్షణ విపరీత లక్షణస్తు (కాలః) కాల
మిథ్యాయోగః ॥ (చ సూ. 11/42)

22. దుష్టాపచారజః కశ్చిత్ కశ్చిత్ పూర్వాపచారజః ।
తత్ సంకరాత్ భవత్యన్యః వ్యాధి రేవం త్రిధా స్మృతమ్ ॥
(అ. హృ. సూ. 12/58)

23. విజయరక్షిత - మధుకోశ వ్యాఖ్యా (మా. ని. 1/4)

24. దివాస్వాపాది దోషైశ్చ ప్రతిశ్యాయ శ్చ జాయతే ।
ప్రతిశ్యాయా దతో కాసః కాసా త్సంజాయతే క్షయః ।
క్షయో రోగస్య హేతుత్వే శోష శ్చాప్యుపజాయతే !
తద్యథా జ్వరసంతాపాత్ రక్తపిత్త ముదీర్యతే ।
రక్తపిత్తాత్ జ్వరం తాభ్యాం శోషశ్చాప్యుపజాయతే ॥
(మా. ని. 1/15-18)
(చ. సూ. 8/15-16)

# 3 వ అధ్యాయము

## దోషసామ్యం-దోషవైషమ్యం

మనుష్యుల శరీరంలో 2 విధాల దోషా లున్నాయి.

(1) వాతపిత్త కఫా లనే శారీరకదోషాలు. ఇవి మూడు.
(2) రజస్సు,తమస్సు అనబడే మానసిక దోషాలు 2. (1)

అవి రెండూ శరీరం ఉత్పత్తియైనక్షణంనుంచీ దాని మరణపర్యంతం ఎల్లకాలం ఉత్పన్నమాతూ తమతమ కార్యనిర్వహణలో మగ్నమై యుం టాయి. అందువల్లనే శరీరవ్యాపారం, జీవధారణకూడా సాధ్యపడుతుంది. జీవత్ శరీరంలో (చేతన శరీరంలో) ఈ పైదోషాలకు మూడువిధాలైన స్థితు (మార్పు) లుంటాయి. (2)

(1) స్థానము (స్వస్థానము సామ్యావస్థ) (వికృతిలేని ఆరోగ్యస్థితి )
(2) వృద్ధి - పరిమాణంలోనూ, కార్యనిర్వహణలోనూ హెచ్చుగుట.
(3) క్షయము - పరిమాణ కార్యవ్యాపారాలలో క్షీణత.

సామ్యావస్థలో ఉన్నదోషాలు శరీరఆరోగ్యాన్ని కాపాడుతాయి. అందుచే ఆరోగ్యధారణచేయు ఈదోషాలను ధాతువులుఅనికూడపిలుస్తారు (3) సామ్యస్థితికి విరుద్ధం వైషమ్యస్థితి. వైషమ్యంఅంటే వికృతియే కనుక ఈఅర్థం ప్రకారము సామ్యస్థితికన్నా భిన్నమైనట్టిదోషాల వృద్ధిక్షయాలు రెండూ కూడా విషమస్థితులే. ఈవైషమ్యస్థితిని పొందిన దోషాలు శరీరా రోగ్యాన్ని (సామ్యావస్థను) పాడుచేసి, రోగోత్పత్తికి కారణా లవుతాయి. (4)

పై త్రిదోషాల సామ్యవైషమ్యస్థితులను వాటి పరిమాణం (ద్రవ్యప్ర మాణం) గుణం, మఱియు అవిచేసే కర్మలవల్ల తెలిసికోవాలి. త్రిదోషాలు మూడింటిలోనూ వాతం యొక్క ప్రమాణాన్ని నిర్ణయించటం సాధ్యం కాదు. దాని వృద్ధిక్షయాలను, శరీరం వ్యక్తపఱచే లక్షణాలద్వారా దాని గుణ కర్మలాధారంగా తెలిసికోవాలి .పిత్తకఫాలకు ప్రమాణం, గుణం, కర్మ మూడూ ఉంటాయి. అదే విధంగా ద్రవ్యరూపం లేని, గుణంప్రధానమైన

రజస్సు, తమస్సు అనే మానసిక దోషాలకు మాత్రం కేవలం కర్మలు మాత్రమే గోచరిస్తాయి. వాటిని ఈవిధంగా వివరింపవచ్చును,

## త్రిదోషాల ప్రాకృతప్రమాణం -

(1) వాతం - నివృత్తి గణన చేయుటాలని అసంఘూత ద్రవ్య మూలంగా శరీరంలో వాతం యొక్క నిర్దిష్టమైన పరిమితిని, కొలతను చెప్పడం కష్టము. అసాధ్యమూకూడా.

(2) పిత్తం :- సామ్యావస్థలో అంటే శరీర ఆరోగ్యస్థితిలో ఇది 5 అంజలులు(దోసిళ్లు) ఉంటుంది. (5) (సుశ్రుతం 15-20 జా)

(3) కఫం - సామ్యావస్థలో ఆరు అంజలులు ఉంటుంది. (6)

ఈపై నిర్దేశించిన ప్రమాణం కన్నా శరీరంలో పైదోషాలు హెచ్చినచో వృద్ధియనియు, తగ్గినచో క్షీణత యనియు, ఈ వృద్ధిక్షయాలు రెండింటినీ వైషమ్యం అనేపేరుతో పిలువ వచ్చును.

## త్రిదోషాల ప్రాకృత (సామ్య) గుణాలు - (7)

(1) వాతము - రూక్ష, లఘు, శీత, ఖర, సూక్ష్మ, చల, విశద.

(2) పిత్తం .- సస్నేహ, తీక్ష్ణ, ఉష్ణ, లఘు, విస్ర, సర, ద్రవ.

(3) కఫము :- స్నిగ్ధ, శీత, గురు, మంద, శ్లక్ష్ణ, మృత్స్న, స్థిర

ఈ వివరించిన త్రిదోషాలు సహజస్థితిలో (ఆరోగ్యస్థితి) పైలక్షణాలను కలిగియుంటాయి. దీన్ని సామ్యస్థితి అంటారు. ఇట్లుకాకుండా వాటి గుణాలలో వృద్ధిక్షయాలు ఉన్నట్లయితే దాన్ని వైషమ్యస్థితి అంటారు.

## త్రిదోషాల ప్రాకృత కర్మలు :- (8)

(1) వాతము :- శరీరంలోని సమస్త అవయవాల కదలికలూ, మలమూత్రాల వేగప్రవృత్తి, ఇంద్రియాలు, మనస్సు వీటి పటుత్వం మొదలగునవి.

(2) పిత్తం - ఆహారపాచన, ఉష్ణోత్పత్తి, శరీరమునకు నునుపును, అందాన్ని, మృదుత్వాన్ని కలుగజేయుట, దృష్టిని సరిగా కన్పింపc

జేయుట, శరీరానికి రంగును, కాంతిని కల్గించుట, కాపాడుట, ఆకలి దప్పి కలను తెలియఁ జేయుట, బుద్ధిబలం, అభిమానం, తెలివి వగైరాలను కల్గించుట.

(3) కఫం - శరీరదార్ఢ్యం, అవయవాల స్థిరత్వం, స్నిగ్ధత్వం, శరీర బలం, పౌరుషం మొదలైనవి.

## మానసిక దోషాలు - వాటి సహజకర్మలు

రజస్సు:- వేగంగా ఉత్సాహంగా ఆలోచించుట, పనులు చేయుట మొదలగునవి.

తమస్సు :- బద్ధకం, మోహం, భ్రమ, ఉత్సాహం లేకుండుట మొదలైన గుణాలు.

ప్రతియొక్క దోషమూ కూడ తమ తమ ప్రమాణ, గుణాలచే శరీరము యొక్క కణకణాలలోను, అవయవాలలోను, నిర్దిష్టమైన కార్యాలను నిర్వహిస్తూ ఉంటుంది. ఈ కార్య నిర్వహణచేత, శారిరఆరోగ్య స్థితి సుఖకరంగా ఉన్నట్లయితే అదిసామ్యస్థితి యనియూ, దుఃఖాన్ని కల్గించినట్లయితే వైషమ్యస్థితి యనియూ పిలుస్తారు.

## త్రిదోషాల స్థానాలు - 9

(1) వాతము :- పక్వాశయము, తుంటి, తొడలు, కంఠము, స్రోతస్సులూ, ఎముకలు, చర్మము - ఈస్థానాలలో ముఖ్యంగా ఉంటుంది

(2) పిత్తము - నాభిప్రదేశము, ఆమాశయము (యకృత్ ప్లీహ, గ్రహణీ, ఉండుక, వృక్క-ఇవియన్నీ ఆమాశయంగా గ్రహింలపవచ్చును.) రస, రక్త, లసీక, స్వేద, నేత్ర మరియు చర్మ స్పర్శలలో ముఖ్యంగా చోటు చేసుకొంది.

కఫము .- గుండె, ఊపిరి తిత్తులు, కంఠము, తల, సంధులు, ఊర్ధ్వ ఆమాశయము రసము, మేద, నాసా, ఘ్రాణేంద్రియము, జిహ్వా - వీటిలో చోటు చేసుకుంటుంది.

పై వివరించిన ఆయాస్థానాలలో వాతం ముఖ్యంగా పక్వాశయం లోనూ, పిత్తం ప్రధానంగా నాభిప్రదేశంలోనూ, కఫం ముఖ్యంగా

ఉరస్సు మరియు ఊర్ధ్వ ఆమాశయంలోనూ, స్థానం ఏర్పఱచుకొని ఉం టాయి. ఇవి త్రిదోషాల విశేషస్థానాలు. ఇవి కాక పైవివరించిన అనేక స్థానాలు వాటి గౌణస్థానాలు అని తెలిసికోవాలి. ఈ త్రిదోషాల మూల స్థానాలలోనే వాటి వాటి స్వరూపస్వభావాలు, పరిమాణ, గుణ, కర్మలు ఎక్కువగా తెలుస్తాయి.

త్రిదోషాల సంచారము :- ఆమాశయ, పక్వాశయాలను ఆక్రమించిన త్రిదోషాలు అచట తయారైన ఆది ధాతువైన రసధాతువుతో కలిసి పోయి రసవహస్రోతస్సుల ద్వారా సర్వశరీరంలోనూ ఎల్లప్పుడూ సంచ రిస్తూ ఉంటాయి ఈ విధంగా ప్రతికణంలోనూ ప్రతి ఒక్క ధాతువు లోనూ సంచరించే త్రిదోషాలు సామ్యావస్థలో ఉన్నప్పుడు ఆయా ధాతు వుల గుణకర్మలను కాపాడుతూ శరీరారోగ్యాన్ని కూడా కాపాడుతూ ఉంటాయి. కాని వికృతస్థితిని, వైషమ్యాన్ని పొందిన దోషాలు తమ తమ మూలస్థానాలలోనూ, అప్రధానమైన గౌణస్థానములలోనూ కూడా ధాతు వుతో చేరి వాటిని వికృతపఱచి వైషమ్య లక్షణాలను శరీర ఆరోగ్యానికి హాని కల్గించే రీతిలో విషమకర్మలను కొనసాగిస్తూ ఉంటాయి. (10 A)

## త్రిదోషముల - సహజ సాత్మ్య స్థితి -

త్రిదోషాలు వాటి స్వరూప స్వభావాలలోనూ, గుణకర్మలలోనూ, ఒకదాని కొకటి పరస్పరం విరుద్ధం అయినప్పటికీ ఒకదానికొకటి నాశనం చేసికోనేరవు. ఏ విధంగా అయితే ప్రాణాంతకమైన విషాన్ని తనలో దాచుకొన్ననూ సర్పానికి ఏవిధమైన హానీ జరుగదో, అదే విధంగా పర స్పర విరుద్ధాలైన త్రిదోషాలు కూడా శరీరంలో ఉండి సామ్యస్థితిలో శరీర రక్షణనూ, ఆరోగ్యాన్ని కల్గిస్తాయి. ఈవిధంగా త్రిదోషాలు కలిసి సాత్మ్యస్థితిలో ఉండి, శరీర ఆరోగ్యాన్ని పరిరక్షిస్తూ ఉండడాన్ని సహజసాత్మ్యస్థితి అంటారు. ఇదియొక ప్రత్యేక జీవలక్షణం. (11)

వివిధ దోషవైషమ్యం - త్రిదోషాలు తమ నిర్దిష్ట ప్రమాణగుణకర్మ లలో వృద్ధిని గాని, క్షయాన్నిగాని, పొందడమే వైషమ్యస్థితి అంటారు. ఈ వైషమ్యస్థితియే రోగానికి కారణము. నిజానికి త్రిదోషాల సామ్యస్థితి

శరీరంలో చాల అస్థిరంగా ఉంటుంది. అల్పమైన కారణాల వల్లనే త్రిదోషాల సామ్యస్థితి మార్పు చెందుతూ ఉంటుంది. ప్రతిక్షణమూ ఏదో ఒక కారణంవల్ల ఈ సామ్యస్థితిలో మార్పు వస్తూనే ఉంటుంది. (12)

ఈ త్రిదోషాల వృద్ధిక్షయాలు వాటివాటి ప్రమాణ గుణకర్మల కనిష్ఠ గరిష్ఠ పరిమితులలో కొంచెంగానో ఎక్కువగానో ఉండవచ్చును. ఉదాహరణకు - సహజ ఆరోగ్య స్థితిలో శరీరంలోని పిత్తం 5 అంజలులు ఉంటుంది. ఏదైన పిత్తవృద్ధినిగాని క్షయాన్నిగాని కల్గించే కారణాలవల్ల సామ్యస్థితిలోని పిత్తము 5 అంజలులకు బదులుగా $5\frac{1}{4}$ అంజలులుగా గాని $4\frac{3}{4}$ అంజలులుగా గాని హెచ్చుతగ్గులు కల్గిన ఇది స్వల్పమైన మార్పు. ఇదే వృద్ధిక్షయాలు అతి ఎక్కువ పరిమాణంలో అయితే అంటే 5 కు బదులుగా 7, 8 అంజలులు అగుట, లేదా, 2, 3 అంజలులకు క్షీణించుటను అతి బలిష్ఠమైన వైషమ్య స్థితి అంటారు. పైన వివరించిన అల్పమైన వైషమ్య స్థితిని శరీరం తట్టుకుంటుంది. అందుచే అది సంభవించినపుడు కొన్ని రోగలక్షణాలు శరీరంలో వ్యక్తం అయినప్పటికీ తగిన ఆహార విహారాదులచేత విశ్రాంతిచేత ఈ వైషమ్యదోషాలను సామ్యస్థితికి తీసుకురావచ్చును. సామాన్యంగా రోజూ కలిగే ఈ మార్పును స్వాభావిక వికృతి అంటారు. దీనివల్ల శరీరానికి అంత చెఱుపు జరుగదు. (13) ఉదాహారణకు :- తఱచుగా అప్పుడప్పుడు కలిగే మలబద్ధత, తుమ్ములు, రొంప, తలనొప్పి వగైరాలు. వీటిని కొంతజాగ్రత్త వల్ల కొంత పథ్యపానాలవల్ల అరికట్టి,తిరిగి ఆరోగ్యస్థితిని పొందవచ్చును. కాని బలిష్ఠమైన మిథ్యాహార విహారాదులు ఋతువులలో మార్పుమూలంగా దోషాల సామ్యస్థితిలో అతి వికృతి చెంది వృద్ధిక్షయాలు ఏర్పడి, తీవ్ర వైషమ్య లక్షణాలు గల రోగాలను కల్గింపవచ్చును. ఈ మార్పు అతి కావడం బలిష్ఠంమూలంగా శరీరం దీనిని తట్టుకోలేక రోగాలకు గురిఅయ్యే అవకాశం ఉంది. ఇట్టి బలిష్ఠమైన దోషవైషమ్య స్థితిచేత వచ్చేమార్పును అస్వాభావికం అనీ వైకృతస్థితియనీ అంటారు. (14) ఈ అస్వాభావిక

వికృతస్థితినే బలిష్ఠమైన దోషవైషమ్యం అని పిలుస్తారు. ఈ దోషవైషమ్యమే ముందు వివరించే అన్ని వ్యాధులకూ మూలకారణం.

## దోషవైషమ్యాన్ని కల్గించే ఆహారవిహారాదులు :-

వివరణ :- 'వృద్ధిః సమానైః సర్వేషాం విపరీతైః విపర్యయః' అన్న సూత్రప్రకారము సమానగుణాలు వృద్ధిని విపరీత గుణాలు విపర్యయమును కల్గిస్తాయి. అంటే త్రిదోషాలకు వాటివాటి సమానగుణకర్మలు కల్గిన పదార్థాలు సేవించినపుడు ఆయాదోషవృద్ధియునూ, విరుద్ధ గుణకర్మలు కల్గిన పదార్థాలు సేవిస్తే ఆయా దోషక్షయమూ సంభవిస్తుంది. ప్రత్యేకంగా ఒక్కొక్క దోషం ఏయే కారణాలచేత వృద్ధిక్షయాన్ని పొందునో, దీనికి ముందు వివరింపబడింది.

(1) వాతవృద్ధిని కల్గించే ఆహారవిహారాదులు :- అతిగా వ్యాయామం అతి ఉపవాసాలు, మొదలైన వాటిచేతనూ, ఎత్తునుంచి దూకుట, కాలు చేతులు విరుగుట, ధాతుక్షయం, రాత్రిజాగరణ, మలమూత్రాదులను బంధించుట, లేదా వాటిని బలవంతంగా విసర్జించుట, వమనవిరేచన కర్మలు అతిగా జరపుట, కషాయ, కటు, తిక్తరసాలుగల ద్రవ్యాలు అతిగా సేవించుట, అతిగా చింతన. భయము, శోకాలకు లోనగుట, వీటివలననూ, మరియు వర్షకాలము, భోజనోత్తరకాలము, సంధ్యాసమయాలలోనూ వాతం వృద్ధిచెందుతుంది.

(2) పిత్తాన్ని వృద్ధిచేసే ఆహారవిహారాదులు :- (16) అతి పులుపు, అతికారం, ఉప్పు మొదలగు తీక్ష్ణమగు ఆహార పదార్థసేవన, అతిగా కోపించుట, ఎండపడుట, నువ్వులు, పెరుగు, తరవాణీ వగైరాల అతిసేవన, మద్యసేవన, వీనివల్లనూ అన్నం జీర్ణమయ్యే సమయంలోనూ, శరత్, గ్రీష్మ ఋతువులలోను, మధ్యాహ్నం, మధ్యరాత్రి సమయాలలోనూ పిత్తం వృద్ధి చెందుతుంది.

(3) కఫ వృద్ధికర ఆహారవిహారాదులు :- (17) చిక్కని మధురమైన స్నిగ్ధమైన గురుగుణం కల్గిన ఆహారపానీయాల అతిసేవన, పెరుగు,

బెల్లం, వెన్న, నేయి అనువాని తో తయారుచేయబడిన మధురపదార్థాల వలన నూ, పగటినిద్రవల్లనూ హేమంత వసంత ఋతువులలోను, భోజనం అయిన వెంట నేనూ, పగలు రాత్రుల ప్రారంభ సమయంలో నూ కఫవృద్ధి జరుగుతుంది.

1) వాతక్షయాన్ని కల్గించే ఆహారవిహారాదులు :-

తియ్యని పుల్లని లవణరసాలు కల్గిన మృదువైన కించి దుష్ణత కల్గిన గురుగుణం గల్గిన ఆహారపుటలవాట్లు.

2) పిత్తక్షయాన్ని కల్గించే ఆహారవిహారాదులు :-

కషాయ, కటు, తిక్తరసాలు కల్గి చల్లని మధురమైన మృదు సాంద్రతలు కల్గిన ఆహారవిహారాదులు.

3) కఫక్షయాన్ని కల్గించే ఆహారవిహారాదులు :-

వగరు, కారం, చేదు కల్గిన ఆహార పానీయాలు, రూక్షత, ఉష్ణత కల్గిన తీక్ష్ణమైన ఆహారవిహారాదులు కఫాన్ని నాశనం చేస్తాయి.

## వృద్ధిక్షయాల బలాబలాలు

శరీరంలో దోషముల వృద్ధిక్షయాలు రెండునూ విషమస్థితి నే సూచించినప్పటికీ అవి సమానబలం కలవి కావు. వృద్ధి బలిష్ఠము గాను, క్షయము బలహీనమైనది గానూ ఉంటాయి. దోషవృద్ధికర కారణాల బలాబలాలను బట్టి, వాటివాటి గుణధర్మ ప్రమాణాలలో బలిష్ఠమైన వికృతి కల్గుతుంది. దోషములు క్షీణించినప్పటికినీ వాటివాటి ప్రమాణ గుణకర్మల నే కొంచెం కోల్పోయి శరీరంలో దుర్బలమైన వికృతావస్థను కల్గిస్తాయి. అందువల్ల వృద్ధి చెందిన దోషాలవల్ల కల్గిన లక్షణాలు బలిష్ఠంగాను క్షీణదోషాలవల్ల కల్గిన లక్షణాలు దుర్బలంగానూ ఉంటాయి. (18)

'బలిష్ఠత కే ప్రాధాన్యం' అన్న న్యాయం ప్రకారము దోషముల వృద్ధిక్షయాలు రెంటిలోనూ వృద్ధి కే ప్రాధాన్యం ఇవ్వబడింది. దోషవృద్ధి చేత నే శరీరంలో రోగోత్పత్తి జరుగుతుంది. కాని దోషక్షయం చేత రోగోత్పత్తి జరుగదు. ఇది ఆయుర్వేద అభిప్రాయం. వృద్ధి చెందిన దోషాలు శరీరంలో తమతమ ప్రమాణ గుణకర్మలలో విషమవృద్ధిని చెంది

నాశం కల్గిస్తుంది ఈ అచయపూర్వక వృద్ధిలో మధ్యావస్థలేవీ కానరావు. ఒకవేళ ఉన్ననూ అత్యంత వేగంగా జరిగే సంజ్ఞా నాశంవల్ల అవి గుర్తించ వీలు కావు. (22)

## దోష వైషమ్యం - దాని వికల్పాలు

దోషాలు వృద్ధిక్షయాలలో తరతమ భావాల సంఖ్యను గణిస్తే అసంఖ్యాకంగా ఉంటాయి. ప్రతి ఒక్క క్షణంలోనూ మార్పు చెందుచుండుట మూలంగా, ఈ ప్రతి ఒక్క మార్పుకూడ ఒక్కొక్కటీ ఒక్కొక్క విశే. దోషములు శరీరంలో స్వతంత్రంగానూ, మరియు ధాతువుల నాశ్రయించియూ ఉండటంవలన, ఈ తరతమ భావాలు నిర్దిష్టంగా ఇన్ని అని చెప్ప వీలులేదు. కనుకనే ప్రాచీనార్ష గ్రంథాలలో దోష వికల్పాలు అసంఖ్యాకము లనిరి. మరియు వాటి క్రమాన్ని సూక్ష్మంగా తెలిసికోవడానిక వీలుగా కేవలం 62 వికల్పాలను మాత్రం వివరించారు (23) దోషాల స్వతంత్రావస్థలో వృద్ధ, వృద్ధతర, వృద్ధతమ, క్షీణ, క్షీణతర, క్షీణతమ అనే అవస్థాంతరాలను మూడు దోషాలకు ప్రత్యేకంగాను, పర్యాయంగాను అన్వయిస్తే 62 వికల్పస్థితులు వ్యక్తమౌతాయి. ఈవిధంగా ఈ 62 అనే సంఖ్యానిర్దేశం కేవలం రోగమార్గ దర్శకమే తప్ప నిర్దిష్టంగా రోగ నిర్ధారణలో సహాయపడ నేరవు. (24)

## దోషవైషమ్యం - వాటిపరిణామం

త్రిదోషాలు అంతఃకోష్ఠంలో (మహాస్రోతస్సులో) నే ఉత్పన్నమౌతాయి. అచటినుండి అవి ధాతువులను ఆశ్రయిస్తాయి. అహిత ఆహార విహారాదులవల్ల దోషాలలో కలిగే వైషమ్యం ఈ రెండు స్థలాలలోనూ అంటే స్రోతస్సులలోనూ, ధాతువులలోనూకూడా తమ తమ లక్షణాలను వ్యక్తం చేస్తూఉంటాయి. అనేక సందర్భాలలో ఈ వైషమ్యం మొదట మహాస్రోతస్సులలోనూ, తర్వాత ధాతువులలోనూ, లేదా మొదటధాతువుల లోను, తరువాత కోష్ఠంలోనూ వైషమ్యలక్షణాలను కల్గిస్తుంది ధాతు వైషమ్యం వలన కోష్ఠంలోనూ, ధాతువులలోనూ వాటివాటి గుణకర్మలలో

మార్పు కల్గుతూ ఉంటుంది. ఈవికృతే రోగోత్పత్తికి మూలం. అందుచేతనే రోగాలకు 'దోషమూలాలు' అని పేరు. వైషమ్యంలోని వికల్పాలు అసంఖ్యం అవటం మూలంగా, రోగాలు కూడా అసంఖ్యేయములే. (25)

## రక్తంకూడా దోషమా? కాదా?

శారీరక దోషాలైన వాతపిత్త కఫాల మూడింటికి తోడుగా రక్తాన్ని కూడా నాల్గవ దోషంగా పరిగణించాలని ఈవిధంగా పరిగణించుట శాస్త్రచికిత్సలో తోడ్పడుతుందని శల్యశాస్త్రజ్ఞుల అభిప్రాయము. రసరక్తములు రెండూ సాహచర్యధాతువులు. త్రిదోషముల సంచారము రసధాతువుతో కూడి జరుగుతుంది కాబట్టి దాని ప్రభావం రక్తధాతువుపై కూడ తప్పక పడుతుంది శరీరం నుంచి స్రవించేది రక్తంతో కూడిన రసమే కాబట్టి మరియు దానిరంగు, గుణము, వాసన మొదలైనవి రసధాతువుతో కూడి త్రిదోషాలకు అనుగుణంగానే ఉంటాయి. దోషాల ప్రభావం చేత దూషింపబడిన రక్తాన్ని దోషంగానే పరిగణింపవచ్చును. ఈవిధంగా దూషింపబడిన దుష్టరక్తం అనేకరోగాలకు మూలకారణం అవుతుంది. శాస్త్ర చికిత్సలో రక్తధాతువునకు ప్రాధాన్యమిచ్చి, వ్యాధుల దోష నిర్ణయం, చికిత్సకూడ దానిననుసరించే కావిస్తారు. కాని నిజానికి కార్య కారణ దృష్టితో ఆలోచిస్తే, రక్తం కార్యం, త్రిదోషవికృతి కారణం అని తేటతెల్లము అవుతుంది. కనుక త్రిదోషాలు మినహా రక్తం దోషంగాక దూష్యం అని పిలువబడుతుంది. మరియు రక్తం స్వతంత్రంగా ఒకదోషమూ కాదు. రోగోత్పత్తికి ప్రధానకారణమూ కాదు. శరీరధారణ, పోషణ ఇవి రక్తంయొక్క ప్రధానకార్యాలు. కనుక రక్తాన్ని ధాతువని, దూష్యమని పిలవాలి తప్ప, స్వతంత్రంగా దోషం అనే పిలిచే అవకాశం లేదు. (26)

## మానసికదోషసామ్యము–మరియు విషమత

మనస్సు అనేది ఇంద్రియము. ఇది త్రిగుణాత్మకం. సత్త్వ,రజస్త మోగుణాలు మూడుమానసిక కార్యాలలో పాల్గొంటాయి. శరీరోత్పత్తి

తోపాటు మనస్సుకూడా తన ప్రత్యేకతను సంతరించుకుంటుంది జీవిలోని సత్త్వరజస్తమోగుణాల తరతమ భావాలకనుగుణంగా మనస్సును సాత్త్వికమో, రాజసమో, తామసమో అనివిభజించి,ఆవిధమైన మనస్సుకల్గిన మానవులను ఆయావిధములుగా చెప్పుకోవచ్చును. (27) ఈవిధంగా విభజింపబడ్డ మానసిక స్థితులలోకూడా సమయానుకూలంగా తరతమభావాలుకల్గవచ్చును. ఆయాగుణాలు వాటి వాటి సామ్యస్థితిలో ఉండి మానసిక ఆరోగ్యాన్ని కాపాడితే అది ఆరోగ్యసాధకమౌతుంది కాని ఈ సామ్యస్థితి స్థిరంకాదు. వివిధ ఆహార విహారాదులు మానసిక స్థితులను బట్టి ఈ సామ్యస్థితిలో మార్పులు వస్తూ ఉంటాయి. శారీరక దోషాలకు వలెనే మానసిక దోషాలలో కూడా 3 గతు లుంటాయి. (1) సామ్యస్థితి, ప్రాకృతస్థితి (2) వృద్ధి (3) క్షయము. వృద్ధిక్షయాలు రెండూ రోగకారణాలైన వైషమ్యస్థితులు. వృద్ధి పొందిన మానసిక దోషాలు వాటివాటి లక్షణాలను అధికంగానూ, క్షీణతపొందిన మానసికదోషాలు వాటివాటి లక్షణాలను అల్పంగానూ మనస్సుద్వారా వ్యక్తం చేస్తూఉంటాయి. ఈమానసిక దోషాలలో కూడా వృద్ధికే ప్రాధాన్యం ఇవ్వబడింది. ఎందువల్ల నంటే వృద్ధి చెందిన మానసిక దోషాలవల్లనే రోగం జనిస్తుంది.

త్రిగుణాలలో మొదటిదైన సత్త్వగుణం శుద్ధము, ప్రకాశకరము, జ్ఞానకరము,శాంతికరము అవడం మూలాన ఈ సత్త్వగుణం వృద్ధిచెందితే మానసిక కార్యాలు హితకరంగానూ, ఆరోగ్యాన్ని, శాంతిని ప్రసాదించేవిగానూ ఉంటాయి. అందుచేత సత్త్వగుణవృద్ధిచే శరీరారోగ్యం చక్క బడడంగాక, మానసికశాంతి, విజ్ఞానము, ఆనందము, ధర్మాచరణకూడా వృద్ధిచెందుతాయి. మరియు ప్రతిమానవుడు ఈసత్త్వగుణాన్ని పెంపొందించుకొనటకే పాటుపడాలి.

రజోగుణ వృద్ధిచేత శరీరంలో ఉత్సాహము, ఉద్రేకము, అతి చంచలత్వం, అతికార్యాలోచన, కామక్రోధాది షడ్గుణాలు వాటి అతిప్రవృత్తి మొదలైనవి వ్యక్తమౌతాయి. అల్లే తమోగుణవృద్ధిచేత బద్ధకము, స్తబ్ధత, అజ్ఞానము, మోహము, మూర్ఛ, శోకము, చింత మొదలయిన చిత్తవృత్తులు వ్యక్తమౌతాయి. ఈ పైలక్షణాలుగల రజస్సు తమస్సు అనే దోషాలతో

కూడిన మనస్సుయొక్క కార్యక్రమాలు అహితకరమైనవిగాను, శరీరమానసిక ఆరోగ్యానికి చెఱుపుచేసేవిగానూ ఉంటాయి. అందుచేతనే రజస్సు తమస్సుఅనే ఈ రెండూ మానసిక దోషాలు. వీటివల్ల శారీరమానసిక ఆరోగ్యం విషమించే అవకాశం ఉంది. (28)

శారీరమానసిక దోషాలకు అతిదగ్గరి సంబంధం ఉంది. వాతదోషం ముఖ్యంగా రజోగుణపూరితం అల్లే కఫం విశేషంగా తమోగుణభూయిష్ఠం. కాని పిత్తదోషం మాత్రం అటు సత్త్వగుణాన్ని ఇటు రజోగుణాన్ని రెంటినీ పొంది యుంటుంది. (29) త్రిదోషాలకు వాటి వాటి పరిమాణ కర్మలలో వృద్ధిపొందింపజేసే ఆహార విహార విచారాదులు తత్సమానమైన మానసిక దోషాలను కూడా వృద్ధిచెందించి, రోగాలను కల్గిస్తాయి. కాని ఇక్కడ ముఖ్యంగా గమనింపవలసిన దేమిటంటే మానసిక దోషాలను అతిగా వృద్ధిపొందించే కారణాలు ముందుగా మానసిక దోషాలను, తరువాత శారీరక దోషాలను వైషమ్య పరుస్తాయి. అందుచేతనే శారీరక దోషాలలో మానసిక వికృతి లక్షణాలు, మానసిక దోషాలలో శారీరక వికృతి లక్షణాలు మనకు గోచరిస్తూనే ఉంటాయి (30)

## అధ్యాయ సారాంశము

(1) త్రిదోషములయొక్క సామ్యవైషమ్య స్థితులు వాటివాటి పరిమాణ గుణ కర్మలపై ఆధారపడి యుంటాయి.

(2) దోషముల వృద్ధిక్షయాలు రెండూకూడా వైషమ్యమే కాని వీటిలో వృద్ధియే బలిష్ఠమైనది కావడంమూలంగా సామాన్యంగా శరీరంలో వృద్ధిచెందిన దోషాలవల్లనే రోగోత్పత్తి జరుగుతుంది.

(3) ప్రాకృతావస్థలోగాని వికృతావస్థలోగాని దోషా లునశింపవు.

(4) దోషవృద్ధియొక్క పరిణామం మొదట మహాస్రోతస్సులోనూ, (అంతఃకోష్ఠం) మఱియు ధాతుమలాలలోనూ సంభవిస్తుంది.

(5) సత్త్వగుణ వృద్ధి ఆరోగ్యానికి హితమైనది. మఱియు రజస్సు తమస్సు అనే మానసిక దోషములవృద్ధి అటు శరీరారోగ్యానికి ఇటు మానసిక ఆరోగ్యానికి కూడా అహితకరమే :

## శాస్త్రోక్త ప్రమాణ శ్లోకాలు

1. వాయుః పిత్తం కఫశ్చేతి శారీరో దోషసంగ్రహః।
మానసః పున రుద్దిష్టః రజశ్చ తమ ఏవ చ॥ (చ. సూ. 1/52)

2. క్షయః స్థానం చ వృద్ధిశ్చ దోషాణాం త్రివిధా గతిః।
(చ. సూ. 17/112)

3. అతశ్చ దోషాః దేహస్థితు మానయంతః
స్థానా ఇత్యుచ్యంతే, ధారణాద్ధాతవః। (అ. సం. సూ. 20)

4. వికృతాఽవికృతా దేహం ఘ్నంతి తే వర్ధయంతి చ।
(అ. హృ. సూ.)

4, 5, 6 పంచాంజలయః పిత్తస్య, షట్ శ్లేష్మణః (26 శా. 8/15)

7. తత్ర రూక్షో లఘుశ్శీతః ఖరసూక్ష్మశ్చలో నిలః।
పిత్తం సస్నేహతీక్ష్ణోష్ణం లఘు విస్రం సరం ద్రవమ్॥
స్నిగ్ధః శీతో గురుర్మందః శ్లక్ష్ణో మృత్స్నః స్థిరః కఫః॥
(అ. హృ. సూ. 1/41-42)

8. .. .. .. ... తం చలః।
ఉత్సాహోచ్ఛ్వాస నిశ్వాస చేష్టావేగ ప్రవర్తనైః।
సమ్యగ్గత్యా చ ధాతూనాం అక్షాణాం పాటవేన చ॥
అనుగృహ్ణాత్యవికృతః పిత్తం ప్రక్త్యూష్మ దర్శనైః।
క్షుత్ తృట్ రుచి ప్రభా మేధో ధీశౌర్య తను మార్దవైః॥
శ్లేష్మాస్థిరత్వ స్నిగ్ధత్వ సంధిబంధక్షమాదిభిః।
(అ హృ. సూ 10/1-2)

9. పక్వాశయ కటీ సక్థి శ్రోత్రాస్థి స్పర్శనేంద్రియం।
స్థానం వాతస్య తత్రాపి పక్వాధానం విశేషతః॥
నాభిరామాశయ స్వేద లసీకా రుధిరం రసః।
దృక్ స్పర్శనం చ పిత్తస్య నాభిరత్ర విశేషతః॥
ఉరః కంఠః శిరః క్లోమా పర్వాణ్యామాశయో రసః।
మేదో ఘ్రాణం చ జిహ్వా చ కఫస్య సుతరాముదః॥
(అ. హృ. సూ 12/1-2)

10. అన్నస్య భుక్తమాత్రస్య షడ్రసస్య ప్రపాకతః ।
మధురాద్యాత్ కఫో భావాత్ ఫేనభూత ఉదీర్యతే ॥
పక్వాశయం తు ప్రాప్తస్య శోష్యమానస్య వహ్నినా ।
పరిపిండితపక్వస్య వాయుః స్యాత్ కటు భావతః ॥
(చ. చి. 15/9-11)

పంచాత్మా .. మారుతః కోష్ఠే ప్రాదుర్భవతి ।
అ. సం. శా. 9)

రసవహా ఏవ ధమన్యో హృదయాశ్రయాః ।
ఉక్తాస్తా, ఏవ వాతాది వహాః । (చక్ర. చ. చి. 24/25)

10 ఎ. సర్వశరీర చరాస్తు వాతపిత్త శ్లేష్మాణః సర్వస్మిన్
శరీరే కుపితాఽకుపితాః శుభాశుభాని కుర్వంతి ।
ప్రకృతిభూతాః శుభాన్యుపచయ బలవర్ణ ప్రసాదాదీని
అశుభాని పునః వికృతి మాపన్నా వికార సంజ్ఞకాని॥
(చ. సూ. 20/9)

11. విరుద్ధైరపి న త్వేతే గుణైః ఘ్నంతి పరస్పరమ్ ।
దోషాణాం సహజ సాత్మ్యత్వాత్ విషం ఘోర మహీం నివ ॥
(చ. చి. 16/196)

12. వైషమ్యగమనం హి పునః ధాతూనాం (దోషాణాం) వృద్ధిహ్రాస
గమనం అసాత్మ్యేన ప్రకృత్యా చ । (చ. శా. 6/4)
రాత్రి దిన భోజనానాం తాసు తాస్వవస్థాసు శ్లేష్మ ప్రకోపాదినా
నిత్యం [దోష] ధాతువైషమ్య మస్తి । [చక్రపాణి. చ సూ. 9/4]

13. యతోఽవశ్యం ప్రమాణాధికో దోషః స్వలింగాధికో భవతి,
క్షీణో వా క్షీణ స్వలక్షణః ఇతి । [చక్రపాణి. చ.సూ. 9/1]
దివారాత్రి భోజనావస్థాది జనితం ధాతువైషమ్యం
ఉద్వేజిత వికారాకర్తృత్వేన సుఖమితి వ్యవహ్రియతే తేన
యోహ్యల్పః స నాస్తీ వేతి కృత్వా అల్పేపి ధాతువైషమ్యే ధాతు
సామ్య వ్యవహారః సిద్ధో భవతి । [చక్రపాణి సూ. 9,4]

14. లఘునా వైషమ్యేణ రోగమాత్ర జనకేన క్లేశం మహతా త్వసాధ్య రోగజనకేన వైషమ్యేణ వినాశం మరణం ప్రాప్నోతి శరీరమ్ ॥
[చక్రపాణి. చ. సూ.]

15. వ్యాయామా దప తర్పణాత్ భంగాత్ క్షయా జ్జాగరాత్
వేగానాం చ విధారణా దతిశుచః శైత్యా దతిత్రాసతః ।
రూక్షక్షోభ కషాయతిక్తకటుకై రేభిః ప్రకోపం వ్రజేత్
వాయుః వారిధరాగమే పరిణతే చాన్నే అపరాహ్ణేఽపిచ ॥
(వసంతాచార్య మధుకోశ. మా. ని. 1/4)

16. కట్వామ్లోష్ణ విదాహితీక్ష్ణ లవణ క్రోధోపవా సాతపాః
స్త్రీ సంపర్క తిలాతసీ దధి సురా శుక్తారనాలాదిభిః ।
భుక్తే జీర్యతి భోజనే చ శరది గ్రీష్మే సతి ప్రాణినాం
మధ్యాహ్నే చ తదార్ధరాత్రసమయే పిత్తం ప్రకోపం వ్రజేత్ ॥
(వసంతాచార్య)

17. గురు మధుర, రసాతిస్నిగ్ధ దుగ్ధేక్షు భక్ష్యద్రవ
దధి దిన నిద్రాపూప సర్పిప్రపూరైః ।
తుహిన పతనకాలే శ్లేష్మణః సంప్రకోపః
ప్రభవతి దివసాదౌ భుక్తమాత్రే వసంతే ॥ (వసంతాచార్య)

18. దోషాః ప్రవృద్ధాః స్వం లింగం దర్శయంతే యథాబలం।
క్షీణాః జహతి లింగం స్వం సమాః స్వం కర్మ కుర్వతే ॥
(చ. సూ. 17/62)

యతో వృద్ధాః ఉన్మార్గగామినో దోషాః దూష్యం
దూషయంతో జ్వరాదీన్ కుర్వంతి, న క్షీణాః,
స్వయమేవ దుఃస్థితత్వాత్ ॥ (చక్రపాణి. చ. సూ. 17/62)
... క్షయరూప వైషమ్యస్య ఏవంరూపవ్యాధి
అజనకత్వాత్ । (చక్రపాణి)

19. వాతాదిప్రకోపాణామేవ హీనమధ్యోత్తమానాం నానా
శక్తిత్వాత్ ప్రబలా వాతాదయో వినాశయంతి
హీనాస్తు వికృతిమాత్రం జనయంతి । (చక్రపాణి. చ. సూ. 7/40)

20. ... మలోచితత్వా ద్దేహస్య క్షయో వృద్ధేస్తు పీడనః ।
(అ. హృ. సూ. 11/25)

21. న కేవలం చయం ప్రాప్య దోషాః కుప్యంతి దేహినామ్ ।
అన్యతోఽపి హి కుప్యంతి హేతుబాహుల్యతో బలాత్ ॥
(మధుకోశ నానారోగ (7)

22. ... అచయేఽపి దోషాణాం ప్రకోపో భవత్యేవ ।
(చక్రపాణి. చ. చి. 30/329)

23. వక్ష్యంతేతః పరం దోషా వృద్ధిక్షయ విభేదతః ।
భేదా ద్విషష్టి ర్నిర్దిష్టాః ... ॥ (అ. హృ. సూ. 12/78)

24. సంసర్గా ద్రసరుధిరాదిభి స్తథైషాం
దోషాంస్తు క్షయసమతా వివృద్ధభేదైః
ఆనంత్యం తరతమ యోగతశ్చయాతాన్
జానీయా దవహిత మనసో యథాస్వమ్॥ (అ. హృ. సూ.)

25. సర్వేషామేవ వ్యాధీనాం వాతపిత్త శ్లేష్మాణ ఏవ ।
మూలం, తల్లింగత్వాత్ దృష్టఫలత్వాత్ ఆగమాచ్చ ।
(సు.సూ. 24/8)
దోషా ఏవహి సర్వేషాం రోగాణా మేకకారణం ।
(అ. హృ. సూ. 12/32)

26. నను శోణితస్యాపి దోషత్వాత్ నాయం సంగ్రహః
సాధు ... తస్మాత్ త్రయ ఏవదోషాః ఇతి సిద్ధః ॥
(చక్రపాణి. చ. సూ. 1/59)

27. తత్ (మనః) త్రివిధమాఖ్యాయతే శుద్ధం రాజసం
తామ సమితి। తేషాం తు త్రయాణా మపి సత్వానాం
ఏకైకస్య భేదాగ్రం అపరిసంఖ్యేయం తరతమ
యోగాత్ శరీరయోగాత్ శరీరయోని విశేషేభ్య
శ్చాన్యోన్యాను విధానత్వాచ్చ । (చ. శా. 4/36)

28. తత్ర శుద్ధం అదోష మాఖ్యాతం కళ్యాణాంశత్వాత్ ।
(చ. శా. 4/36)

సత్త్వం వృద్ధం విశుద్ధజ్ఞాన జననాత్ రజస్తమోఽపి
సంసారకారణే విజిత్య ప్రకృతి పురుష వివేకజ్ఞానాత్
మోక్షమావహతి ॥ (చక్రపాణి. చ. శా. 1/36)

రాజసం సదోష మాఖ్యాతం, రోషాంశత్వాత్ ।
తామస మపి సదోష మాఖ్యాతం, మోహాంశత్వాత్ ।
(చ.శా. 4/36) (భగవద్గీతా. చూడు. 14/11-18)

29 శరీరంహ్యాపి సత్త్వమను విధీయతే సత్త్వం చ శరీరం।
(చ. శా. 4/36)

రజోగుణమయః సూక్ష్మః (వాతః).
పిత్తం సత్త్వగుణోత్తరమ్ ।
కఫం .. తమోగుణాధికః ॥ (శార్ఙ్గధర. 1/5/26/34)
శారీరో జాయతే పూర్వం దేహే మనసి మానసః। (చ.చి. 3/36)

---

## 4వ అధ్యాయం

## అగ్ని సామ్యము మరియు వైషమ్యం.

పంచ భూతాలలో ఒకటైన అగ్నికి తేజస్సు అని పేరుకూడా ఉంది. ఈ విశ్వప్రపంచంలో అగ్ని నాలుగు విధాలుగా కనిపిస్తుంది.

1) దివాగ్ని .. సూర్యమండలంలో కనిపించే వేడి.

2) భౌమాగ్ని - భూమిలో జ్వాలారూపంలో ఉండేది.

3) ఔదర్యాగ్ని .. ప్రాణుల శరీరంలో (కుక్షి) ఉండి అన్న పాచన చేసేది.

4) ఆకరజాగ్ని - భూమిలోపల ఖనిజ లోహాల్లో ఉండేది. నాలుగు విధాలైన అగ్నులూ వివిధరూపాల్లో కనిపిస్తూన్నప్పటికి అవి చేసే కార్యాలు మాత్రము స్థూలంగా ఒక్కటిగానే కనిపిస్తాయి. రాగం (రంగును) కల్గించేది. పాక (పక్వం చేయుట) మార్పుచేయుట, ఊష్మ

(వేడిని కల్గించుట) ఓజస్సు, తేజస్సు, మేధ (బుద్ధి) వీటిని కలుగజేయు నది. ఇవి అన్నియు క్లుప్తంగా అగ్ని కార్యాలే. (1)

ప్రాణుల శరీరంలో ఉదరంలో ఉండే ఔదర్యాగ్నికి జఠరాగ్ని, కాయాగ్ని, కోష్ఠాగ్ని, పాచకాగ్ని అని పేర్లుకూడా ఉన్నాయి. జఠరాగ్ని మనం లోకంలో చూసే శిఖవలె అగ్నిలాకాకుండా ద్రవరూపంలో ఉంటుంది. త్రిదోషాలలో ఒకటైన పిత్తం అంటే ఇదే. పిత్తంకన్నా వేరే అగ్ని లేదని ఆయుర్వేదశాస్త్రం ఘోషిస్తోంది. కార్య నిర్వహణలో దీనిని అగ్ని యనీ, ద్రవ్యస్వరూపం తెలియజేసే టప్పుడు పిత్తం అనీ పిలుస్తారు ఈ పిత్తం పాచక, రంజక, భ్రాజక, సాధక, ఆలోచకా అని ఐదు విధాలు. ఈ పై ఐదు రూపాంతరాలైన పిత్తాలను పాచకాగ్ని అనీ రంజకాగ్ని అనీ కూడా పిలుస్తారు. కాని వీటిల్లో పాచకపిత్తాన్ని మాత్రం ప్రత్యేకంగా జఠరాగ్ని అనీ కోష్ఠాగ్ని అనీ సూచిస్తారు. (2)

మానవ శరీరంలో అగ్ని 13 విధాలుగా ఉంటుంది.

1. కోష్ఠాగ్ని 1, 2. భూతాగ్నులు 5, 3. ధాత్వగ్నులు 7.

(1) కోష్ఠాగ్ని :- ఆమాశయ పక్వాశయాల్లో ఉండే పిత్తం ఇది మనష్యుడు సేవించే ఆహారాన్ని పచనం చేస్తూంటుంది. ఇది ద్రవ రూపంలో ఉండి స్నేహరూపమై, తీక్ష్ణ, ఉష్ణ గుణాలు కల్గి విశేషంగా ఆహారపాచనం చేయడం మూలంగా దీనినే పాచకాగ్ని అనికూడా పిలుస్తారు. ఈ కోష్ఠాగ్ని తన పాచనశక్తిని శరీరంలోని ఇతర అగ్నులకుకూడా దానం చేస్తూ అవికూడా వాటి వాటి పాచనక్రియలను నిర్వర్తించేలా చూస్తుంది. (3)

(2) భూతాగ్ని :- పార్థివ, ఆప్య, తేజసీయ, వాయవ్య, ఆకాశీయము అనబడే ఐదు విధాలైన పైయగ్నుల అంశలు కోష్ఠాగ్నిలోనే నిక్షిప్తమై యున్నాయి. జఠరాగ్ని ఆహారాన్ని పచనం చేసిన తరువాత ఈ ఐదు అగ్నులు తమతమ గుణప్రాధాన్యం గల పార్థివ, ఆప్య, తేజసీయ, వాయవ్య, ఆకాశీయము అనబడే తత్వప్రాధాన్యంగల ఆహారపదార్థాలను మరల పచనం చేస్తాయి. (4)

(3) ధాత్వగ్నులు -- రసరక్తాది సప్తధాతువులలోకూడా ప్రత్యేకంగా ఒక్కొక్క అగ్ని అంశం ఉంది. పై వివరించిన కోష్ఠాగ్ని మరియు భూతాగ్నులద్వారా పచనమైన తరువాత తయారగు రసధాతువులలో ఉన్నట్టి ధాతుపోషకాంశలను (అస్థాయి ధాతువును) ఈ ధాత్వగ్ని మరల పచనం చేసి, రసధాతువుగా నిర్మింపజేస్తుంది. ఆయా ధాత్వగ్నులచే పచనమైనతర్వాత సరియైన రీతిలో ధాతువులు రూపుదిద్దుకొని పోషింపబడతాయి. (5)

జఠరాగ్ని వ్యాపారంలో ఏదోషమూ, లోపమూ లేకుండా ఉన్నంత కాలమూ భూతాగ్ని, ధాత్వగ్నులుకూడా తమతమ సామ్యసహజస్థితిలోనే ఉండి శారీరక ఆరోగ్యాన్ని కాపాడుతూ ఉంటాయి. జఠరాగ్ని మందగించి వికృతిచెందితే భూతధాత్వగ్నులు కూడా వాటి క్రియలలో మందగిస్తాయి. మానవుని ఆయుస్సు, బలము, రూపము, తేజస్సు, ఓజస్సు అన్నీ కూడా అగ్నిపైనే ఆధారపడి ఉన్నాయి. అగ్ని సామ్యస్థితిలో ఆరోగ్యంగా ఉంటేనే మానవుడు దీర్ఘకాలం సుఖంగా జీవిస్తాడు. లేనప్పుడు రోగాలకు గురి యవుతాడు. అందుచే ప్రాణధారణకు అగ్నియే మూలం. ధాతువులు, ఓజస్సు, బలము, రంగు _ వీటికి కారణభూతమైన పరిపూర్ణ పోషకాహారం అగ్నులచేత సమ్యక్పచనం అయిన తరువాతనే ఆపాచన సారం చేత శరీరపోషణ జరుగుతుంది మరియు దోషధాతువుల సరియగు కార్యనిర్వహణకు కూడా ఈయగ్నియే కారణము. [6]

## అగ్నిసామ్యము మరియు వైషమ్యము

సామ్యము అంటే సరియయిన ప్రాకృతిక ఆరోగ్యస్థితి. అంటే శరీరంలోని అగ్నులు తమ స్వాభావికమైన ప్రమాణ గుణకర్మలను పొంది యుండటం. దీనికి విపరీతమైనది వైషమ్యం ఇది అస్వాభావికం. దోష ధాతువులు వైషమ్యం చెందినట్లుగానే అగ్నులు కూడా రెండు విధాలైన వైషమ్యాన్ని చెందుతాయి.

అగ్నిమాంద్యము (క్షీణత):_ తమ సహజపాచనశక్తిని పోగొట్టుకొని దౌర్బల్యాన్ని పొందటాన్ని మాంద్యం అంటారు.

అగ్ని తీక్ష్ణం - తనస్వాభావిక పాచనశక్తికంటె అధికమైన పాచన శక్తిని పొందడం. ఈ అగ్నిమాంద్యం, ఈ అగ్ని తీక్ష్ణత, రెండూకూడా అగ్నికి వైషమ్యస్థితులే. ఈ రెండు వికృతస్థితులుకూడా శరీరారోగ్యాన్ని పాడుచేసి, రోగాలను కల్గించే అవకాశం ఉంది. ఈ తీక్ష్ణ మాంద్యాలు రెండిటినీ కోష్ఠాగ్ని, ధాత్వగ్నులకు అన్వయించేలాగున వాటివాటి వైషమ్యాన్ని తెలిసికోవడం ఆవశ్యకం.

## కోష్ఠాగ్ని (జఠరాగ్ని) సామ్యము-వైషమ్యము

కోష్ఠాగ్నిని 4 విధములుగా మానవుని శరీరంలో ఆయా స్థితులనుబట్టి విభజింపవచ్చును.

1) సమాగ్ని :- యోగ్యమైన రీతిలో తినిన ఆహారాన్ని శరీరానికి ఏవిధమైన బాధా కలుగకుండా నియమిత సమయంలో పచనం చేసేది సమాగ్ని. ఆరోగ్యానికి హితకరమైన ఈఅగ్ని శరీరంలోఉండటం శ్రేష్ఠం. ఈవిధమైన సమాగ్ని ద్వివిధ (సంసర్గ సమ్మిశ్ర) ప్రకృతులుగల మనుష్యులలో సహజంగా ఉండి ఆరోగ్యాన్ని కాపాడుతుంది. (7)

2) మందాగ్ని - అల్పమైన, తేలికైన ఆహారమునుకూడా, చాలకాలం వరకూ పచనం చేయకుండా శరీరంబరువు పొట్టఉబ్బరం, ఆయాసం మున్నగు లక్షణాలు కల్గించేది మందాగ్ని. ఈ మందాగ్ని సహజంగా కఫప్రకృతిగల మనుష్యులలోను కఫవృద్ధిచేసే ఆహార విహారాలు అధికంగా ఆచరించే వారిలోనూ ఉంటుంది. (8)

3] తీక్ష్ణాగ్ని - అధికమైన బరువైన ఆహారపదార్థాలను కూడా అతి స్వల్పకాలంలో పచనం చేసేది. మఱియు పాచనకాలంలో కడుపులోనూ, శరీరమంతటనూ మంట, పుల్లనిత్రేపులు, తలత్రిప్పట, దాహము మొదలయిన లక్షణాలు కలుగజేసేది తీక్ష్ణాగ్ని అనబడుతుంది. ఇది ముఖ్యంగా పిత్త ప్రకృతి మనుష్యులలోను, పిత్తవృద్ధికర ఆహారవిహారాదులను సేవించే వారిలోను ఉంటుంది. [9]

4] విషమాగ్ని - ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క విధంగా ఆహారపాచనం చేస్తూ, పాచనకాలంలో కడుపుబ్బు, నొప్పి, మలబద్ధత మొదలగు లక్షణాలను కల్గించేది విషమాగ్ని. ఈ విషమాగ్ని ముఖ్యంగా

జాతప్రకృతులలోనూ, వాతవృద్ధికాల ఆహారవిహారాదులను ఆచరించే వారిలోనూ ఉంటుంది. [10]

పైని వివరించిన నాలుగు విధములైన అగ్నులలోను సమాగ్నియే శ్రేష్ఠము. మిగిలిన మూడగ్నులు రోగోత్పత్తికి కారణాలే. అధికశాతం వ్యాధులు మందాగ్నిమూలంగా కల్గుతాయి. అందుచేత మిగిలిన విషమ తీక్ష్ణాగ్నులనుకూడా అగ్నిమాంద్యం అనేపేరు క్రింద జమకట్టి అన్నిరోగాలకి మందాగ్నియే మూలం అని ప్రాచీనగ్రంథాలలో విశదంగా వర్ణించారు. [11]

## అగ్నివైషమ్యంవల్ల కలిగే పరిణామం – ఆమోత్పత్తి

పైవివరించిన మంద తీక్ష్ణవిషమాగ్నులు మూడుకూడా వికృతాగ్నులు అవడంమూలంగా వాటిలో ఏఒక్క దానివల్లనూ జీర్ణక్రియ సరిగా జరగదు–మందాగ్నివలన ఆహారం స్వల్పంగా అరుగుట. తీక్ష్ణాగ్నివల్ల ఆహారం దగ్ధం అగుట, విషమాగ్నివల్ల కొంతభాగం పక్వం, కొంతభాగం అపక్వం చెందుట. ఈ విధంగా జరిగి అపక్వాహారం 'ఆమం' గా మిగిలిపోతుంది. ఈ విధంగా మిగిలిన పచనంగాని అర్ధపక్వమైన ఆహారంనుండి తయారగు రసధాతువు [అస్థాయి, స్థాయి] రసంకూడా అపక్వంగానే ఉంటుంది. దీనినే ఆమయుక్త రసధాతువు అంటారు. [12]

సుపక్వరస మరియు ఆమరసాల పోలిక ఈ క్రిందివిధంగా, ఇవ్వబడింది –

| అ) ప్రాకృత (సామ్య) రసధాతులక్షణ | ఆ) సామరస ధాతులక్షణ |
| --- | --- |
| 1. అచ్ఛ (కశ్మలరహితం) | 1) ఆవిల (కశ్మలయుక్తం) |
| 2. తను (పలుచని ద్రవం) | 2) స్త్యాన (సాంద్రద్రవ) |
| 3 స్నిగ్ధ (జిడ్డుగల ద్రవం) | 3) బహుపిచ్ఛిల (అతిగాఅంటుకొనే) |
| 4 నిర్గంధ | 4) దుర్గంధ |
| 5. సూక్ష్మ అతిసూక్ష్మరంధ్రాల్లో కూడ ప్రవేశించే శక్తిగల | 5) బహుల (సూక్ష్మరంధ్రాల్లో ప్రవేశించనేరని–దారమువలె సాగెడి. |

ఈ విధంగా సహజమైన ఆరోగ్యకరమైన రసమునకు ఆమరసానికీ తేడా ఉంది.

మందాగ్ని చే ఆహారం సరిగా పచనం కాకపోవుట మూలంగా ఆమం పేరుకు పోయి వీటినుండి రసధాత్వగ్ని చేత తయారగు అస్థాయి రసధాతువు కూడా పైఆమంతో [రసం] కూడి సామరసం అని పిలువబడుతుంది. రస ధాతువు ఆమంతో కలిసినపుడు దానిలో ఆశ్రయం పొందిన త్రిదోషాలు అస్థాయి ధాతువులు కూడా ఆమయుక్తమే అవుతాయి. అందువల్ల వాటిని సామదోషాలనీ, సామధాతువులనీ పిలుస్తారు. ఈసామధాతు సామదోషాల వల్ల జనించే రోగాలను కూడా సామరోగా లనే పిలుస్తారు. [13]

ఈ సామరసధాతువు సర్వశరీరంలోను, కణకణాల్లోను సంచరిస్తూ ఉండడంచేత, పైఆమలక్షణాలు శరీరంలోని అన్నిభాగాలలోను వ్యక్త మౌతూ ఉంటాయి. ఇందులో స్రోతోవరోధం, బలభ్రంశం, శరీరం బరు వెక్కుట, పనిలో ఆలస్యం, నోటిలో ఎక్కువగా ఉమ్మిఊరుట, అరుచి, నీరసం, ఇవి ముఖ్యలక్షణాలు. (14)

సామరసధాతువును రసవృద్ధిఅని చెప్పినట్లుగానే దోషవృద్ధినికూడా సామావస్థ అనే పిలువవచ్చును. ఆమద్రవ్యాల కూడిక చేత ఆమరస, ఆమ దోషాల ప్రమాణగుణాలలో తప్పక వృద్ధి కల్గుతుంది. సామరసం ఉత్పన్న మైన వెంటనే ఆరసధాతువు నాశ్రయించుకొని ఉండు త్రిదోషాలుకూడా తమ లక్షణాలను ఈ విధంగా సామరూపంలో వ్యక్తం చేస్తాయి. [15]

1] సామవాతలక్షణాలు .- మలబద్ధత, అగ్నిమాంద్యం, ప్రేగు అర చుట, శరీరంలోపోట్లు, వాపు, శరీరం బిగపట్టినట్లు బాధ; బాధ,నొప్పులు శరీరం అంతట వ్యాపించుట.

2] సామపిత్తలక్షణాలు :- గొంతులోను, కడుపులోను, మంట; దాహం, పుల్లని ఉద్గారం, దుర్గంధంతో గూడిన చెమట, పసుపు నలుపు రంగులు కలిగిన వమన విరేచనాలు, అతిసారం మొదలగునవి.

3] సామకఫలక్షణాలు - కంఠంలో, చాతీలో. దుర్గంధంతో కూడిన చిక్కని గట్టి కఫం పేరుకొనిపోవుట, ఆకలిమందగించుట, త్రేను పులు అడ్డగించుట.

[వి సూ. సామధాతువుల వివరణ ముందు వ్రాయబడుతుంది]

## ఆమమే సర్వరోగాలకు మూలం

సామరసం సర్వశరీరంలోనూ, ప్రతికణంలోనూ సంచరించేటప్పుడు, ధాతువుల [కణసముదాయం] లోని అతి సూక్ష్మమైన మార్గాలలో ప్రవహింప వీలులేక (వాటి గురు, పిచ్ఛల, సాంద్రగుణాలవల్ల) అందులోని అధిక భాగం పెద్దవైన స్రోతస్సులలోనే నిలచిపోయి, ఆస్రోతస్సులను అడగించి, వాటి వాటి ప్రాకృతకర్మలను నిరోధిస్తుంది. ఒకవేళ ఈ ఆమరసం సూక్ష్మస్రోతస్సులను ప్రవేశించినాకూడా ఆసూక్ష్మస్రోతస్సులను అడ్డగించి వాటి వాటి కార్యాలను నిరోధిస్తాయి. దీనిచే స్రోతస్సుల కార్య నిర్వహణలో వికృతి ఏర్పడుతుంది. దీనినే ఖవైగుణ్యం అంటారు.

స్రోతోవికృతివల్ల ధాతువికృతీ, దానిచే రోగోత్పత్తీ జరుగుతాయి. అందుచే పైవివరణచే నిశ్చయంగా తెలిసిందేమంటే, రోగోత్పత్తికి ఆమమే ముఖ్యకారణము అని నిస్సందేహంగా చెప్పవచ్చును. ఇదే ఆయుర్వేద ముఖ్య సిద్ధాంతముకూడా. మందాగ్నివల్ల క్రమంగా అధికప్రమాణంలో ఆమంఉత్పత్తిఅవుతుంది. దీనివలన ఉత్పన్నమగు రోగాలుకూడా అనేకం. మందాగ్నితరువాత చెప్పుకోదగ్గవి విషమాగ్ని తీక్ష్ణాగ్నులు. కాని బాహుళ్యానికే ప్రాధాన్యం అన్న నియమంచేత రోగాలన్నియూ మందాగ్నిచే కల్గుతాయనీ, అట్లే సర్వరోగాలూ ఆమజములనే (ఆమముచేతనే కల్గుతాయనే) వివరింపబడింది. (16) అయితే కొన్ని నిరామము (ఆమంతో సంబంధంలేనివి) గా ఉద్భవించే రోగాలుకూడా ఉన్నాయి. కాని వాటి సంఖ్య అత్యల్పం. కనుక వానికి ప్రాముఖ్యం లేదు.

తీక్ష్ణకోష్ఠాగ్ని :- కొన్నిసమయాలలోను, ఇంకా కొన్నిఋతువుల లోనూ జఠరాగ్ని తనశక్తికన్న కొంచెం ఎక్కువశక్తి కలదై ఆకలిని ఎక్కువ కల్గిస్తూ ఉండటం మనము గమనిస్తూన్న విషయమే అప్పుడు ఆహారపచనం క్రమంగానూ, నెమ్మదిగానూ, అతిగా ఆగ్నేయగుణం కల్గినది గానూ విదగ్ధం అవుతుంది. ఇట్టి పరిస్థితులలో శరీరం తరచు ఆహారాన్ని కోరుతూఉంటుంది. ఈ ఆహారం అంతా పూర్తిగా దగ్ధమైపోయి ధాతువు

లకు పోషణయే లేకుండా పోతుంది. పోషణ క్షీణించినపుడు ధాతువుల లోని అగ్ని ప్రత్యేకంగా ఒక్కొక్క అగ్ని దహించి, శరీరాన్ని శుష్కింప చేసి మృత్యువుకు వశాన్ని చేస్తుంది. ఈరోగాన్ని 'భస్మక' రోగం అంటారు. (17)

## ధాత్వగ్నిసామ్యం - వైషమ్యం

రసాదిసప్తధాతువులలో ఉండే విశిష్టమైన ఏడు ధాత్వగ్నులు ప్రాకృతస్థితిలో అంటే వాటివాటి సామ్యస్థితిలో నున్నపుడు రసధాతువు మిగుల్చుకున్న పోషకఆహారాంశాలను మరల సమ్యక్ పచనంచేసి, ధాతువుల వాటివాటి రక్షణకు, పుష్టికి తోడ్పడుతాయి. ఈ ధాతురక్షణకు, పుష్టికి కోష్ఠాగ్నిచక్కగా, సమంగాఉండటం ఎంతో ప్రధానం ఈ పైఅగ్ను లన్నియూ కోష్ఠాగ్నివల్లనే బలాన్ని పొందుతాయి. కోష్ఠాగ్ని లోపభూయి ష్ఠం అవడంతో అంటే అదివైషమ్యం చెందడంతో ధాత్వగ్నులుకూడా అదేవైషమ్యాన్ని పొందుతాయి. ధాత్వగ్నిమాంద్యం కల్గినపుడు సామ రసం పచనం కాకుండా ధాతు మార్గాల బైటనే పేరుకొనిపోయి, ఆమ ధాతువులను వృద్ధిచేస్తుంది. కాని ఈవృద్ధి ఆరోగ్యకరమైన వృద్ధికాదు. అంటే విషమవృద్ధియే. ఇది ఆమజన్యం మూలంగా శరీరానికి రోగకార ణమేతప్ప ఆరోగ్యకరం కాదు. ధాత్వగ్ని తీక్ష్ణతను చెదింనట్లైతే రసధా తువునుంచి దొరికే పోషకాంశాలనూ, నెమ్మదిగా పచనం చేయడమే కాకుండా ధాతు పరమాణువులను కూడా పక్వం చేస్తుంది. ఆవిధంగా క్రమంగా ధాతువులు క్షీణించిపోతాయి. (18)

ఈవిధంగా ధాతువృద్ధి మఱియు క్షయాలు రెండూ కూడా వికృతు లనే అనిపిస్తాయి.

ధాతువులలో సామావస్థ, కోష్ఠాగ్ని బలహీనతద్వారా కాక మరొ క్క విధంగా కూడా సంభవిస్తుంది ఉదాహరణకు కోద్రవధాన్యాన్ని (కొఱ్ఱలు) ఒక్కగాదిలోఉంచి చాలకాలం నిలువ ఉంచితే అందు ఒక విధమగు విషం తయారవుతుంది. అదేవిధంగా వికృతిచెందిన (వృద్ధిచెందిన)

దోష ధాతువుల సంయోగము (దోష దూష్య సమ్మూర్ఛన) ధాతువులలో ఆమాన్ని వృద్ధిచెందిస్తుంది. (19) ఈ ఆమవృద్ధిక్రమం ముందుముందు వివరించ బడింది.

## అ ధ్యా య సా రాం శ ము

(1) శరీరంలో 13 అగ్నులు ఉంటాయి. పిత్తం అంటేనే అగ్నిస్వరూపం. కోష్ఠాగ్ని (జఠరాగ్ని) బలిష్ఠమై ఆరోగ్యవంత మయినంతకాలము ఇతరభూతాగ్ని ధాత్వగ్నులుకూడా బలిష్ఠంగా ఉంటాయి.

(2) సమాగ్ని గాక ఇతర మందాగ్ని తీక్ష్ణ విషమాగ్నులు మూడున్నూ వైషమ్యాలే. ఈ మూడుకూడా దోషభూయిష్ఠాలే. శాస్త్రప్రకారం ఈ మూడిటినీకూడా అగ్నిమాంద్యమనే వ్యవహరిస్తారు.

(3) అగ్నిమాంద్యంచేత ఆమోత్పత్తి, ఆమోత్పత్తిచేత, స్రోతో వికృతి (స్రోతోవైగుణ్యం) మఱియు ధాతువికృతులు కల్గుతాయి. ఆమమే సర్వరోగోత్పత్తికీ హేతువు. ఆమంతోగూడిన దోషధాతువులను మఱియు వాటివల్ల ఉత్పన్నమగు రోగాలనుకూడా సా౽మ అనేపిలుస్తారు. ఈ సామరోగాలసంఖ్య అత్యధికం.

## శాస్త్రోక్త శ్లోకాలు

1. తేజః (అగ్నిః) చతుర్విధో భౌమ దివ్యోదర్యా కరజ భేదాత్।

(తర్క సంగ్రహం)

రాగపక్త్యోజ స్తేజో మేధోష్మకృత్ పిత్తం పంచధా ప్రవిభక్తః అగ్నిః కర్మణా అనుగ్రహం కరోతి। (సు సూ 15/2)

2. అగ్నిరేవ శరీరే పిత్తాంతర్గతః కుపితా౽కుపితః శుభాశుభాని కరోతి। న ఖలు పిత్త వ్యతిరేకా దన్యో౽గ్నిరు పలభ్యతే ఆగ్నేయత్వాత్ పిత్తే దహన పచనాది ష్వభిప్రవర్తమానేషు అగ్నివదుపచారః క్రియతే అంతరగ్నిరితి।...

.. ... పాచకో౽గ్నిరితి ... ... భ్రాజకో౽గ్నిరితి ... ... సంజ్ఞా. (సు. సూ. 219-10)

3. ... ... తత్ర పక్వామాశయ మధ్యగం।
పంచ భూతాత్మకత్వేఽపి యత్తైజసగుణోదయాత్ ॥
.. .. ... .. .
కరోతి బలదానేన పాచకం నామ తత్ స్మృతమ్ ॥
(అ. హృ. సూ. 12/10-12)

4. భౌమ్యాప్యాగ్నేయ వాయవ్యా పంచోష్మాణః సనాభసా।
పంచాహార గుణాన్ స్వాన్ స్వాన్ పార్థివాదీన్ పంచతి హి ॥
(చక్రపాణి వ్యాఖ్యా - చ. చి. 15/13)

5. సప్తభిర్దేహ ధాతారో ధాతవో ద్వివిధం పునః।
యథాస్వమగ్నిభిః పాకం యాతి కిట్ట ప్రసాదవత్ ॥
(చ. చి. 15/14)

6. ఆయుర్వర్ణం బలం స్వాస్థ్యం ఉత్సాహోపచయౌ ప్రభా।
ఓజస్తేజోఽగ్నయః ప్రాణాశ్చోక్తా దేహాగ్ని హేతుకాః ॥
శాంతేఽగ్నౌ మ్రియతే యుక్తే చిరం జీవత్యనామయః।
రోగీ స్యా ద్వికృతే మూల మగ్ని స్తస్మాన్నిరుచ్యతే ॥
(చ. చి. 15/2-4)

7. మందః తీక్ష్ణోఽథ విషమః సమశ్చేతి చతుర్విధః।
కఫపిత్తానిలాధిక్యాత్ తత్ సామ్యాజ్జాఠరోఽనలః ॥
సమా సమాగ్నే రశితా మాత్రా సమ్యగ్విపద్యతే।
. .. సమాగ్నిః శ్రేష్ఠ ఉచ్యతే॥ (మా. ని. అగ్నిమాంద్య)

8. .. స్వల్పాపి నైవం మందాగ్నే . . । (మా. ని )
యస్తు అల్పమప్యుపయుక్తః ఉదర శిరో గౌరవ కాసశ్వాస ప్రసేక ఛర్ది గాత్ర సాదనాని కృత్వా మహతా కాలేన పచతి సమందః ॥
(సు.సూ. 35/24

9. యః ప్రభూత మప్యుపయుక్త మన్నం ఆశు పచతి సతీక్ష్ణః .
పాకాంతే చ గలతాల్వోష్ఠ శోష దాహ సంతాపాన్ జనయతి . ।
(సు. సూ. 45/15)

10. విషమాగ్నేస్తు దేహినః। కదాచిత్ పచ్యతే సమ్యక్ కదాచిన్న విపచ్యతే॥

కదాచిధ్మ్యాన శూలోదావర్తాతిసార జఠర గౌరవ ఆంత్రప్రయో జనప్రవాహణాని కృత్వా (పచతి) సవిషమః। (సు.సూ. 35/24)

11. విషమో వాతజాన్ రోగాన్ తీక్ష్ణపిత్తనిమిత్తజాన్ ।
కరోత్యగ్నిః తథా మందో వికారాన్ కఫసంభయాన్॥
సు. సూ. 35/25)

అగ్నిదోషా న్మనుష్యాణాం రోగసంఘాః పృథగ్విధాః।
మలవృద్ధా ప్రవర్తంతే ... ... (చ. చి. 13/6) 13_6
రోగాః సర్వేఽపి మందేఽగ్నౌ। (అ. హృ. ని12/1

12. ఊష్మణోఽల్ప బలత్వేన ధాతుమాద్య మపాచితమ్।
దుష్ట మామాశయ గతం రసం ఆమ మితి ప్రచక్ష్యతే॥
(అ. హృ. సూ. 13/15)

ఆమాశయస్థ కాయాగ్నే ర్దౌర్బల్యా దవిపాకతః।
అద్య ఆహార .. .. ఆమ మిత్యభి ధీయతే॥
(మధుకోశ వ్యాఖ్యా)

13. అవి పక్వమసం యుక్తం దుర్గంధం బహు పిచ్ఛిలమ్।
సాదనం సర్వగాత్రాణా మామ మిత్యభి ధీయత్॥
(మధుకోశ వ్యాఖ్యా)

ఆమేన తేన సంపృక్తా దోషా దూష్యాశ్చ దూషితాః॥
సామా ఇత్యుపదిశ్యంతే యేచరోగాః తదుద్భవాః॥
( 6. హృ. సూ. 13/26 )

14. స్రోతోరోధో బలిభ్రంశో గౌరవానిల మూఢతా।
ఆలస్యాపక్తి నిష్ఠీవ మలసంగారుచి క్లమాః।
లింగం మాలానాం సామానాం। ( అ. హృ. 11/23.24 )

15. వాయుః సామో విబంధాగ్ని సాదతందాగ్రంత్ర కూజనైః ।
వేదనాశోఽథ నిస్తోదైః క్రమశః అంగాని పీడయేత్ ॥
... .. .. ..
... ... .. ...
.. ... .. ...
సామో బలాసో దుర్గంధః క్షుద్ద్వార విఘాతకృత్ ।
( విజయ రక్షిత మధుకోశ వ్యాఖ్యా )

16. కుపితానాం హి దోషాణాం దోషాణాం శరీరె పరిధావనం ।
యత్ర సంగః ఖవైగుణ్యా వ్యాధిః తత్రోపజాయతే ॥
( సు, సూ. 24/10 )
మరియు ( చూడు. అరుణదత్త. అ. హృ. ని. 1/1 )

17. అత్యంత తీక్ష్ణాగ్నిరేవ భస్మక ఇత్యుచ్యతే । యదుక్తం చరకే ।
( చ. చి. 15/217 - 284 ) మధుకోశ అగ్నిమాద్యనిదానం )

18. యే పాచకాంశా ధాతుస్థాః తేషాం మాంద్యాతితైక్ష్ణతః ।
వృద్ధిః క్షయశ్చ ధాతూనాం జాయతే క్రమశు చాపరం ॥
పారంపర్యేఽపి దావాగ్నేః తత్త్వాప్రిష్యేంధనం శిఖా ।
వృద్ధిక్షయౌ యథా యాతి తథా ధాతు పరంపరా ॥
(అ. సం. సూ 16)

స్వస్థానస్తస్య కాయాగ్నేరంశా ధాతుషు సంశ్రితాః ॥
తేషాం సాదాతిదీప్తిభ్యాం ధాతువృద్ధి క్షయోద్భవః ॥
( అ హృ. సూ. 11/34 )

19 అన్యే దోషేభ్యః ఏవాతిదుష్టేభ్యో అన్యోన్య మూర్ఛనాత్ ।
కోద్రవేభ్యో విషస్యేవ వదంత్యామస్య సంభవం॥
( అ. హృ. సూ. 13/23 )

—•••—

# అ ధ్యా య ము - 5

## ధాతుసామ్యము మరియు వైషమ్యం

రసరక్తమాంసమేదోఽస్థిమజ్జా శుక్రము లనే ఈ ఏడు శరీరాన్ని ధరిస్తూ ఆరోగ్యాన్ని పోషిస్తూ ఉంటాయి. కావున వాటిని ధాతువులని పిలుస్తారు. వీటిని వాత పిత్త, కఫాలు, (త్రిదోషాలు) మూడు ఆశ్రయించటం మూలంగా (క్రమేఽపి వాతపిత్త కఫాల వికృతులు దూషింపబడటం మూలాన) దూష్యములనికూడా పిలువబడుతాయి. తల్లి గర్భంలో శుక్రశోణితాల సంయోగం అయిన వెంటనే (ఫలదీకరణ) ఈ సప్తధాతువుల ఉత్పత్తికూడా క్రమంగా మొదలయి మనుష్యుని యౌవనావస్థ సంపూర్ణతను సంతరించుకొని ప్రౌఢావస్థ చివరివఱకు అవిధం గానే ఉంటూ, ప్రాణరక్షణ, దేహరక్షణ, ఆరోగ్యరక్షణ గావిస్తూ, వృద్ధావస్థనాటికి క్రమంగా క్షీణించడం ప్రారంభించి కొంతకాలానికి నాశం కలుగజేస్తాయి అంటే శరీరనాశం (మరణం) కల్గుతుంది. మను ష్యుడు తీసికొనే ఆహారంవల్లనే ధాతుపోషణకూడా జరుగుతుంది. (1)

ఆరోగ్యవంతమైన జీవితశరీరంలో ధాతువులలో రెండు ప్రకారాలు (రూపాలు) ఉంటాయి.

(1) అస్థాయిరూపధాతువులు :- అస్థాయిఅంటే ఒక నిర్ణీతస్థానంలో ఉండనివి అని యర్థము.

ఆహారంలో ధాతువులకు కావలసిన అన్ని పోషకాంశాలూ ఉం టాయి. జఠరాగ్నిచేత పక్వంచెందిన ఆహారం తన భౌతికస్వరూప స్వభా వాలలో పూర్తిగా పరిణతిపొందిన తరువాత భూతాగ్నులు కూడా వాటి

వాటి పార్థివ, ఆప్య, తేజసీయ అని అంశాలను పక్వంచేసినపిదప ధాతువు లకు కావలసిన పోషకాంశాలు అతిసూక్ష్మరూపాన్ని పొంది, రసధాతువుతోకూడి, శరీరమంతటా ప్రవహిస్తూ ఉంటాయి. ఇవే సూక్ష్మధాతువులు ముందు ముందు స్థూలధాతువులుగా పరిణతి చెందుతాయి. అందుచేతనే సూక్ష్మరూపంలో రసధాతువుతో కలసి సంచారంచేసే వీటిని అస్థాయి ధాతువులని, స్థూలరూపం ధరించిన ధాతువులకు ఇవి ధాతుపోషణ కల్గించటం మూలాన పోషకధాతువులనీ పిలుబడతాయి. (2)

(2) స్థాయిధాతువులు - స్థాయిఅంటే ఒక ప్రత్యేకస్థానంలో నిలుకడగాఉండేవి అని అర్థం. ఈ ధాతువులు లోపలా బయటాకూడా స్థూల రూపంగానే కనిపిస్తాయి. వీటివల్లనే శరీరంలోని అంగప్రత్యంగాలు తయారవుతూంటాయి. రసధాతువులోఉండే పోషకాంశములమూలంగా ఇవి పోషింపబడటం మూలంగా ఈస్థాయి ధాతువులకు పోష్యధాతువులు అని పేరుంది. పోషక[అస్థాయి] ధాతువులు ఈ పోష్యధాతువులలో ఉండియే వాటివాటి ధాత్వగ్నులద్వారా పచనంచెందిన పిదప స్థాయిధాతువులుగా పరిణతి చెందుతాయి. స్థూలరూపంగా ఉండే స్థాయిధాతువులు మాత్రమే త్రిదోషాలకు ఆశ్రయమిస్తూ వాటి వృద్ధిక్షయాల మూలంగా దూషింపబడుతూంటాయి. ఈ స్థాయి (పోష్య, స్థూల) ధాతువులలోనే వ్యాధులు జనించి వృద్ధి చెందుతూంటాయి. అందుచేతనే వ్యాధివిజ్ఞానంలో ధాతువు అంటే స్థూలరూపంగా కనపడే స్థాయీధాతువుగానే అర్థం చెప్పుకోవాలి. ఈ స్థూలరూప స్థాయిధాతువులు మనిషికి 25, 30 సంవత్సరములు వయస్సు వచ్చేటప్పటికి తమపరిపూర్ణ ధర్మాలను ప్రమాణాన్నిపొంది, శరీర ధారణ, పోషణకర్మలను నిర్వహిస్తూ ఉంటాయి. [3] ఈసప్త స్థాయీ ధాతువుల సంపూర్ణ వివరణ ఈ క్రిందివిధంగా వర్ణింపబడియుంది. [4]

| ధాతువు | ప్రమాణం | గుణం | స్థానం | కార్యం |
|---|---|---|---|---|
| రసధాతువు | 9 అంజలి | ద్రవ, సర, మంద, స్నిగ్ధ, శ్వేత ఇత్యాది అప్యగుణములు. | ఆమాశయం, హృదయం, ధమనులు, చర్మం. | ప్రీణనం, తుష్టికరం, రక్త పుష్టికరం. |
| రక్తధాతువు | 8 అంజలి | తీక్ష్ణ, ఉష్ణ, రక్తవర్ణ, లఘు స్పందన, విస్రసర ఇత్యాది ఆగ్నేయ X ఆప్యేయ గుణాలు | యకృత్, ప్లీహం, ధమనులు, మాంసధాతువు. | జీవధారణం, ఉష్ణకరం, వర్ణకరం, మాంసపుష్టికరం. |
| మాంసధాతువు | 500 సంఖ్య | స్థూల, స్థిర, గురు, స్నిగ్ధ, పిచ్ఛిల ఇత్యాది పార్థివ X అప్యగుణాలు | ఎముకలను అంటుకొని శరీరాభ్యంతరంలో . | దేహాతాపం, చేష్టాకారిత్వం, మేదోపుష్టికరం |
| మేదోధాతువు | 2 అంజలి | స్నిగ్ధ, శ్లక్ష్ణ, గురు, సాంద్ర ద్రవ, మృదు ఇత్యాది అప్య+పార్థివగుణములు | స్ఫిక్ (పిరుదులు) ఉదర అభ్యంతరంలోను, వపావహనం, వృక్క, అణ్వాస్థులు | స్నిగ్ధత్వం, దార్ఢ్యం, అస్థి పుష్టి. |

| ధాతువు | ప్రమాణం | గుణం | స్థానం | కార్యం |
|---|---|---|---|---|
| అస్థిధాతువు (ఎముకలు) | 300 (సంఖ్య) | గురు, స్థిర, ఖర, కఠిన, ఇత్యాది పార్థివ గుణాలు కలది | శరీర అభ్యంతర భాగం లోను, కటిజఘనశాఖల లోనూ అధికంగా | దేహధారణం (ఆకృతి నిర్మాణం) మజ్జాపుష్టికరం. |
| మజ్జాధాతువు | 1 అంజలి. | సాంద్రద్రవ, స్నిగ్ధ, శ్లక్ష్ణ, మృదు ఇత్యాది ఆప్య గుణాలు | అస్థుల (ఎముకల) లోపల | అస్థిపూరణం, స్నేహనం, బలకరం, ప్రీతికారకం, శుక్రపుష్టికరం. |
| శుక్రధాతువు | 1/2 అంజలి | ద్రవ, శీత,స్నిగ్ధ,గురు,బహుళం ఇత్యాదిఆప్యగుణాలు | వృషణములు, మేఢ్రము | ధైర్యం, హర్షం (ఆనందం) ప్రీతి,బలం,గర్భోత్పత్తి. |

పైని వివరించిన ప్రకారం శరీరంలోని ప్రతి ఒక్క ధాతువు తన ప్రమాణ కర్మలలో స్వాభావిక సహజరీతిలో ఉండి, శరీరారోగ్యానికి ఏవిధమైన లోపం లేకుండా జీవయాత్ర సాగిస్తున్న స్థితిని సాత్మ్యం అని కూడా అంటారు. అట్లు గాకుండా పై ధాతువులు వాటి సహజప్రమాణ గుణకర్మలకంటె వృద్ధి చెందటంగాని, క్షీణించడంగాని జరిగినట్లైతే, ఆ స్థితిని ధాతువైషమ్యం అంటారు. ఈవిధంగా ఉదాహరించిన ధాతువులలో జరిగే వృద్ధిక్షయాలు రెండే రోగకారణాలు అయినప్పటికీ వీటిలో మరొక ముఖ్యకారణం కూడా ఉంది.

క్రిమి, కీటక, విష, మద్యాది విషమద్రవ్యాలు ఆహారపానీయాల ద్వారా శరీరంలోనికి చొచ్చుకొని పోయి, రక్తంతో బాటు కలిసిపోతాయి. ఈ పరిస్థితుల్లో రక్తం యొక్క పరిమాణ గుణకర్మలలో మార్పు అంతగా కనబడకున్నా, వాటి సహజ స్వాభావిక గుణాలకు బదులు అన్నిగుణాలూ కనబడుతూంటాయి. అందుచేత పైధాతువైషమ్యంలో వృద్ధిక్షయాలతో పాటు క్రిమి, కీటక, మద్య, విషాదుల వల్ల వచ్చే మూడవమార్పును వైష మ్యంగా గ్రహింపవచ్చును. (5) ఈవైషమ్యస్థితిని 'వ్యాపత్' అని పిలువ వచ్చును. ఇది గ్రంథకర్త అభిప్రాయము.

పైని ఉదాహరించిన ధాతుసామ్యం స్వాస్థ్య సాధకము, మరియు ధాతువైషమ్యం రోగకారకం. శరీరారోగ్యానికి మేలైన ఆహారవిహారా దుల సేవనచేత ధాతుసామ్యమును, దానివల్ల శరీరారోగ్యమున్నూ కాన బడతాయి. అహితాహారవిహార సేవనవల్ల ధాతువైషమ్యం కలిగి శరీరం రోగాక్రాంత మవుతుంది.

## ధాతువుల వృద్ధిక్షయాలు – వాని వివరణ

ధాతువులు వాటి వాటి సహజప్రమాణగుణకర్మలలో వృద్ధి చెందటాన్ని ధాతు వృద్ధి అంటారని తెలిసికొన్నాం. ఈవిధంగానున్న ధాతువృద్ధి శరీరానికి హితం మాత్రంకాదు. క్రిందటి అధ్యాయంలో అగ్నివైషమ్యం వివరణలో తెల్పినట్లుగా ధాతువృద్ధికూడా మందాగ్ని వల్ల కలిగే ఆమసంచయం ద్వారానే ఉత్పన్నమవుతుంది. ఈమందాగ్ని వల్ల ఉత్పన్నమయ్యే ఆమం సూక్ష్మ స్రోతస్సులను అడ్డగించడం మూలంగా రసధాతువు ధాతుపరమా ణువుల బైటనే మిగిలిపోయి, ఆయాధాతువుల వృద్ధికి కారణ మవు తుంది. అందుచే ఈవిధమైన ధాతువృద్ధిని సామవృద్ధి అని పిలుస్తారు. దీనివల్ల శరీరారోగ్యానికి అనేక విపత్తులు రోగలక్షణాలు సంభవిస్తాయి.

పుష్టిని కలిగించే ఆహార సేవన, నియమంగా వ్యాయామం, సంతృప్తితో నుండటం, రసాయన సేవనం, మొదలైన జాగ్రత్తలవల్ల శారీరరక్షణ చేసే ధాతువులు తమతమ ప్రమాణ గుణకర్మలలో క్రమంగా శరీరబల వృద్ధికోసం పెరుగుటను 'ఉపచయం' అనే పేరుతో పిలువాలి తప్ప, వృద్ధి అనే పేరుతో పిలువకూడదు. (వృద్ధియని యెప్పుడంటారో పైని వివరింపబడినది) ధాతు వృద్ధివలె క్షయం కూడా వికృతినే సూచిస్తుంది. తీక్ష్ణాగ్ని పరిణామంగా ధాతువులలో ధాతుక్షయం 'జరుగుతుంది. ధాతుక్షయం వల్లనూ దుఃఖలక్షణాలు శరీరంలో కన్పిస్తాంటాయి. అందుచేత ధాతువులలో కలిగే వృద్ధిక్షయాలు రెండూకూడా ఎల్లప్పుడూ శరీరారోగ్య వికృతినే సూచిస్తాయి తప్ప, శరీరరారోగ్యాన్ని వృద్ధిచేయలేవు.

## ధాతువుల - ద్వివిధక్షయం

ధాతుక్షీణత కూడా రెండు విధాలుగా ఉంటుంది. (6)

1) అనులోమక్షయము - పూర్వధాతువు క్షీణించటం వల్ల ఉత్తరోత్తర ధాతువు కూడా క్షీణిస్తుంది. ఉదా :- ఉపవాసం వల్ల రసధాతువు క్షీణించి క్రమంగా రక్త, మాంస, మేదో ధాతువులు కూడా క్షీణిస్తాయి.

2) విలోమక్షయము (ప్రతిలోమక్షయము) - ఏదైన ఒక ధాతువు కొన్ని ప్రత్యేక కారణాలవల్ల గాని, రోగ కారణాలవల్లగాని క్రమంగా క్షీణిస్తూ మిగిలిన ధాతువులను కూడా క్షీణింపజేయుట ఉదా - అధిక స్త్రీ సంభోగంచేత శుక్రధాతువు ముందుగా క్షీణించుట మొదలై తరువాత క్రమంగా మిగిలిన ధాతువులను కూడా క్షీణింపజేసి క్షయరోగాన్ని కల్గిస్తుంది. తీవ్రమైన దెబ్బలవల్ల కల్గిన వ్రణం, విషప్రయోగం, మొదలైన వాటివల్లనూ మరియు అతిసారం, రక్తపిత్తం మొ॥ రోగాలవల్లనూ కొన్ని ప్రత్యేక ధాతువులే మొదట క్షీణించి తరువాత ఇతర ధాతువులను క్షీణింపచేస్తాయి.

1. స్రోతస్సులు - (వివిధ మార్గాలు) - సామ్య వైషమ్యాలు :-

స్థాయీ (పోష్య) స్థూలరూప ధాతువులన్నీ కూడా అసంఖ్యాకమైన అతిసూక్ష్మ చేతన ధాతు పరమాణువులతో కూడి ఉంటాయి శరీరములోని ప్రతి అవయవము, అంగప్రత్యంగాలూ కూడా ఈ సూక్ష్మధాతువుల ధాతుపరమాణువుల సంయోగం (కూడిక) వలననే నిర్మింపబడుటచేత ఈ పరమాణువులు అసంఖ్యేయములు అని వివరించబడినది చైతన్యవంతము లైన ఈ ధాతుపరమాణువులు ఆహార సారభాగమైన ఆ స్థాయీ పోషక ధాతువుల చేతనే పోషింపబడతాయి. ఈ అతిసూక్ష్మమైన ధాతుపర మాణువులలో పోషక ధాతువు ప్రవేశించుటకు అత్యంత సూక్ష్మమైన మార్గాలున్నాయి ఈ సూక్ష్మమార్గాలనే "స్రోతస్సులు" అంటారు. మార్పుపొందవలసిన పోషక ధాతువుల సంచారం (ప్రసారణ) కోసం సహాయపడేవే స్రోతస్సులు. ఈ సూక్ష్మతమమార్గాలైన స్రోతస్సులకు ఆయన, మార్గ, పంథానం - అనే పేర్లు ఉన్నాయి. శరీరంలోని అన్ని అవయవాలు, అంగప్రత్యంగాలు ఇట్టి స్రోతస్సులు కల అసంఖ్యాక ధాతు పరమాణువుల సంయోగం చేత ఏర్పడిన స్థూల ధాతువుల వల్లనే నిర్మింప బడుట మూలంగా మానవుని "స్రోతోమయుడు" అని కూడ పిలుస్తారు. (7)

ఈ స్రోతస్సులు (సూక్ష్మతర మార్గాలు) ప్రతి ఒక్క ధాతు పర మాణువులలోను ఏర్పడి ఉండటం మూలంగా ఆయా స్రోతస్సులకు కూడా ధాతువుల పేర్లతో అంటే రసవహ, రక్తవహ, మాంసవహ మొదలైన ఆయా స్రోతస్సులు అనే పిలువబడతాయి. ఈ స్రోతస్సులు అతి సూక్ష్మతరములై కంటికి అగపడనివిగా నుండి ఆయా ధాతువుల పేర్లతో పాటు వాటి వాటి వర్ణమును కూడ పొందిఉంటాయి 8) ఈ స్రోతస్సులు బాహ్యమని ఆంతర మనీ రెండువిధాలు. పైకి కన్పడే శరీరంలోని కళ్లు, ముక్కు, చెవి, నోరు మొదలైనవి బహిర్ముఖ స్రోతస్సు లని పిలువబడతాయి. వీటిని స్థూలస్రోత స్సులని కూడా అంటారు. 9) కాని వికృతి విజ్ఞాన విషయంలోనూ, రోగ విజ్ఞానంలోనూ వర్ణింపబడే స్రోతస్సులు ధాతుపరమాణువులలో ఉండే - సూక్ష్మస్రోతస్సులకు మాత్రమే పరిమితము. ఎందుకంటే రోగ

ప్రాదుర్భావం ముఖ్యంగా ఈ సూక్ష్మ స్రోతస్సుల వికృతి వైషమ్యాల వల్లనే కల్గుతుంది.

స్రోతస్సుల విశిష్టత .- అతి సూక్ష్మతరమైన ధాతుపరమాణువుల లోని ఈ స్రోతస్సులు పోషక ధాతువులను (అస్థాయి ధాతువులను) తమ తమద్వారా తమ తమస్థాయీ ధాతువులకు కావలసినంత మాత్రమే ప్రసరింపచేసే వివేచనం కల్గి ఉంటాయి. రసధాతు పరమాణువులలోగల స్రోతస్సులు రక్తధాతు పోషకాంశములను తప్ప తమకు కావలసిన రసధాతు పోషకాంశములను మాత్రమే ఎన్నుకొని గ్రహిస్తాయి. అందుచేతనే స్రోతస్సులను ధాతువైశిష్ట్యాలు అని వివరించారు.

ధాతుపరమాణువులలోనికి ప్రవేశించిన పోషక ధాతువులు ఆయా ధాతువుల ధాత్వగ్నులచేత పునఃపచనం చేయబడతాయి ఈ పక్వ సమయంలో సారభాగము, కిట్టభాగము అని రెండు భాగములుగా ఈ ధాతువులు విభజింపబడతాయి. మరల ఈసారభాగము స్థూలంగా స్థూలం సూక్ష్మం అని రెండువిధాలు. ఇందు స్థూలధాతువుయొక్క పోషణకు, రక్షణకు, ఉపచయానికి మరియు సూక్ష్మభాగము ముందు ఏర్పడే ఆయా ధాతు నిర్మాణాలకు పోషణకు ఉపయోగింప బడుతుంది. పాచనక్రియలో రెండవభాగమైన కిట్టరూపము (మలరూపము) ధాతుపరమాణువుల నుండి బయటకు విసర్జింప బడుతుంది. ఈ మలరూప కిట్టముయొక్క బహిర్గమము కూడా ఈ స్రోతస్సుల ద్వారానే జరుగుతుంది.

## స్రోతస్సులు - వాటిరకాలు - వివరణ

శరీరంలోని వివిధ అంగప్రత్యంగాలన్నీ అతిసూక్ష్మస్రోతస్సులతో కూడిన ధాతు పరమాణువులచేత నిర్మింపబడ్డాయని తెలిసికొన్నాము. ఈ శరీరంలోని ఈవివిధ అంగప్రత్యంగాలను, వాటి నిర్మాణాన్ని వాటిలో కలిగే ముఖ్యకార్య క్రమాలను దృష్టిలో ఉంచుకొని, ఆయా స్రోతస్సులను (అవయవ సముదాయాన్ని) 13 విధాలుగా విభజించారు. (11) అవి యీక్రింది విధంగా ఉన్నాయి.

| స్రోతస్సు పేరు | మూలస్థానం | అవయవములు | కార్యములు |
| --- | --- | --- | --- |
| 1. ప్రాణవహ స్రోతస్సు | హృదయం(ఉరస్సు) మహాస్రోతస్సు (ఆమా - పక్వాశయా) | హృదయ, నాసా, కంఠ, ఉరస్, ఫుప్ఫుస, శిరస్సు (హృదయం) మస్తిష్కం, పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు, ఊర్ధ్వ ఆమాశయం. | హృత్ సంకోచ వికాసములు ఉచ్ఛ్వాస నిశ్వాసములు, క్షీవన, క్షువథు, ఇంద్రియార్థగ్రహణ, చింత్య వివేచనాది ప్రవృత్తి మానసిక కార్యములు, అన్నప్రవేశం ఉద్గారం మొదలగునవి. |
| 2. ఉదకవహ స్రోతస్సు- అంబువహ) (జలవహ) | తాలు, క్లోమ | తాలు, ఆస్య (నోరు) కంఠ, జిహ్వ, త్వక్ (చర్మం) | అంబుధారణం, మృదుత్వం. |
| 3. అన్నవహ స్రోతస్సు | వామపార్శ్వ (అన్ననాళికా)ఆమాశయం | ఆస్య(నోరు), అన్ననాళికా, ఆమాశయ, గ్రహణీ, పచ్యమానాశయ, పక్వాశయ(మరియు కోష్ఠాంగాలు) | అన్నగ్రహణం, పాచనం, సారకిట్ట విభజనం, సారశోషణం. |
| 4. రసవహ స్రోతస్సు | హృదయ (ఉరో) మూలధమనులు | హృదయ, ఆమాశయ, పచ్యమానాశయ, పక్వాశయం, చర్మం | రసవహన, రసోత్పత్తి, రసశోషణ, లసీక ధారణ. |
| 5. రక్తవహ స్రోతస్సు | యకృత్, ప్లీహ | యకృత్, ప్లీహ, మాంస (రక్తధారణాకలా)అణ్వస్థి (రక్తమేద) | రసరంజనం, రక్తధారణం. |
| 6 మాంసవహ స్రోతస్సు | మాంస, స్నాయు, త్వక్ | మాంస, స్నాయు, త్వక్ | చేష్టాకర, వేదనోత్పాదక, స్పర్శజ్ఞాన, ఔష్ణ్య ధారణ. |

| స్రోతస్సు పేరు | మూలస్థానం | అవయవములు | కార్యములు |
|---|---|---|---|
| 7. మేదోవహ స్రోతస్సు | వపావహన వృక్కములు | మేదస్సు, ఉదరకోష్ఠ, అణ్వస్థులు | స్నిగ్ధతా, మార్దవ, స్వేదస్రావణ. |
| 8. అస్థివహ స్రోతస్సు | మేదస్, జఘన | మేదస్ (మజ్జా) అస్థిసమూహ | అస్థిఉత్పత్తి, శరీరధారణ (ఋజుత్వం) దార్ఢ్యం, బలం. |
| 9. మజ్జావహ స్రోతస్సు | అస్థులు, సంధులు | అస్థులు (ఎముకలు) | మజ్జోత్పత్తి, స్నిగ్ధతా, దార్ఢ్యం, బలం. |
| 10. శుక్రవహ స్రోతస్సు (పురుషుల్లో) | వృషణములు మేఢ్రం | వృషణములు, శుక్రనాళికా, మేఢ్రం | శుక్రోత్పత్తి, విసర్జనా, స్తబ్ధతా, ఆనందం, కామం. |
| 11. ఆర్తవవహ స్రోతస్సు (స్త్రీలలో) | యోని | గర్భాశయ, ఫలకోశ, బీజవాహినులు, యోని (అపత్యమార్గం) | గర్భధారణ, శోణితోత్పత్తి, (బీజ) శోణితవహనం, ఆనందం, కామం. |
| మూత్రవహ | బస్తి, వంక్షణ | వృక్కలు, గవినీ, బస్తి, మూత్రమార్గములు | మూత్రోత్పత్తి, మూత్రవహన, మూత్రధారణ, విసర్జన. |
| 12. పురీషవహ స్రోతస్సు | పక్వాశయం గుదం | పక్వాశయం, ఉండుక (మలధరా కలా) మలాశయం, గుదం | కిట్టవిభజన, ద్రవశోషణ, పిండీకరణం, పురీషధారణ, విసర్జన. |
| 13. స్వేదవహ స్రోతస్సు | మేదస్సు, లోమకూప (చర్మమూల) | త్వక్గత మేదస్సు, రోమకూపములు. | స్వేదోత్పత్తి, స్వేదస్రావణం, క్లేద విధృతి. |

మనోవహాస్రోతస్సులు :- పైనివివరించిన 13 స్రోతస్సులలోనూ మొదటిదైన ప్రాణవహాస్రోతస్సులోనే మనస్సు, మతి, ఇంద్రియముల సమావేశము వాటి వర్ణన జరిగినది. వీటివివరణ, కార్యకలాపములు ప్రత్యేకంగా ఆర్ష గ్రంథాలలో వివరించబడ్డాయి. మూర్ఛ, ఉన్మాదం, అపస్మారం మొ॥ మానసికరోగాలను వివరించినప్పుడు సంజ్ఞావహా, మనోవహా అనే పేర్లు మనదృష్టికి రావటం గమనించదగ్గవిషయం. అదేవిధంగా పంచేంద్రియాలు, బుద్ధి, మనస్సు వీటి అధిష్ఠానం అనే వివరణకూడా మనం గమనించాలి.(12) మనస్సు అనేది ప్రత్యేకద్రవ్యము. ఇది ఇంద్రియమూలకంగానే పనిచేస్తూ ఉంటుంది. దాని నిలయము హృదయము. అది శిరస్సుతాలువు (అంగుడు) లమధ్య ఉన్నది. (13) ఈ విధమైన వర్ణనలు మనకు గోచరిస్తాయి. ప్రస్తుత కాలంలో మానసిక వ్యాధులు హెచ్చుగా తలెత్తుతూ ఉండటంమూలంగా మానసిక కార్యాలకు ప్రత్యేకంగా సంబంధించిన సంజ్ఞావహా మనోవహాస్రోతస్సులను ముఖ్యంగా పరిశీలించి జాగ్రత్తగా వాటిననుసరించటం ఆయుర్వేదశాస్త్రానికి ఎంతోముఖ్యం.

## సంజ్ఞావహాస్రోతస్సు. (14)

### మూలస్థానము - శిరోహృదయము (మస్తిష్కం)

అవయవాలు - లోపలనుండి బయటకు క్రమంగా - హృదయము (శిరోహృదయము - మెదడు) లోని మనస్సు; ఇంద్రియ (బుద్ధి) స్థాన; జ్ఞానకేంద్రాలు; సుషుమ్నాకాండ. సంజ్ఞావహాతంతువులు; సూక్ష్మేంద్రియాలు మొ॥ నవి.

అంతఃకరణములోని ఇష్టానిష్టాలు మనస్సుద్వారా ఇంద్రియబుద్ధిస్థానాలుద్వారా, సంజ్ఞావహా తంతువులద్వారా ఇంద్రియాలను చైతన్యపఱచి ఈ ఇంద్రియాలద్వారా ఆయావస్తువులను గ్రహించి, అనుభవించి తిరిగి అదేమార్గము గుండా అంతఃకరణకు అనుభవాలకు అందిస్తూంటాయి. ఈకార్యానికి సంజ్ఞ అని పేరు. ఈసంజ్ఞావహా స్రోతస్సులలో, బాహ్య, అభ్యంతర మరియూ ద్విముఖసంచారం కూడా ఉంటుంది. ఈసంజ్ఞావహా కార్యము ప్రాణవాయువుమూలాన జరుగుతుంది.

## మనోవహస్రోతస్సు. (15)

మూలస్థానం :- శిరోహృదయము (మస్తిష్కము) మఱియు సుషుమ్నాకాండ.

అవయవాలు :- లోపలినుండి బయటికి క్రమంగా మెదడు, సుషుమ్నాకాండ మఱియు, మనోవహతంతువులు (శరీరం అంతా వ్యాపించిన సూక్ష్మతంతువులు)

కార్యాలు :- బాహ్యేంద్రియాలద్వారా మనస్సుమూలంగా పొందిన సంజ్ఞలకు (బాహ్యేంద్రియ వస్తుజ్ఞానాలకు) తగిన శారీరక ప్రతిక్రియను అంతఃకరణంఉత్పన్నంచేసి, అదే మనోవహ స్రోతస్సులద్వారాశరీరంలోని ఆయా అవయవాలకు పంపించుతుంది. ఇదికూడా ప్రాణవాయువు చేతనే చేయబడుతుంది.

స్రోతస్సామ్యం - వైషమ్యం :- సర్వరోగాలు పైనివివరించిన వివిధ స్రోతస్సులలోనే (అంటే వాటికి సంబంధించిన అవయవాలలోనే) వ్యక్తమౌతూంటాయి. ఈ స్రోతస్సులు వాటి కార్యకలాపాలు సామ్యస్థితిలో ఉన్నంతకాలం శరీరంలోని ధాతువులు మఱియు వాటిచేత నిర్మింపబడ్డ అవయవాలు వాటి కార్యకలాపాలు తమతమ పరిధిలోఉండి శరారీరోగ్యాన్ని కాపాడుతాయి. (16) మిథ్యాహార విహారాదులచేత ఈపైస్రోతస్సులు వికృతిచెంది తమతమ ధాతువులలోను ఆయాఅవయవాలలోనూ వికృతిని కల్గించి వాటి సామ్యస్థితిని వైషమ్యపఱిచి అనేకరోగాలను కల్గిస్తూంటాయి. (17) కనుకనే స్రోతస్సామ్యం ఎప్పుడూ ఆరోగ్యాన్ని శ్రేయస్సునూ ఇస్తుంది. మఱియు స్రోతోవైషమ్యం ఎన్నడూ రోగకారణమే. ఈస్రోతోవైషమ్యాన్ని ఖవైగుణ్యం అనీ, స్రోతోదుష్టి అనీ అంటారు.

స్రోతోదుష్టికి కారణాలు :- మిథ్యాహారవిహారాదులే స్రోతోదుష్టికి కూడా ముఖ్యకారణాలు. త్రిదోషాల సామ్యస్థితిని వైషమ్య పఱుస్తూ, సప్తధాతువులను క్షీణింపచేసే గుణాలున్న ఆహారవిహారాదులు

స్రోతస్సులను కూడా రోగభూయిష్ఠం చేస్తాయి.[18] ప్రత్యేకంగా ఆయా స్రోతస్సుల దుష్టికి వైషమ్యానికి వాటివాటి కారణాలను చరకాచార్యులు ఈ క్రిందివిధంగా తెలిపారు. (19)

1. ప్రాణవహా స్రోతస్సు వైషమ్యపతిచే కారణాలు :-

ధాతుక్షయం, వేగధారణ, అతివ్యాయామం, అభోజనం, ఉపవాసాలు, మరియు ఇంకా ఇతరదారుణకార్యాలు, శ్వాసకాస నిధానంలో వివరించినట్లు తీవ్రధూమం, వేడిగాడ్పు, రేణువులు (ధూళి) - వీటివలన కంఠోరస్సులకు ఆఘాతం, అతిశీత, అతిరూక్ష ఆహారం, అతిసాహసం మొదలైన కారణాలు ప్రాణవహస్రోతస్సును దుష్టపరిచి రోగాలు కల్గిస్తాయి.

2. ఉదకవహా (అంబువహా) స్రోతోదుష్టి కారణాలు :-

అధికమైన ఉష్ణం, ఆమాధిక్యం, తీవ్రభయం, అతిమద్యపానం, అతి శుష్కాన్నం, అతితృష్ణ మొదలయినవి.

3 అన్నవహా స్రోతోదుష్టి కారణాలు :-

అతి భోజనం, అకాలభోజనం, అహిత భోజనం, మరియు కోష్ఠాగ్నిని వైగుణ్యపరిచే కారణాలు.

4. రసవహా స్రోతో దుష్టి కారణాలు :-

అతిగురు, అతిశీత, అతిస్నిగ్ధ ఆహారపానీయాలు, అతిమాత్ర ఆహార సేవనం మొదలయినవి.

5. రక్తవహా స్రోతోదుష్టి కారణాలు :-

విదాహం కల్గించేవి, మరియు అతిస్నిగ్ధ, అతిగురు, అత్యుష్ణ, అతి ద్రవ ఆహారాదులు, అతిగా ఎండ వేడి, మంటలకు గురియగుట,

6. మాంసవహా స్రోతో దుష్టి కారణాలు -

అతిచిక్కని గురువైన ఆహార సేవనం, పగటి నిద్ర మొదలయినవి.

7. మేదోవహా స్రోతోదుష్టి కారణములు :-

వ్యాయామము చేయకుండుట, దివాస్వప్నము, మేదః ప్రధానమైన ఆహార సేవనం, మద్య సేవనం మొదలయినవి.

8. అస్థివహ స్రోతో దుష్టి కారణాలు :-

అతితీవ్రవ్యాయామం, అతి ధాతుక్షయము, ఎముకలు ఎక్కువగా భగ్నమగుట, వాతవృద్ధిని కల్గించే ఆహార విహారాదులు మొదలయినవి.

9. మజ్జావహ స్రోతోదుష్టి కారణాలు :-

ఎముకలు నలిగిపోవుట, అతి అభిష్యంది ఆహార సేవనం మొదలగునవి.

10. శుక్రవహ స్రోతో దుష్టి కారణాలు -

అతి మైథునం, అకాల మైథునం నిగ్రహం, శస్త్ర, క్షారాగ్ని కర్మల ప్రయోగం మొదలగునవి.

11. మూత్రవహ స్రోతోదుష్టి కారణాలు :-

అతిద్రవ సేవనం, అతి మైథునం, మూత్ర వేగ నిగ్రహం, అతిధాతు క్షీణత, అభిఘాతం మొదలగునవి.

12. పురీషవహ స్రోతోదుష్టి కారణాలు:-

మలవేగావరోధం, అతిభోజనం,అభోజనం, అజీర్ణభోజనం, వేళతప్పిన భోజనం, అగ్ని దౌర్బల్యం, మరియు అతిగా కృశింపచేసే ఆహార సేవనం.

13. స్వేదవహ స్రోతోదుష్టి కారణాలు -

అతివ్యాయామం, అతిసంతాపం, శీతోష్ణస్థితుల అతిసేవనం, క్రోధ శోక భయాదులు.

సంజ్ఞావహ, మనోవహ స్రోతస్సులకు కూడా అసాత్మ్య ఇంద్రియార్థ ప్రజ్ఞాపరాధ పరిణామాలే ముఖ్యకారణాలు. వీటిలో ప్రజ్ఞాపరాధ కారణం అతిముఖ్యమైనది. ప్రజ్ఞాపరాధానికి కారణాలైన మిథ్యాహార విహారాదులు, వీటినుంచి ఉత్పన్న మయ్యే శారీరక మానసిక దోషవృద్ధి (అంటే వాతపిత్త కఫాల అతివృద్ధి) మరియు మానసిక దోషాలైన రజస్సు, తమస్సుల వైషమ్యం-ఇవే కారణాలు. 20)

స్రోతోదుష్టి - వాటి ప్రకారం -

స్రోతోదుష్టి అంటే పైన వివరించిన 13 విధాలైన స్రోతోమార్గాలు వికృతి చెంది రోగోత్పత్తిని కల్గిస్తాయి. ఈ పై వివరించిన స్రోతోమార్గాలు

వికృతి చెందడానికి తగిన ఆయాకారణాలు కూడా వివరించబడ్డాయి. పైని వివరించిన దుష్టికారణాలవలన స్రోతస్సులలో అనవరతం ప్రవహించే వాత, పిత్త, కఫాల స్వరూప స్వభావగుణ కర్మలలో మార్పుకలిగి వైష మ్యం ఏర్పడి రోగోత్పత్తిని చేస్తాయి. ఇదీ సంగ్రహంగా స్రోతోదుష్టి అంటే. ఇది నాలుగు విధాలుగా జరుగుతుంది.

1. అతిప్రవృత్తి:- సామ్యస్థితిలో శారీరక,మానసిక ఆరోగ్యాన్ని. కాపాడే స్రోతస్సులు వాటివాటి కార్యకలాపాలలో నిర్దేశించిన దానికన్న ఎక్కువ కార్యాలను నిర్వహించుట. ఉదా - ప్రాణవహ స్రోతస్సు ప్రతినిమిషానికి 16_20 ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీసికోవటం దాని స్వభావం. ఈసంఖ్యకన్న అతిగా పనిచేయుట అతి ప్రవృత్తి అవుతుంది. హృదయ వేగం పెరుగుట, ప్రేవులు_వాటి కదలిక హెచ్చుట, అవయవాలను అతిగా ఉపయోగించుట, మూత్ర పురీషాదులు అతిగా తయారయి విసర్జింపబడుట మొదలైన కార్యాలు ఆయాస్రోతస్సుల అతిప్రవృత్తిని తెల్పుతాయి.

2. సంగము (నిరోధ)ః- అడ్డుపడుట, ప్రసరణ లేక నిలుచుం డుట. ఆయా స్రోతస్సుల ఆయాకార్య కలాపాల్లో అవరోధం ఏర్పడుట లేక పూర్తిగా నిలిచిపోవుట. ఉదా:- జ్వరస్థితిలో స్వేదవహ స్రోతస్సు అవరోధింప బడుటచేత స్వేదం నిరోధింపబడి చెమట పట్టకుండుట, ఉదర రోగాలలో అన్నవహ స్రోతస్సు అవరోధింప బడుటచేత స్వేదం నిరోధింపబడి చెమట పట్టకుండుట, ఉదర రోగాలలో అన్నవహస్రోతస్సు అవరోధింప బడుటచేత ఉదరావృత కళలమధ్య జలం చేరి బంధింపబడుట, శోధరోగంలో రసవహ స్రోతస్సు బంధింపబడుటచేత చర్మంలోవాపు, మూత్రవహ స్రోతస్సు బంధిపబడుటచేత అశ్మరీవృద్ధి, మూత్రకృచ్ఛ్రము మొదలగునవి సంగ (నిరోధ) మునకు ఉదాహరణములు. ఈవిధంగా స్రోతోవరోధం లేదా సంగం అనేకవిధములయిన లక్షణా లను వ్యక్తం చేస్తుంది. అనేకమైన రోగాలన్నింటికి ఈపైని చెప్పబడిన స్రోతోఽవరోధమే అంటే ఆయా దోషాలు వాటివాటి మార్గాల్లో సరిగా ప్రవహింపక, నిలిచిపోయి, అవరోధింబబడుటయే ముఖ్యకారణం. అందు

వలననే అన్నిరోగాలు స్రోతోవరోధ జన్యములే అని శాస్త్రములలో వివరించబడినవి. (22)

3. స్రోతోగ్రంథి (సిరాగ్రంథి) :- ప్రత్యేక స్రోతస్సులు వాటివాటి ప్రత్యేక అవయవాలు తమతమ ప్రాకృత స్వరూపంలో (ఆకృతి) మార్పు చెందుటయు, కొన్ని పరిస్థితులలో ఆకృతిలో పెరుగుదల వచ్చుటయు, కొన్నింటిలో వికృతాకృతి కల్గుటయు మొ॥వి కన్పిస్తాయి. శ్లీపద, వాల్మీక గ్రంథి, అర్బుద, విద్రధి, గుల్మ ఇత్యాది రోగాలు స్రోతోగ్రంథులకు ఉదాహరణములు.

4. విమార్గ గమనము (ఉన్మార్గగమన) - విమార్గ (ఉన్మార్గ) గమనం అంటే వికృతమార్గం లేదా విరుద్ధమార్గాలలో పయనించటం, ఆయా స్రోతస్సులు వాటిలో ప్రవహించే ఆయాదోషాలు ప్రవాహగతులుమారుట. ఉదా .- వమనం అన్నవహ స్రోతస్సు యొక్క ఉన్మార్గగమనం. ఉదా వస్త్రం, మూఢగర్భం మొదలైనవి ఇందుకు ఉదాహరణములు.

ఈపైని వివరించిన, అతిప్రవృత్తి, సంగ, సిరాగ్రంథి, ఉన్మార్గ గమనములు. ఈ నాలుగు స్రోతోదుష్టికారణాలు కూడా ఒక్కొక్కటి ప్రత్యేకంగాగాని, నాల్గు కలిసిగాని, వ్యక్తం అవుతూంటాయి. రోగోత్పత్తి చేస్తూఉంటాయి కొన్ని కొన్ని రోగాలలో ఒకేవిధమైన స్రోతోదుష్టియూ, కొన్ని కొన్ని రోగాలలో రెండు లేదా అంతకన్న ఎక్కువ స్రోతోదుష్టులు కలిగి యుండవచ్చు. ప్రాదుర్భావం కావచ్చును

స్రోతోదుష్టి - రోగ సంఖ్య :- అధిక సంఖ్యలో రోగాలన్నింటికీ సంగం లేదా స్రోతోనిరోధమే కారణము. ఈ స్రోతోవరోధమే అనేక రోగాలలో ముఖ్యంగా మనకు కనిపిస్తూ ఉంటుంది. దీని తరువాత క్రమంగా అతిప్రవృత్తి స్రోతోగ్రంథి (సిరాగ్రంథి) తర్వాత విమార్గ గమనాలు అనే ఈ మూడు కారణాలు ప్రాధాన్యం వహిస్తూ ఉంటాయి

స్రోతోదుష్టి - ధాతువైషమ్యం - ఆయా స్రోతస్సుల అతి ప్రవృత్తి చేత అనేక సందర్భాలలో ధాతుక్షయమూ, మరికొన్ని సమయాలలో ధాతువృద్ధియు కూడా సంభవిస్తూ ఉంటాయి. స్రోతస్సంగం మరియు

స్రోతో గ్రంథులు ముఖ్యంగా ధాతువృద్ధినే కల్గిస్తుంటాయి. 4వ దుష్టి కారణమైన ఉన్మార్గగమనం మాత్రం స్రోతః కార్యంలో వికృతిని కల్గిస్తుంది.

స్రోతోదుష్టి - తత్ ప్రాముఖ్యం :- దేహంలో ప్రతిరోగమూ స్రోతస్సుల గుప్తి వైషమ్యం వల్లనే ఉత్పన్నమౌతుంది. అందుచేతనే స్రోతోవైగుణ్యం (వైషమ్యం) దుష్టి లేదా ఖవైగుణ్యమే రోగాల్ని కల్గించటంచే ప్రముఖస్థానం కల్గిఉంటుంది. కనుక చికిత్స ముఖ్యంగా స్రోతో వైగుణ్యము యొక్క నివారణ ప్రయత్నమే. అందువల్ల స్రోతోదుష్టి ఒక ముఖ్యవ్యాధి కారణము.

## అధ్యాయ సారాంశం.

1) ధాతువులు సూక్ష్మమైన మార్గాలున్న ధాతుపరమాణువులచేత నిర్మింపబడ్డాయి. స్రోతస్సామ్యం ఆరోగ్యం. వాటి నాల్గు విధానాలైన వైషమ్యం రోగకారణము.

2) ధాతువుల వృద్ధిక్షయాలు రెండూ కూడా రోగకారణాలే, వైషమ్యాలే. వీటికి స్రోతోదుష్టియే కారణం.

3) సామాన్యంగా నూటికి తొంబది వంతులు రోగ ప్రాదుర్భావానికి స్రోతోదుష్టియే ముఖ్యకారణము - అధికసంఖ్యలో రోగాలు సంగ (నిరోధ) ము వల్లనే వస్తాయి.

## శాస్త్రోక్త ప్రమాణ శ్లోకాలు

1. రసాసృఙ్మాంస మేదోఽస్థి మజ్జాశుక్రాణి ధాతవః।
సప్తదూష్యాః ... .. ...॥ (అ. హృ. సూ. 1/12)
స సర్వగుణవాన్ గర్భత్వమాపన్నః ప్రథమే మాసి
సంమూర్ఛితః ... ... ... అవయవశ్చేతి। (చ. సూ. 4/6)
పుష్యంతి త్వాహారరసాత్ రసరుధిరమాంస మేదోఽస్థి
మజ్జా శుక్రాణి। (చ. సూ. 2/4)

తత్ర ఆవింశతేర్వృద్ధిః, ఆత్రింశతో యౌవనం
ఆచత్వారింశతః సర్వధాత్వింద్రియ బలవీర్య
సంపూర్ణతా, అత ఊర్ధ్వ మీషత్ పరిహాని
ర్యావత్ సప్తతేరితి । (సు సూ 35/29)

2. యతో ద్వివిధో రసః స్థాయీ పోషకశ్చేతి ।
తేన తత్ర ధాతుపోషక పోష్య రసాంశయోః భే
ద వివక్షయా భేద ఉక్తః .. ... ...
ఏవం కృత్వా సప్తధాతుకం శరీరం ... .. !
(చక్రపాణి చ. చి 15/16)

3 ... ... స్థాయీ రసరుధిరమాంసాదీన్ రస
రుధిరాది సమానాంశేన తర్పయతి ।
(చక్రపాణి. సు. సూ. 14/10)
సప్తభిర్దేహ ధాతారో ధాతవో ద్వివిధం పునః ।
యథా స్వమగ్నిభిః పాకం యాంతి కిట్టప్రసాదవత్ ॥
... ... .. ...
ప్రసాదకిట్టే ధాతూనాం పాకాదేవం ద్విదర్థతః ।
పరస్పరోప సంస్తబ్ధా ధాతుస్నేహ పరంపరా ॥
(చ, చి. 15/15-16)

తత్రాస్థని స్థితో వాయుః పిత్తంతు స్వేదరక్తయోః ।
శ్లేష్మా శేషేషు తేష్వేషాం ఆశ్రయాశ్రయిణాం మిథః ॥
(అ. హృ. సూ. 11/16)

4. 1 చరకశారీరం 7/15-19

2 సుశ్రుత సూత్రస్థానం 15/4;
అష్టాంగ సంగ్రహసూత్ర స్థానం 16
అష్టాంగ సంగ్రహ సూత్రస్థానం 11/4

5. పోషకారణానాం ధాతూనాం క్షయ వృద్ధిమాత్ర
రూపవికృతిం నిరాకృత్య దోషాభి సంబంధరూపాం
దుష్టిం గ్రాహయతి । (చక్రపాణి. చ. వి. 5/3)

6. ఏతేన అనులోమక్షయో దర్శితః, కారణభూత
రసధాతు క్షయే సతి రక్తాదీనాం రసకార్యాణాం
పోషకాభావేన క్షీయమాణత్వాత్ ।
(మధుకోశ .. ... రాజయక్ష్మ నిదానం)

7. శరీరావయవాస్తు ఖలు పరమాణు భేదేన
అపరిసంఖ్యేయా భవంతి । (చ. శా. 7/17)

యథాస్వేనోష్మణాం పాకం శారీరే యాంతి ధాతవః ॥
స్రోతసా చ యథాస్వేన ధాతుఃపుష్యతి ధాతుతః ॥
(చ. చి. 8/37)

స్రోతాంసి ఖలు పరిణామాపద్యమానానాం ధాతూనాం
అభివాహీని భవంత్యయనార్థేన । (చ. వి. 5/3)

స్రోతాంసి సిరాః ... ... పంథానః మార్గాః ..
నామాని భవంతి ॥ (చ. వి. 5/3)

అపిచైకే స్రోతసామేవ సముదయం పురుష మిచ్ఛంతి,
సర్వగతత్వాత్ సర్వసరత్వాచ్చ ... ... । (చ. వి. 5/4)

8. తేషాం తు ఖలు స్రోతసాం
యథాస్థూలం కతిచిత్ప్రకారాన్ ... ప్రాణోదకాన్న
రసరుధిర మాంస ... ... వహా నితి । (చ. వి. 5/7)

స్వధాతు సమవర్ణాని వృత్త స్థూలా న్యణూని చ ।
స్రోతాంసి దీర్ఘా ణ్యాకృత్యా ప్రతాన సదృశాని చ ॥
(చ. వి. 5/25)

9. శ్రవణ నయన వదన ఘ్రాణ గుద మేఢ్రాణి నవశో
స్రోతాంసి నరాణాం బహిర్ముఖాని ... . . ।
(సు. శా. 5/10)

10. నచ అన్య స్రోతసాం అన్న ధాతుపుష్టిః సంభవతి ।
సర్వపోష్యాణాం భిన్నదేశత్వాత్ ।
స్రోతః కారణికోఽపి ధాతూనాం ప్రాయో రక్తాదీనాం
ఉత్తర ధాతు పోషక భాగ పరిణామో భవతి,
తచ్చాపి ఉత్తర ధాతుపోషణం నాంతరేణ స్రోతో
భవతి ॥ (చక్రపాణి చ. వి. 5/3)

11. తత్ర ప్రాణవహానాం, స్రోతసాం హృదయం మూలం,
మహాస్రోతశ్చ ... . . ఉదకవహానాం తాలుమూలం
క్లోమశ్చ ... . . . .
. . ... . . ...
. . . స్వేదవహానాం మేదోమూలం
లోమకూపాశ్చ ... ॥ (చ. వి. 5/8)

12. సంఖ్యా (సంజ్ఞా) వహాసు నాడీషు
పిహితా స్వనిలాదిభిః ।
. . మూర్ఛా ... । (సు. ఉత్తరతంత్ర 46/4)
స్రోతాంస్యధిష్ఠాయ మనోవహాని ...
. ఉన్మాద . . ... । (చ. చి. 9/5)

13. ఇహ ఖలు పంచేంద్రియాణి పంచేంద్రియద్రవ్యాణి
పంచేంద్రియాధిష్ఠానాని, పంచేంద్రియార్థా,
పంచేంద్రియ బుద్ధయో భవంతి ॥ (చ. సు 8/3)

ప్రాణాః ప్రాణభృతా యత్ర శ్రితా సర్వేంద్రియాణి చ ।
యదుత్తమాంగ మంగానాం శిరస్తభి ధీయతే ॥ (చ. సూ. 18/12)

శిరస్తాల్వంతరగతం సర్వేంద్రియ పరం మనః ।
తత్రస్థతగ్గి విషయా నింద్రియాణాం రసాదికమ్ ॥
(భేల సంహితా) (ఉన్మాద చికిత్సా)

14. సంజ్ఞా ఇతి జ్ఞానం .. ... తేన చక్షుర్బుధ్యాదా
వాత్మా మనసా సంయుజ్యతే మన ఇందిృయేణ ఇంద్రియ
మర్థేన ॥ (చక్రపాణి. చ. సూ. 8/12)

15. తద్వదతీంద్రియాణాం పునః సత్త్వాదీనాం చేతనావత్
శరీరం అయనభూత మధిష్ఠాన భూతంచ।

16. తదే తత్ స్రోతసాం (చ. వి. 5/7)
ప్రకృతి భూతత్వాత్
సవికార ఉపసృజ్యతే శరీరం ..। (చ. వి. 5/7)

17. తేషాం ప్రకోపాత్ స్థానస్థా శ్చైవ మార్గగాశ్చ
శరీరధాతవః ప్రకోప మాపద్యంతే॥ (చ.వి. 5/6)

18 ఆహారశ్చ విహారశ్చ యస్స్యాద్దోషగుణైః సమః।
ధాతుభిర్వి గుణశ్చాపి స్రోతసాం సప్రదోషకః ॥ [చ.వి. 5/12]

19. చరకవిమానస్థానం [5/.0-22)

20. తత్రమనసో మనోబుద్ధేశ్చ త ఏవ సమా నాతి
హీన మిథ్యాయోగాః ప్రకృతి వికృతి హేతవో భవంతి ॥
(చ. సూ. 8/16)

21. అతిప్రవృత్తిః సంగోవా శిరాణా గ్రంథయోఽపివా।
విమార్గగమనం చాపి స్రోతసాం దుష్టిలక్షణమ్ ॥ [చ.వి. 5/24)

22. యత్రసంగః ఖవైగుణ్యాః వ్యాధి స్తత్రోపజాయతే॥ [సు.సూ.24/10]



# 6 వ అధ్యాయము

## క్రియాకాల విమర్శ

మిథ్యాహారవిహారాదులు మొదలైన కారణాల వల్లనే శరీరంలోని త్రిదోషాలూ మొదట వైషమ్యం చెంది, అవి ఆశ్రయించిన ఆయా ధాతువులను కూడా వైషమ్యం పొందించి రోగోత్పత్తి చేస్తాయి; అని క్రిందటి అధ్యాయంలో తెలిసికొన్నాం. పైకారణాల వల్ల దోషాలు వైషమ్యం చెందిన క్షణం ప్రారంభించి, అనేక వికృతులు పరంపరగా, క్రమక్రమంగా శరీరంలో రోగప్రాదుర్భావ పర్యంతం శరీరంలో జరుగుతూనే ఉంటాయి. సూక్ష్మంగా ప్రారంభించి క్రమంగా పెరుగుతూవచ్చే ఈ వైషమ్యాలన్నింటినీ రోగం అనే పిలువ వచ్చును. ఈవిధంగా స్వల్ప ప్రమాణంలో గూడిన దోషవికృతి లగాయతు సంపూర్ణంగా రోగప్రాదుర్భావం అయ్యేదాకా జరిగే వికృతుల పరంపరను (క్రియా) యథాక్రమంగా (కాలం) నిరూపించడాన్ని క్రియాకాలం అంటారు. అంటే దోషదూష్య (ధాతు) అగ్ని, స్రోతస్సు మొదలగు వాటిలో జరిగే వికృతి-విషమత్వముల క్రమమైనజ్ఞానం ఈజ్ఞానం రోగనిర్ణయానికి నివారణకు కూడా అత్యంతావశ్యకం.

వివిధక్రియాకాలాలు - శరీరంలో దోషసామ్యము (నిశ్చల ఆరోగ్యస్థితి) అతిసూక్ష్మమూ, అతి సున్నితమూ అవటం మూలాన ఈసామ్యస్థితి క్షణక్షణం మార్పుచెందుతూనే ఉంటుంది. ఈమార్పుకు ఋతువులలో మార్పు కొంత, కొంత ఆహార విహారాదులు ముఖ్య కారణాలు. ఋతుప్రభావంచేత వాతావరణంలోని మార్పులద్వారాకల్గిన దోషవైషమ్యం తెలిసికోవటాన్ని 'ఋతుక్రియాకాలం' అనియూ, మిథ్యాహార విహారాదుల సేవన వల్ల కలిగిన దోషవైషమ్యం తెలిసికోవటం "వ్యాధిక్రియాకాలం 'అనియూ పిలుస్తారు. శరీరంలోని ప్రతి ఒక్కదోషం కూడా ఋతుకాలాలలోని మార్పులను అనుసరించి సంచయ,ప్రకోప, ప్రశమనాలు అనే మూడు అవస్థలను క్రమంగా ఆయా ఋతువులలో పొందుతుంది. (1) ఈ

యాయవస్థలు ప్రతి సంవత్సరం నిర్దిష్ట రీతిలో ఆయాకాలాలలో శరీరసామ్య స్థితిలో కొన్నిలక్షణాలు కనబరుస్తూన్నప్పటికీ ఋతుచర్య-దినచర్య-ఆహార నియమాలచేత, ఈలక్షణాలను అరికట్టవచ్చును. అధికాహార విహార సేవ నంవల్ల సంభవించే దోషవైషమ్యం బలిష్ఠంగాను, హెచ్చుశక్తిమంత మైనదిగాను ఉండటం మూలంగా, అది క్రమేణ వృద్ధి చెందుతూ, అతి దుఃఖాన్ని కల్గించే బలిష్ఠమైన వికృతి లక్షణాలను కల్గిస్తుంది. ఇటువంటి లక్షణ పరంపర (రోగక్రియాకాలం) సంచయ, ప్రకోప,ప్రసర, స్థాన, సంశ్రయ, వ్యక్తి భేద అనే 6 విధాలుగా స్థాయులుగా విభజింపబడింది. క్రియాకాలం పేరుతో వివరించ బడినది కూడా. (2)

## I ప్రథమ క్రియాకాలం :-

సంచయం :- సంచయం అంటే స్వస్థానంలో వృద్ధిచెందుట, కూడుట అని అర్థము. మిథ్యాహార విహారాదులచేత త్రిదోషాలు తమతమ ప్రాకృతప్రమాణ గుణకర్మలలో కొంచెంగానో, ఎక్కువగానో వృద్ధిచెందుతాయి. ఈరకమైన వృద్ధి ముఖ్యంగా ఆయాదోషాల మూలస్థానంలో (ప్రధాన - స్వస్థాన) ప్రారంభమవుతుంది. వాతవృద్ధి - పక్వాశయాల లోనూ, పిత్తవృద్ధి అధో ఆమాశయంలోనూ, కఫవృద్ధి ఉరస్సులోనూ జరుగుతుంది. (3) ఈవృద్ధి బలహీనంగా ఉన్నట్లైతే, ఏర్పడిన లక్షణాలు.

(1) వాతసంచయ లక్షణాలు :-

(ఎ) స్తబ్ధకోష్ఠత :- కడుపు బరువువుచలనం లేక గట్టిగా నుండుట,
(బి) పూర్ణకోష్ఠత :- ఎప్పుడూ ఏదో నింపినట్లుగా నుండుట.

[2] పిత్తసంచయ లక్షణాలు :-

పీతావభాసత (పచ్చగా శరీరం కన్పించుట) మందోష్ణత (దేహోష్ణం కొంచెం ఎక్కువగా నుండుట).

(3) కఫసంచయ లక్షణాలు :-

గౌరవం [శరీర]-అవయవాల బరువు, ఆలస్యం (బద్ధకం-ఏపని చేయడానికి ఇచ్ఛలేక పోవుట]

పైని వివరించిన లక్షణాలు కన్పించిన వెంటనే శరీరం తన్ను తాను రక్షించుకొనే ప్రయత్నం చేస్తుంది. [రోగానికి గురికాకుండా] అంత వరకూ ఏమిథ్యాహార విహారాదుల వల్ల దోషసంచయం జరిగిందో, ఆయా ఆహారవిహారాలపై ద్వేషం, జగుప్స, పైవాటికి విరుద్ధగుణాలున్న ఆహార విహారాలపై ఇష్టము [విపరీత గుణేచ్ఛ] మున్నగునవి కల్గుతాయి [5] ఇది ఒక స్వాభావిక రక్షణ వ్యవస్థ. ఈవిధంగా శరీరంలోకన్పించే ఈలక్షణాలను [సంజ్ఞ - ఇంగిత - శాంతు] ఉపేక్షింపక తగినజాగ్రత్త తీసికొన్నట్లయితే, నియమంగా పథ్యపానాదులు చేసినట్లయితే సంచయం చెందిన దోషాలు ఇకముందుకు పోకుండా సామ్యస్థితికి వచ్చి ఆరోగ్యరక్షణ చేస్తాయి. కాని అట్లుగాక పైసంచయస్థితి యొక్క లక్షణ సముదాయాన్ని ఉపేక్షించి మరల మిథ్యాహార విహారాదులను సేవించినట్లైతే, దోష వృద్ధి మరికొంచెం తీవ్రమై ప్రకోపం అనే రెండవస్థాయిని పొందుతాయి. సంచయకాలంలోనే దోషవృద్ధిని అరికట్టినట్లయితే ముందు ముందు వృద్ధి పొంది రోగోత్పత్తి అనే ప్రశ్నయే ఉదయించదు. మరియు శరీరం సామ్యస్థితిలో ఉండే అవకాశం ఉంటుంది [6]

## 2 ద్వితీయ క్రియాకాలం -

సంచయ సమయంలో తమ తమ స్వస్థానంలో (మూలస్థానం) వృద్ధి చెందిన దోషాలు అనియమిత ఆహార సేవనంవల్ల మరియు వృద్ధిచెంది, ప్రకోపించి, వాటివాటి ఇతర (గౌణ) అప్రధానస్థానాలకు కూడా పయనించి (ఉన్మార్గ గమన) ఈ క్రింది లక్షణాలను వ్యక్తం చేస్తాయి. (7)

(1) వాతప్రకోప లక్షణాలు :-

1) కోష్ఠతోదము -కడుపు భాగంలో అసౌఖ్యం- నొప్పి - బాధ.

2) సంచరణము :- కడుపు ఉదరభాగాలలో ఏదో నిండుగా బరువుగా నుండుట.

(2) పిత్త ప్రకోపలక్షణాలు :-

1) ఆమ్లిక :- పుల్లని వమనములు

2) పిపాస (దాహం, గొంతులో మంట

3) పరిదాహము (కడుపు_గొంతు - అన్ననాళంలో మంట - బాధ

(3) కఫ ప్రకోప లక్షణాలు :-

1) అన్నద్వేషము

2) హృదయోత్క్లేశము (గుండెలలో బరువు - బాధ - ఆయాసం.

పైని వివరించిన ఈ లక్షణాలు మొదటి క్రియాకాలమైన సంచయంలో కంటె కొంత బలిష్ఠమై తీవ్రమైనప్పటికీ, శరీరానికి తీవ్రమైన బాధను, భరింపరాని ఆవేదననూ మాత్రం కల్గించవు. ఈ పై లక్షణములు గలవారు ఈలక్షణాలు కన్పించిన వెంటనే తమ ఆరోగ్యంలోని మార్పును గమనించి, జాగ్రత్తగ, నియమంగా ఆహారవిహారాదులను సేవిస్తూ యోగ్యులయిన వైద్యులనుంచి ఔషధములను పొందినట్లయితే వృద్ధిపొందిన దోషాలను తీవ్రతరం కాకుండా మరల వాటివాటిస్వస్థానానికి మరల్చి ఆరోగ్యాన్ని కాపాడుకొన్నవా రవుతారు. కాని యీ విధంగా ఆచరించే వారు మిక్కిలి అరుదు.

## 3 తృతీయ క్రియాకాలం - ప్రసర :-

ప్రసరం అంటే వృద్ధిచెందిన దోషాలు తమ స్థానం నుంచి మరియొక ప్రబలమైన గౌణస్థానానికి ప్రవహించడం, వెళ్లడం. ప్రకోపావస్థలో వృద్ధిచెంది పైన వివరించిన లక్షణాలు వ్యక్తంచేసే దోషాలకు తగిన సమయంలో చికిత్స కావించినట్లైతే, దోషవృద్ధి తీవ్రతరమయి వాటి వాటి స్థానాలలోనివృద్ధిచెందిన దోషాలు ఆయా స్థానాల నుండి పెరిగి మిగిలిన దోషస్థానాలను కూడా ప్రవహించి ఆక్రమించుకొంటాయి.

త్రిదోషాలు మూడింటిలోను వాతదోషం ఒక్కటే స్వతంత్రసంచారం చేస్తుంది. మిగిలిన రెండింటికి స్వతంత్రంగా చలించే శక్తి లేదు. ఈ కఫపిత్తాలు ఒక స్థానం నుండి మరొక్క స్థానానికి కదలాలంటే వాతదోషం యొక్క సహాయసహకారాలు ఉంటేనే సాధ్యం. ప్రసరావస్థలో మిథ్యాహార విహారాల ద్వారా వృద్ధిచెందిన కఫపిత్తాలను వాతదోషం తన సహజగతిశీలతచేత వివిధ స్థలాలకు తీసికొని వెడుతుంది.

(9) నిండిన జలాశయంలోని నీరు తీవ్రతరవాతం చేత కదలి కల్లోలంచెంది పెద్దఅలలతో కట్టను దాటి, పొంగి పారలునట్లుగానే, కఫపిత్తదోషాలు కూడా, తమ తమ స్థానాలను మీరి వేరొక్క స్థానానికి త్రోయబడ తాయి (8) ఈ విధంగా [విమార్గ] వేఱే మార్గాలను పొందిన వికృతి దోషాలు ఈ క్రింది లక్షణాలను కల్గిస్తాయి.

వాత ప్రసర లక్షణాలు -

1) విమార్గ గమన [విరుద్ధ మార్గంలో ప్రసరణ]
2) ఆటోప [ప్రేవులలో శబ్దం, అరుపులు]

పిత్త ప్రసర లక్షణాలు :-

1) ఓషము [మంట మండినట్లు బాధ - దాహం]
2) చోషము [కడుపులో, గుండెల్లో మంటవంటి బాధ]
3) పరిదాహము - శరీరంలో ప్రతిచోట మంట

కఫప్రసర లక్షణాలు :-

1) అరోచక, అవిపాక, అంగసాద, ఛర్ది. (10)

ఇవి చాలామందిలో కన్పించే కొన్ని ముఖ్యలక్షణాలు. ఇవే గాక దోషాలు సంచరించే అన్ని స్థలాల్లోను ఇంకా అనేక లక్షణాలు వ్యక్తమా తుంటాయి. ముందు వివరించిన రెండు క్రియాకాలములకంటె ఈ మూడవ క్రియాకాలం బలిష్ఠమైనది. ఈ స్థితిలో శరీరం తన నిత్యకర్మలను చేయ డంతో కష్టం అనుభవిస్తుంది. అసౌఖ్యం కలుగుతుంది. నిత్యవ్యవహారానికి సాధ్యపడదు. ఈ అసౌఖ్యంచేత ఈ సమయంలో సులభంగా ఈ స్థితి నివా రణ కాదని తెలిసికొంటారు. నిర్దిష్టంగా ఈ అస్వాస్థ్యం నివారించుకొను టకు వైద్యుణ్ణి ఆశ్రయిస్తారు. [11] ఈ విధంగా తమ వద్దకు వచ్చిన వ్యక్తి శరీరంలో వచ్చిన మార్పులను వైద్యుడు తెలిసికోవటానికి ప్రయ త్నించాలి. వాటిలో కొన్ని వృత్తాంతం, రోగి పూర్వపు టలవాట్లు వగై రాలవల్ల తెలుస్తాయి. మరికొన్నిటిని వైద్యుడు శరీర పరీక్షచేసి తెలిసికో వాలి అనుభవం గడించి పరీక్ష చేయడంలో సిద్ధహస్తుడైన వైద్యునికి ఇవి సులభంగా తెలుస్తాయి.

## పరిభ్రమించే దోషలక్షణాలు - శాఖాధిగమనం

వ్యాధియొక్క క్రియాకాలం యొక్క పూర్వభాగమైన సంచయ, ప్రకోప, ప్రసరం - ఈ అవస్థలలో దూషింపబడ్డ దోషాలు రోగోత్పత్తి చేసేందుకు వృద్ధిని చెంది, మహాకోష్ఠంనుండి శరీరంలోని అన్ని భాగాలకు రస ధాతువుతో గూడి సంచారం చేస్తూ అచట అచట తమలక్షణాలను వ్యక్తం చేస్తూంటాయి. వికృతి-వృద్ధి చెందిన దోషాలు మహాకోష్ఠంనుండి వివిధ శాఖలకు ప్రయాణం చేస్తాయి. అందుచే మొదటి మూడు క్రియాకాలాలలో వ్యక్తమయ్యే వికృత దోషలక్షణాలను పరిధావమాన (పరిభ్రమించే) దోష లక్షణాలు అని పిలుస్తారు. (12)

మొదటి మూడు క్రియాకాలాలలోని వికృతి వృద్ధి చెందిన దోషాలు శరీరంలోని ధాతువులకు వైషమ్యం చెందించేటంతటి శక్తిమంతమైనవికావు. ధాతువులలో సహజంగా ఉండే బలం ఉన్నంతవరకు వైషమ్యం చెందిన దోషాలు వాటికి వికృ శల్గించలేవు. ధాతు వికృతి కలుగనంత వరకూ ఈ మూడు క్రియాకాలాలలోనూ, దోషవికృతే ముఖ్యంగా కనబడుతుంది. తమ ఆరోగ్యవిషయంలో శ్రద్ధచూపే వ్యక్తులు ఈమూడు క్రియాకార్యాల లోపలే లక్షణాలను గుర్తించి, అనుభవయోగ్యుడైన వైద్యుని చేత చికిత్స పొందినట్లయితే పైవిక్రమించిన దోష వికృతి నివారణ అవడం కాకండా ముందు ముందు శరీరానికి రోగనిరోధకశక్తికూడా పెంపొందుతుంది.

## పరిధావమాన (ప్రవహించే) దోషజన్య లక్షణాలు

1 (13) వాతవృద్ధిలక్షణాలు :- కార్శ్యవాత (శరీరం చిక్కిపోవుటా) కార్ష్ణి (ఎఱుపు కలిసిన నలుపు) అరుణ (లేత ఎఱుపు) శ్యావ (నలుపు) మొదలైన వర్ణములుగా శరీరం మారుట లేదా శరీరం అసలు రంగు నశించి పై రంగులు కల్గుట.

2 గుణవికృతి - కార్శ్య (సన్నబడుట) ఖరత్వ (బిరుసెక్కుట) పరుషత్వ (కరినత చెందుట) సుషిరత్వ (ఖాళీయగుట) శోష (ఎండిపోవుట) రౌక్ష్య (మృదుత్వం లేకపోవుట)

3 కార్యవికృతి :-

1] శూల [నొప్పిపుట్టుట]

2] రుక్ [తీవ్రమైన నొప్పి] భేద [కోయునట్లుండు నొప్పి]

3] తోద [నొక్కునట్లుండు తీవ్రమైన నొప్పి]

వ్యథ [అసుఖం, బాధ]
ఆర్తి [విడిచి విడిచి వచ్చునొప్పి]
భంగ [విఱుగగొట్టినట్లుండు నొప్పి]
స్పందన [నొక్కుచు విడుచుచున్నట్లుండు నొప్పి]
దంశన [పండ్లు కటకట లాడుచున్నట్లుండునొప్పి]
విమథన [చిలికి నట్లుండు నొప్పి]
ఉద్వేష్టన [పిండినట్లుండు నొప్పి]
తాడన [కఱ్ఱతో కొట్టినట్లుండు నొప్పి]
పీడన [పీడించినట్లుండు నొప్పి]
ఛేదన [చీల్చినట్లు నొప్పి]
వేష్టన [త్రాటితో బిగించినట్లు నొప్పి]
సుప్తి [స్పర్శజ్ఞాన నాశం]
అంగహర్ష, రోమహర్ష [పులకింతలు]

4] చేష్టా కృతి - గతివికృతి
[స్రంస - సంధులు జారుట,
త్యాగ - విస్మారము చెందుట
ధ్రంశ - నాశమగుట
స్తంభ - నిలిచిపోవుట - చేష్టానాశం.
భంగ - పొడిగా విఱుగుట
చేష్టా - శరీరం అంతా కదలుట
చాల - శరీరంలో కొంత భాగం కదలుట,
సంకోచ - ముడుచుకొని, పోవుట
కంప - వణకు, స్ఫుటని - విరుగుట

క్షోభ - బాధ
విక్షేప - ఎల్లప్పుడు కాలు సేతులు అదరుట,
విశ్లేష - కాలు సేతులు బలహీనమగుట
ఉద్ఘట్టన - ఒకటికొకటి తగులుట
నమన - క్రిందకు వంగుట
ఉన్నమన - పైకిలేచుట [ఉబ్బుట]
హుండన - వంకర పోవుట
పంగుత్వ - కుంటితనము
కుబ్జత్వ - గూనితనము
పరిపతన - కాలు సేతులు సరిగా నిలువలేకుండుట
పర్వస్తంభ = చేష్టాహీనత
పర్వసంకోచ = సంధులు కృశించుట
పర్వభేద = సంధులలో నొప్పి
అస్థిభేద = ఎముకలలో నొప్పి
కంఠోధ్వంస = కంఠంలో బాధ
(మాటాడుటకు గుటక వేయుటకు నొప్పి)
వాకపారుష్య = బొంగురుతనము
కర్ణనాద = చెవిలోశబ్దాలు
దృష్టి భ్రమోహా = వస్తువులు సరిగా కనబడక పోవుట,
ఆస్యవైరస్య = నోటిలో కషాయరసం - రుచి
జృంభ = ఎక్కువగా ఆవులింతలు
విషమపరిణతి = విషమంగా ఆహారం పచనమగుట
ఆధ్మాన = ఆటోప [శబ్దంతో కడుపుబ్బరం]
సంగ = మూత్రపురీషాలు వెలువడక బాధ
తృషా = దాహం [ఎక్కువగా నీరు త్రాగుట]
ఉష్ణకామిత్వం = వేడియందిష్టము
గర్భవికార = వికారరూప భ్రూణోత్పత్తి [మూఢగర్భ మొ॥ వి]

గర్భం చాలకాలం ఉండుట, గర్భనాశ, శుక్రనాశ, రజోనాశ, నిద్రానాశ, బలనాశ, సౌఖ్యహాని, ఇంద్రియనాశ, ఆయురుపహాని [మరణం] మొదలగునవి చేష్టాకృతిగతి వికృతులు.

మానసిక వికృతి - మోహం, భయం, శోకం, దైన్యం, ప్రలాపం, అసంబద్ధంగా మాట్లాడుట, మనశ్చాంచల్యం, తెలివితప్పుట మొదలగునవి మానసిక వికృతులు.

వాతక్షయ లక్షణాలు :- [14]

మందచేష్టత = పనులు అతినెమ్మదిగా చేయుట
అల్పవాక్త్వం = కొంచెంగా మాట్లాడుట
అప్రహర్ష = దేనియందూ సంతోషం లేకపోవుట
మూఢసంజ్ఞతా = తెలివితక్కువతనం, వెఱ్ఱితనం, అరుచి
అంగసాద = శరీరదౌర్బల్యం,
అగ్నివైషమ్యం = కోష్ఠాగ్నివికృతి

ప్రసేకము = నోరు ముక్కులనుండి అతిస్రావం మొదలగునవి వాత క్షయ లక్షణాలు.

పిత్తవృద్ధి లక్షణాలు :- [15]

[1] వర్ణవికృతి - పీతావభాసత [నేత్ర, మూత్ర, పురీష, నఖ, త్వక్కులలో పసుపురంగు కన్పించుట, మఱియు నీలం, ఎఱుపు, పసుపు మొదలగు రంగులు కన్పించుట.

రాగ = ఎఱ్ఱనిరంగు ఉత్పత్తిని చెందుట.

]2] కార్యవికృతి - ఉష్ణవృద్ధి (ఉష్ణము అధికమగుట]
దాహం = మంట, కండూ = దురద, మంట
శోథ = పొక్కులు వేయుట
క్లేద = ద్రవవృద్ధి, స్రావ = ద్రవం స్రవించుట
పాక = పుండు పడుట,

తృష = దాహం వేయుట
పూతిగంధి = దుర్గంధ, భ్రమ = తల తిరుగుట
మూర్ఛా = తెలివితప్పుట,
సంతాప = అతి వేడి చేత కష్టే బాధ, బలహాని, అతినిద్ర
ఆస్యవైరస్య = కటు, అమ్ల, లవణరసాల అనుభూతి
శీతకామిత్వ = చల్లగా ఉండాలని కాంక్ష.

[3] మానసిక వికృతి -

తమఃప్రవేశ = వస్తువులను గూర్చిన జ్ఞానం లేకుండుట, తృప్తి లేక పోవుట,
అరతి = దేని చేతనూ సుఖం లేకుండుట
మద = మంగించియుండుట, ఇంద్రియ దౌర్బల్యం.

పిత్తక్షయ లక్షణాలు :- [16]

మందాగ్ని = అగ్ని నాశము
అరోచక = రుచినాశము
అవిపాక = ఆహారం సరిగా జీర్ణం కాకుండుట
మందోష్ణత = వేడితక్కువగుట
నిష్ప్రభత = కన్ను, ముఖం, చర్మం - వీటికాంతి నాశం
అంగపారుష్య = శరీరావయవాలు మృదుత్వం లేకుండుట
స్తంభ = చలనం లేకుండుట, కంప, గౌరవ [భార], కన్నులు గోళ్లు తెల్లబడుట, శరీరం చల్లబడుట మొదలగునవి.

కఫవృద్ధి లక్షణాలు :- [17]

[1] వర్ణవికృతి :- శుక్లత, శైత్యం, తెల్లబడుట.

[2] కార్యవికృతి -

శైత్య = చల్లబడుట, కండూ = దురద
అతిస్నేహ = ఎక్కువ జిడ్డుగానుండుట
క్లేద = ద్రవోత్పత్తి శోథ = వాపువాచుట
ఉత్సేధ = ఉబ్బుట,
స్థైర్య = చలనం లేకపోవుట

బాధ = బాధించుట, చేష్టానాశనం, గౌరవం, కాఠిన్యం, బలహాని, మలాధికం, ప్రసేకాధిక్యం [నోరు, ముక్కులనుండి స్రావం అధిక మగుట]

అపక్తి = సరిగా జీర్ణం కాకుండుట

వైరస్య = మధురలవణ రసముల అనుభవం

సంధివిశేష = సంధులదౌర్బల్యం, పట్టు పట్టుట

తంద్రా = ఆవులింతలు నిద్రాధిక్యం

మానసిక వికృతి :-

తృప్తి = ఏదీకోరని స్థితి - ఆశించక పోవుట

ఆలస్యం = ఉత్సాహం లేకుండుట

కఫక్షయ లక్షణాలు :- [18]

రూక్షత్వం = ఆమాశయం శ్లేష్మాశయం ఖాళీగా ఉండుట

పరిశోష = ఎండిపోవుట

అంతర్దాహ = లోపలిమంట

తృష్ణా = నీరుత్రాగాలనే కోరిక

ధూమాయన = శరీరంనుండి పొగవచ్చునట్లు అనుభవం

సంధిశైథిల్యం = అంగమర్ద [ఒళ్లు నొప్పులు] -రూక్షవృద్ధిచేత బాధ

వేపన = కొంచెంగా కాలు సేతులు వణకుట

భ్రమ = తలతిరుగుట, దౌర్బల్యం.

## ఓజస్సు - ప్రాకృతం - వైకృతం

రసాదిసప్తధాతువు లన్నింటికీ - అన్నింటిలోనూ సారరూపమైన ఒకపదార్థం ఉంటుంది. దానినే ఓజస్సుఅంటారు. ఇది గురు, శీత, స్నిగ్ధ మృదు, శ్లక్ష్ణ, బహుళ, మధుర, పిచ్ఛిల, గుణాలున్న అప్య ప్రధానకర్మము. దేహంలోని అణువణువునా ఇది వ్యాపించియుంది. దీనిచేతనే శరీరానికి బలం, స్నిగ్ధత్వం, సహనం, కార్యనిర్వహణ శక్తి, ఇంద్రియకార్య నిర్వహణశక్తి, ఉత్తమస్వరం, శరీరవర్ణం ఒనగూడుతాయి. ఈ ఓజస్సు ఒక

అతిప్రధానమైన ప్రాణాయతనము. ఈ ఓజస్సు రెండు విధాలుగా శరీరంలో వ్యాపించి యుంటుంది. [19]

1] పర [శ్రేష్ఠ] ఓజస్సు

ఈపర తేజస్సు స్థానము హృదయము. కేవలం ఎనిమిది బిందువుల ప్రమాణం కలది. హృదయంలోని సాధక పిత్తానికి సహాయకంగా ఉంటూ ప్రాణధారణ, ప్రాణరక్షణ, చేస్తూ ఉంటుంది. దీని నాశనంచేత ప్రాణమే నాశనం చెందుతుంది. [20]

2] అపర ఓజస్సు :-

దీని ప్రమాణం అర్ధాంజలి. రసధాతువుతో కూడి శరీరంఅంతటా సంచరిస్తూ ఉంటుంది. ధాతువుల నాశ్రయించుకొని ఉంటుంది. కఫధాతువుతో సమానమైన గుణాలు కల్గిఉండటం మూలంగా దీనిని శ్లైష్మిక ఓజస్సు అనికూడా పిలుస్తారు. ధాతువుల బలిష్ఠతకు ఇదే ఆధారం. 'బలమే ఓజస్సు' అను నానుడి ఈఓజస్సు ప్రాముఖ్యమును ఎత్తి చూపుతుంది. (21)

ఈ ఓజస్సు ప్రతి ధాతువులోను తన సహజ పరిమాణాన్ని సహజ గుణాన్ని పొందియున్నపుడు [ఆశ్రయించి యున్నపుడు] ఆయాధాతువులు తమ తమ పనులను నెరవేర్చుకొనే శక్తిని, తమను తాము రక్షించుకొనే శక్తిని కల్గియుంటాయి. దీనినే ధాతుబలం అనీ, శరీరబలం అనీ పిలుస్తారు. ధాతువుల ఈ ఆత్మరక్షణనే [రోగనిరోధకశక్తిని) వ్యాధిక్షమత్వం అంటారు. శరీరంలో రోగాలు జనించకుండా రక్షించేది. ఒకవేళ రోగాలు ఉత్పన్నమయినా కూడా, రోగబలాల్ని క్షీణింపజేసే శరీరశక్తిని పెంచేది (వ్యాధిబల నిరోధకత్వం) అనే ఈ రెండు ముఖ్యమైన కార్యాలు వ్యాధిక్షమత్వం అనే పదంలో అర్థమవుతాయి. [22]

మానవులందరి శరీరాలలోను, ఈ ఓజస్సు ఉన్నప్పటికీ - వారి వారి దేహప్రకృతుల ననుసరించి ఈ ఓజస్సు ప్రమాణ గుణకర్మ (శక్తుల)

లలోనూ, వ్యాధినిరోధకశక్తిలోను, తేడా (తరతమ భావం) కల్గియుంటుంది. సమిశ్రిత ప్రకృతిమనుష్యులలో ఈ ఓజస్సు ఉత్తమంగాను, సంసర్గ (రెండు కలసిన) మనుష్యులదేహాలలో ఇది మధ్యమంగాను, ఏక దోష ప్రకృతి మనుష్యులలో ఇది అత్యల్పంగానూ ఉంటుంది. అదే విధంగా ఏకదోషజ ప్రకృతులలోగూడ కఫప్రకృతి మనుష్యులలో ఇది ఉత్తమంగానూ, (ఓజస్సు అధికంగా), పిత్తప్రకృతి మనుష్యులలో అల్పంగాను ఉంటుంది. మరియు పైచెప్పిన విధాలేగాక, అహితాహార విహారాదులు సేవించేవారిలోనూ, అల్పమైన, గుణహీనమైన విషమాహారాన్ని సేవించే వారిలోనూ, అతిస్థూలంగా, అతికృశులుగా ఉండేవారిలోనూ, దుర్బలమైన మానసికశక్తిగలవారిలోనూ, ఈ ఓజశ్శక్తి క్షీణించియుంటుంది. మరియు ఆయుర్వేద శాస్త్రరీత్యా అష్టవిధనింద్య ప్రకృతులలో అంటే అతిదీర్ఘ, అతిహ్రస్వ, అతిస్థూల, అతికృశ, అలోమ, అతిలోమ - గలవారిలోగూడ ఈ వ్యాధి క్షమత్వం సరియైన నిష్పత్తిలో ఉండదు. [23]

## ఓజోదుష్టి కారణాలు - విధాలు :-

అతిగా శ్రమించుట, చింత, శోకం, భయం, క్రోధం మొదలైన మానసిక వికారాలు, విషపదార్థ సేవన [కాఫీ, టీ, పొగాకు, మద్యం మొ॥వి] ఉపవాసాలు ఎక్కువగా చేయుట, భూతాభిషంగ [క్రిమి కీటకాదులు, రాక్షస, భూత, గంధర్వాది గ్రహబాధలు] మర్మస్థానాలకు దెబ్బతగులుట, ధాతుక్షయం, మరియు కొన్ని విశిష్టమైన రోగాలవల్ల కూడా ఓజస్సు క్షయాన్ని పొందుతుంది. [24]

## త్రివిధ ఓజోదుష్టి

1] ఓజోవిస్రంస :- ఓజస్సుయొక్క సహజప్రమాణం గుణాలలో క్షీణతను చూపే మొదటి అవస్థ ఇది. ఇందులో సంధులలో క్షీణత, స్థానభ్రంశము, ఒళ్లు తీవ్రమైన నొప్పులు, దోషములు అతిగా ప్రకోపించుట, శారీరక, మానసిక క్రియలలో తడబాటు, క్షీణత, [క్రియారోధ] కల్గుతాయి. (25)

2] ఓజో విపత్తి - ఇది ఓజో దుష్టి రెండవ కారణము ఈ అవస్థా సమయంలో స్తబ్ధ గాత్రత [గొంతు పూడుకుపోయినట్లు నొప్పిగానుండుట - మాటరాకుండుట] అవయవాలు చలనరహితమగుట, గురుగాత్రత, శరీర మంతా బరువెక్కుట, శరీరం రంగు మారుట, గ్లాని, తంద్ర, మత్తు, నిద్ర మఱియు వాతశోథ [శరీరం వాపు] మొ॥ లక్షణాలు కనబతాయి. (26)

3] ఓజఃక్షయం - ఇది అతితీవ్రమైన మూడవ అవస్థ. ఇందులో తెలివి తప్పుట [మూర్ఛ], మోహం, ప్రలాపం, అతిదౌర్బల్యం, రక్తమాంస క్షీణత, మరణభయం, అతి ఆలోచన, శోకం, దుఃఖం, ఇంద్రియాలు తమ తమ వ్యాపారాలు చేయడం మానుట, శరీరకాంతి, ముఖకాంతి నశించుట కొసకు మరణం మొ॥ లక్షణాలు ఉత్పన్న మవుతాయి [27]

## ఓజఃక్షయం - దాని ఫలితము

ధాతువుల బలానికి, శక్తికి వాటివాటి సహజకార్య నిర్వహణకూ, ఓజస్సే కారణమగుటచే, ఓజస్సు క్షీణించినట్లయితే ధాతుదౌర్బల్యం కలిగి, దానివల్ల వాటివాటి క్రియాశక్తి, వ్యాధిక్షమత్వం ఈ రెండూ కూడా క్రమంగా క్షీణిస్తాయి. శరీరంలో [ధాతువులలో] తగినంతబలం ఉన్నంతే వఱకూ కుపితవికృత దోషాలు ధాతువులను కుపిత పఱచజాలవు. [28]

కాని ఈ ధాతుబలం తగ్గినవెంటనే వికృతదోషాలు వాటిపై తమ ప్రభావాన్ని చూపించి, వాటిని కూడా వికృత పరుస్తాయి. దీనికే దోష దూష్య[ధాతు] సమ్మూర్ఛన అని పేరు. ఈ దోషదూష్య సమ్మూర్ఛనమే రోగోత్పత్తికి ప్రథమ సోపానము.

మానవుని ఆరోగ్యస్థితిలో కూడా ఈ దోషాలు, ధాతువులూ కలిసి ఉండేంతవరకూ తమ తమ వ్యాపారాలను కొనసాగిస్తూ ఉంటాయి. ఈ దోష ధాతువులు సహజసామ్యస్థితిలో కలిసియుండి దేహ మానసిక ఆరోగ్యాల్ని కాపాడుతూన్నట్లయితే, ఈ సహయోగాన్ని దోష ధాతు సంయోగం అనీ, ప్రకోపించి వికృతిచెందిన దోషధాతువుల సంయోగాన్ని దోషదూష్య సమ్మూర్ఛన అనీ వ్యవహరిస్తారు. [29]

రోగోత్పత్తికి ముఖ్యకారణమైన ఈ దోషదూష్య సమ్మూర్ఛనే మొదటి మూడు క్రియాకాలాలైన సంచయ, ప్రకోప, ప్రసరములలో మనకు కనబడదు. ఈ మూడు అవస్థలలోనూ దోషాలు స్వస్థానాలలో వృద్ధి చెందుట ప్రకోపించి పైస్థానాంతరకూ ప్రయాణించడం వఱకు మాత్రమే మనకు కనబడుతుంది. కానీ స్థాన సంశ్రయం అనే నాల్గవక్రియాకాలంలో రోగసోపానమైన దోషదూష్య సమ్మూర్ఛనం మనకు స్పష్టంగా వివరించ బడుతుంది. విశదంగా కనబడుతుంది.

## నాల్గవక్రియాకాలం :- స్థానసంశ్రయం

స్థాన సంశ్రయం అంటే ఏదేని ఒక ప్రదేశంలో కూడిఉండటం, ఆశ్రయించి ఉండటం అని అర్థము. వృద్ధిచెందిన దోషాలన్నీ రసధాతువుతో కూడి శరీరమంతటా సంచరిస్తూ ఉంటాయి. ఈ విధంగా సంచయ, ప్రకోప, ప్రసరములనే మూడు క్రియాకాలములలోనూ ఈ దోషాలు సంచరిస్తూనే ఉంటాయి. కాని స్రోతోదుష్టిని కల్గించే ఆహార విహారాదుల వలన, ఓజస్సు క్షీణించుట మొదలగు కారణాలవలన దోషములతోపాటు ధాతువులు కూడ దూషింప బడతాయి. ఈ కారణంచేతనే కోష్ఠాగ్ని కూడా వికృతి చెంది తన సహజక్రియలో లోపంచెంది ఆమరసాన్ని ఉత్పత్తి చేస్తుంది. ఈ ఆమరసం ధాతువుతో కలిసి శరీరమంతటా ప్రసరించేటప్పుడు ధాతుపరమాణువులలోనికి చొచ్చుకొని పోలేక, బయటనే మిగిలిపోతుంది. ఈ ధాతువులో ముందుగానే ఆశ్రయించియున్న వికృత (వృద్ధ) దోషాలు ఈ స్థానంలో అధికంగా ఆశ్రయించుకొంటాయి. దీనినే స్థానసంశ్రయం అని పిలుస్తారు. స్థానసంశ్రయం అనే ఈ అవస్థ శరీరంలో జరగాలంటే, ఆమరసోత్పత్తి, స్రోతోదుష్టి (సంగ) ఓజఃక్షీణత అనే ఈ మూడు లక్షణాలూ కూడి యుండాలి. ఏ స్థానంలో ఈపై స్థానదోషసంశ్రయం జరిగిందో, అదే ముందు ముందు రోగోత్పత్తికి స్థానం అవుతుంది. (30) ఈ విధంగా ఆమాశయంలో వృద్ధిచెందిన దోషాలు రసవహాస్రోతస్సులద్వారా (రసాయన అని పిలువబడతాయి.) శాఖలకు (రక్తమాంసాది ధాతువులకు-చర్మము) ప్రవహిస్తాయి ఈ సంచారానికి దోషముల శాఖాభిగమనం

అని పేరు ఈవిధంగా స్థానసంశ్రయం చెందిన దోషాలు కొన్నిలక్షణాలను పుట్టిస్తాయి. ఈ లక్షణ సముదాయానికి 'పూర్వరూపం' అని పేరు. అంటే ముందు జనించే పరిపూర్ణరోగోత్పత్తికి ముందే కన్పించే సామాన్య లక్షణాలు. ఈ ప్రపంచ అవస్థయే, నాల్గవ క్రియాకాలం అనే స్థాన సంశ్రయం. (31)

పూర్వరూపస్వరూపం స్థానసంశ్రయకాలంలో దోషదూష్య సమ్మూర్ఛన కూడ ప్రారంభావస్థలో ఉండటం పూర్వరూపం. ఆ సందర్భంలో జనించే లక్షణాలు సామాన్యంగా కొద్దిబలంగా తక్కువలక్షణాలు కలిగి స్పష్టంగా ఉండవు. కాని కొన్ని సమయాల్లో బలిష్ఠమైన కారణాలవల్ల కల్పించే లక్షణాలు అధికసంఖ్యలో బలిష్ఠంగా వ్యక్తం కావచ్చు. ఈ విధంగా కన్పించే లక్షణాలను బట్టి వాటితీవ్రతను బట్టి ముందుముందు జనించే వ్యాధుల తీవ్రతను కూడా ఊహింపవచ్చును. (32)

## పూర్వరూపం రెండు విధాలు :-

పూర్వరూపం సామాన్యం, విశిష్టం అని రెండు విధాలు.

1) సామాన్య పూర్వరూపము - దోషదూష్య సంమూర్ఛనానంతరం ప్రధానంగా దోషాలవల్లనే ఉత్పన్నమయ్యే ఈ లక్షణాలు ముందు కలిగే రోగాన్ని, రోగలక్షణాలను (రూపాన్ని) తలపింపచేస్తాయి. ఈ విధంగా సామాన్యమైన పూర్వరూపం గల రోగాల సంఖ్యయే అధికం. ఈ పూర్వరూపావస్థలో దోషదూష్యసమ్మూర్ఛన అల్పంగా జరిగిన కారణం చేత, శరీరంలో సతతం పెక్కు మార్పులు జరుగుతూఉండటం చేతనూ, ముందు ముందు జనించే రోగం ఏదోషప్రాధాన్యం కలది అనేది నిర్ధారించటం కష్టతరమైనపని అయితే ఉత్పన్నమయ్యే రోగాన్ని మాత్రం ముందుగా చెప్పవచ్చు. [33]

2) విశిష్టపూర్వరూపం - ముందుజనించే రోగలక్షణాలే అల్పపరిమాణంలో స్పష్టంగా తెలియడమే విశిష్టపూర్వరూపం. ఈ వ్యక్తమయ్యే లక్ష

ణాలు ముందు జనించే రోగలక్షణాలే అల్పపరిమాణంలో స్పష్టంగా తెలియడమే విశిష్టపూర్వరూపం. ఈ వ్యక్తమయ్యే లక్షణాలు ముందు జనించే రోగంలో వ్యక్తమవడం గాకుండ బలిష్ఠంగా కూడా ఉంటాయి. [34] కాని ఈ విధంగా పూర్వరూపంతో కన్పించే రోగాలే తక్కువ. పూర్వరూపావస్థలోనే సమ్యక్ రోగజ్ఞానంతో యశఃకాముడైన కుశల వైద్యుడు చికిత్సను చేసినట్లయితే రోగం ఇకముందుకు వెళ్లకుండా ఆరోగ్యం చేకూరవచ్చు ఒకవేళ రోగం జనించినా కూడా సరియైన చికిత్సవల్ల బలహీనమై జనించి సుసాధ్యమౌతుంది. అవయవాలలో (రక్తాదులు-చర్మం) జనించే వికృతులు మళ్ళీ సామ్యస్థితిని పొందవచ్చును. అందుచేత నే పూర్వరూపావస్థలోనే గమనించి సరియైన చికిత్స చేసినట్లయితే, ముందు ముందు రోగమే జనించదు.

## పంచమ క్రియాకాలం - వ్యక్తి

నాల్గవ క్రియాకాలంలో యోగ్యమైన చికిత్సను పొందకపోయినచో, మరియు దోషవృద్ధిని కల్గించే ఆహార విహార సేవనంవల్ల దోషదూష్య సమ్మూర్ఛన తీవ్రతనొంది దుఃఖతరరోగలక్షణాలు కల్గిస్తుంది. ఈ విధంగా తీవ్రతపొందిన దోషదూష్యసమ్మూర్ఛన కల్గించే వ్యక్తమయ్యే రోగలక్షణా లను 'వ్యక్త' అనియూ ఉత్పన్నమయ్యే రోగాన్ని 'రూపం' అనియూ పిలు స్తారు. రూపం అనే పదానికి సంస్థాన, వ్యంజన, లింగ, లక్షణ, చిహ్న, ఆకృతి అనే పదాలను పర్యాయంగా గ్రంథాలలో ఉపయోగించారు (35) ఈ రోగావస్థలో కల్గించే లక్షణాలన్ని అతిస్పష్టంగా ఉండడం చేత రోగనిర్ణయం చేయుటం ఈదశలో కష్టమైన పని గాదు. రోగలక్ష ణాలతోపాటు వాటి మూలకారణాలను కూడా నిర్ణయించడం సాధ్య పడుతుంది. ఈ రోగావస్థలో వ్యక్తమయ్యే లక్షణాలు రెండు రకాలు.

(1) సామాన్యలక్షణాలు.- వృద్ధిచెందిన దోషాలవల్ల వ్యక్తమయ్యే (అన్నిరోగాలలోనూ కన్పించే) లక్షణాలు

(2) ప్రత్యాత్మలక్షణాలు:- కుపిత దోషాలవల్ల నేకాకుండా వికృతి చెందిన దూష్య, స్రోతస్సు మొ॥ వాటిచే ఉత్పన్నమయ్యే ప్రతిరోగానికి ప్రత్యేకమైన ఆయారోగంలోని విశిష్ట కారణాలు.

సామాన్యంగా ఆగంతుక, స్థానిక అను రెండు దోషాల సమ్మూర్ఛన ప్రతిరోగోత్పత్తికి ఆవశ్యకం. మిథ్యాహార విహారాదుల వల్ల వృద్ధి చెంది, రసధాతువుతో కూడి, శరీర మంతటా సంచరిస్తూ, తమ తమ రోగాలను (రోగలక్షణాలను) ఎల్లెడల వ్యక్తంచేసే దోషాలకు ఆగంతుక దోషాలని పేరు స్థాన సంశ్రయం అనే నాల్గవక్రియాకాలంలో జనించే దోషదూష్య సమ్మూర్ఛనలో ఏ దోషం ప్రధానంగా రోగముఖ్య లక్షణాలను వ్యక్తం చేస్తుందో దానికి స్థానిక దోషం అని పేరు. స్థానికం అంటే మూలకారణం అని అర్థం. దీనినే ఆరంభదోషం అని కూడా పిలువవచ్చును.

'రూప' అవస్థలోఅంటే వ్యక్తి అనే పంచమక్రియాకాలంలో వ్యక్తమయ్యే సామాన్యలక్షణాలను ఆగంతుకదోషమూ, విశిష్ట [ప్రత్యాత్మ] లక్షణాలను స్థానికదోషమూ ఉత్పత్తిచేస్తాయి. ఈ రెండుదోషాలనూ వాటిద్వారా ఉత్పన్నమయ్యే లక్షణాలను పోల్చిచూస్తే స్థానికదోషంవల్ల కలిగే లక్షణాలసంఖ్య, బలము, వ్యాప్తి, ఆగంతుకదోషాలవల్ల కలిగే లక్షణాలు, బలం, సంఖ్యకన్న తక్కువగా ఉంటుంది.

కనుక ప్రధానమైన ఆగంతుకదోషం ఆధారంగా రోగప్రభేదాలను కల్పించి ఆగంతుకదోషం పేరు మీదుగానే పూర్వరూపంచేతనే రోగాన్ని పిలవడం, స్థానికదోషాలను ఏప్రకారం సూచింపకుండుట, శాస్త్రసంప్రదాయము. ఉదా .- వాతజ్వరం - ఇచట వాతదోషం ఆగంతుకము. జ్వరరోగంలో ముఖ్యలక్షణమైన ఊష్మాధిక్యము మూలకారణమైన స్థానిక దోషం పిత్తం. కాని పిత్తంయొక్క ప్రస్తావన ఇందు కనబడదు. శాస్త్రజ్ఞుడయిన వైద్యుడు స్వయముగాను సులభంగాను ఊహించుకుంటాడనే ఉద్దేశంతో ప్రాచీనాచార్యులు ఈ విషయంలో మౌనం పాటించారు. ఈ ఆగంతుక, స్థానిక దోషాలు ప్రతిరోగంలోను వేరుగాఉండాలనే నియమం లేదు.కొన్నిరోగాలలో ఇవిరెండూ ఒకటే అయియుండవచ్చును. ఉదా.- పిత్తాధిక్యంగల ఆహారవిహారాదులవల్లవచ్చే పిత్తాతిసారంలో పిత్తమే ఆగం

తుకము, మరియు స్థానికదోషంకూడా అవుతుంది. రోగానికి చికిత్స చేసే తరుణంలోకూడా బలిష్ఠమైన కారణాలచేత ప్రకోపింపబడి శరీరమంతటా బలిష్ఠమైన లక్షణాలను వ్యక్తంచేసి బాధను కల్గించే ఆగంతుకదోషానికే ముఖ్యంగా చికిత్సచేయాలి. [36] కొన్నిసమయాలలో స్థానికదోషాలకు చికిత్సచేయవలసిన అవసరమే ఉండదు. బలిష్ఠమైన ఆగంతుకదోషాలు శమించగానే స్థానికదోషాలుకూడా శమిస్తాయి. కాని కొన్నిరోగాలలో రెండిటికీ తగిన చికిత్సచేయాలి. కాని ముందుగా సర్వరోగాలలోనూ ఆగంతుకదోషానికే చికిత్సచేయాలి అన్నది దాటకూడని నియమమేకాదు. శరీరాన్ని ఎక్కువగా ఏ దోషం ఏయే లక్షణాలు ఎక్కువగా బాధ కల్గిస్తూ ఉంటాయో వాటికిముందుగా చికిత్సచేయాలి.

## వ్యాధిప్రభేదం - కల్పన (వివరణ)

ఆగంతుక దోషంయొక్క ఆధారంగా ప్రతిరోగాన్ని ఏడువిధాలుగా విభజింపవచ్చును. వాతపిత్తకఫాలు ప్రత్యేకంగానూ, రెండేసి దోషాలు కలిసి ఉంటేనూ ద్వంద్వజ అనియు మూడు దోషాలు కలిసి రోగాన్ని కల్గిస్తే దానిని సన్నిపాతజ అనీ త్రిదోషజ అనీ ప్రతిరోగాన్ని విభజించవీలుంది. ఆయా విభాగంలో ఆయాదోషాల (విడిగాగాని - రెండుగాని - మూడుగాని) వాటివాటి లక్షణాలు అధికంగా వ్యక్తం అవుతాయి

సంయోగ ద్వైవిధ్యం - ఒకటికన్నా ఎక్కువదోషాల లేదా ద్రవ్యముల సంయోగం రెండు విధాలుగా ఉంటుంది.

1) ప్రకృతి సమసమవాయి - అంటే సమాన గుణధర్మాలున్న కారణాలు సంయోగించినపుడు జనించే లక్షణాలు కూడా, కారణానికి సమాన గుణధర్మాలున్నవి అవుతాయి. ఉదా - తెల్లని దారాలచేత తయారయ్యే బట్టకూడా తెల్లగానే ఉంటుంది. వాతకఫదోషాలు రెండింటికీ సమాన గుణాలు కొన్ని ఉన్నాయి. కఫదోషం, రసధాతువుల మధ్య ఎక్కువ పోలికలున్నాయి. ఇటువంటి సమానగుణాలున్న ద్రవ్యముల సంయోగం చేత ఏర్పడే పరిణామాన్ని (లక్షణాలను) కారణంచేత సులభంగా సమన్వయ పఱచవచ్చును. (37)

2) వికృతి - విషమసమవాయి :- సంయోగం చెందే వస్తువులుగాని, దోషాలుగాని, కారణాలుగాని, భిన్నభిన్న వ్యతిరేకగుణాలు కల్గినచో వాటిచే ఉత్పన్నమయ్యే లక్షణాలను కారణాలకు సమన్వయం చేయడానికి వీలులేని క్రొత్త లక్షణాలు ఉండవచ్చు. ఉదా:- హారిద్ర (పసుపు,)సున్నం కలిపితే ఈ రెంటి రంగూలేని ఎరుపురంగు ఉత్పన్న మవుతుంది. కఫపిత్తాలు రెండూ విశిష్టవ్యతిరేక గుణాలున్న ద్రవ్యాలు. వీటి సంయోగంచేత ఏర్పడే లక్షణాలు ఈ రెంటికీ సంబంధించని లక్షణాలు కావచ్చును. [38]

పై వివరించిన ప్రకృతి సమ సమవాయి జన్యలక్షణాలు వైద్యుడు సులభంగా ఊహింపవచ్చును. అందుచేతనే అవి గల రోగాలలో ద్వంద్వజ, సన్నిపాతజ అనే భేదాల వివరణను పూర్వాచార్యులు తమగ్రంథాలలో తెలుపలేదు. అంతమాత్రంచేత ఆ వ్యాధులలో ద్వంద్వజ, సన్నిపాతజ రోగాలు పుట్టనే పుట్టవని తలంపకూడదు. వికృతివిషమ సమవాయి లక్షణాలం సులభంగా ఊహించరానివి. అందుచే అవిగల రోగాలలో ద్వంద్వజ, సన్నిపాతజ అనే ప్రభేదాల వివరణ మనకు గ్రంథాలలో లభిస్తుంది రూపావస్థలో ఉత్పన్న మయ్యే లక్షణాలను ఈ క్రింది విధంగా వివరించుట చికిత్సాపద్ధతికి ఎంతో మేలు కూరుస్తుంది.

1) దోషలక్షణాలు - వృద్ధిచెందిన దోషాలు ధాతువుల నాశ్రయించుకొని ఉత్పత్తిచేసే లక్షణాలు, ధాత్వాశ్రిత రోగలక్షణాలం. [39]

2) దూష్యలక్షణాలు - ధాతు - ఉపధాతు మరియు, మలముల వృద్ధి మరియు క్షయాల లక్షణాలు, వీటిలోనే స్రోతోదుష్టి లక్షణాలను కూడా వివరించవచ్చును.

3) అగ్ని మరియు ఆమలక్షణాలు -

కోష్ఠాగ్ని మరియు ధాత్వగ్నుల వైషమ్యంచేత ఉత్పన్నమయ్యే లక్షణాలు.

వీటినన్నింటినీ వైద్యుడు రోగాన్ని పరీక్షించి తెలిసికొని దానికితగిన ప్రభావకరమైన చికిత్సను ఆలోచించాలి. ఈ క్రింద కొన్ని ముఖ్యలక్షణాలను పొందు పరచడమైనది.

# ధాత్వాశ్రిత దోష లక్షణాలు

| ఆశ్రయ | వాత | పిత్త | కఫ |
| --- | --- | --- | --- |
| 1. త్వక్స్థ రసాశ్రిత | స్ఫుటన, రూక్షిత, సుప్తి, కార్శ్య, కార్ష్ణ్య, రాగ, తోద | విస్ఫోట మసూరికా | స్తంభ, శ్వేతావభాసత. |
| 2. రక్తస్థ | తీవ్రరుజ, తాప, రాగ, వివర్ణ, స్వాప, అరూషిక, కృశత, భ్రమ, విష్టంభ- అరుచి | దాహ వివర్ణ | పాండుత |
| 3. మాంసస్థ | గ్రంథిఉత్పత్తి, అతితోదభ్రమ, అంగగౌరవ, అతిరుజా, ఖరత్వ, స్తంభ | మాంస, శోథ | అర్బుద అవచ, అతి శైత్య, అంగగౌరవ. |
| 4. మేదస్థ | ,, | సదాహగ్రంథి, తృష్ణా, స్వేదప్రవృత్తి, అతివమన అతిదాహ | స్థౌల్య, ప్రమేహ |
| 5. అస్థిస్థ | సక్థి, సంధి, అస్థిశూల, బలక్షయం | | అతి స్తబ్ధతా |
| 6. మజ్జాస్థ | అస్థిసౌషిర్య, అస్వప్న, స్తబ్ధతా, రుజా | నఖ, నేత్ర హారితవర్ణ పీతావభాసత, | నఖనేత్రాది శుక్లవర్ణ, |
| 7. శుక్రస్థ | శుక్ర శీఘ్రస్ఖలన, అస్ఖలన, గర్భవికారాలు | శుక్ర పూతి గంధశుక్ర | శుక్రసంగసంచయ |
| 8. సిరాస్థ | సిరాశూల, ఆధ్మాన కుంచన | — | — |
| 9. స్నాయుస్థ, ధమనిస్థ, సంధిగత కోష్ఠస్థ | గృధ్రసీ, కుబ్జతా, ఆక్షేప, శోఫ, కృచ్ఛ్ర రుజా ప్రసారణ | — | సంధిశూన్యత |
| 10. ఏ) ఆమాశయస్థ | తృష్ణా, వమన, శ్వాసకోశ, విసూచి, ఉద్గార కంఠోపరోధ, ఊర్ధ్వనాభిరోగ | మధ్యతృష్ణా యక్ష్మ | ఉదరవృద్ధి, అరోచన, అవిపాక, కఫవ్యాధి. |
| బి) పక్వాశయస్థ | — | — | — |

## దూష్యముల వృద్ధిక్షయ లక్షణాలు. (40)

(1) ఎ. రసధాతువృద్ధి :- హృదయోత్క్లేద (హృల్లాస) ప్రసేక మరియు కఫవృద్ధి లక్షణాలైన ప్రసేక, వైరస్య, అరోచక హృల్లాస, స్రోతోరోధ, స్వాదుద్వేష్య, అంగమర్ద ఇత్యాదులు.

బి రసధాతుక్షయ - హృత్పీడా, హృద్ఘట్టన, హృద్ద్రవ, హృత్కంప, హృత్శూన్యత, తృష్ణా, రౌక్ష్య, శ్రమ, శోష, గ్లాని, శబ్దాసహిష్ణుత.

(2) ఎ రక్తవృద్ధి - రక్తాంగ, రక్తాక్షి, సిరాపూర్ణత, విసర్ప, ప్లీహా, విద్రధి, అసృగ్దర, కుష్ఠ, రక్తపిత్త, వాతరక్త, గుల్మ కామిల, వ్యంగ సమ్మోహ, రక్తత్వక్, సరక్తమూత్ర, నేత్ర, అగ్నినాశ, అక్షి, గుద, మేఢ్రపాక, తమఃప్రవేశ.

బి రక్తక్షయ - త్వక్పారుష్య, అమ్లశిశిరకాంక్ష, సిరాశైథిల్య, రూక్షత, త్వక్స్ఫుటన, మ్లానత్వక్.

(3) ఎ. మాంసవృద్ధి - గురుగాత్రత్వ, అర్బుదగ్రంథి ఉత్పత్తి, స్ఫిక్, గండ, ఓష్ఠ, ఉపస్థ, ఊరు, బాహు, జంఘాదివృద్ధి, [అధిమాంస]

బి. మాంసక్షయ.- స్ఫిక్, గండ, ఓష్ఠ, ఉపస్థ, ఊరు, బాహు, జంఘాది శుష్కత, క్షీణత, రౌక్ష్య, గాత్రతోద, గాత్రసాద, ధమనీ శైథిల్యం ఇంద్రియ దౌర్బల్యం, సంధిశూల, ఆయాసం.

[4] ఎ. మేదోవృద్ధి స్నిగ్ధాంగత, ఉదరపార్శ్వవృద్ధి, స్థౌల్యకాస, శ్వాస, దుర్గంధ, గండ, అర్బుద, గ్రంథి, అతిశ్రమ, అల్పచేష్ట, స్ఫిక్ స్తన ఉదరములు వ్రేలాడుట.

### ప్రమేహ లక్షణములు.

బి. మేదఃక్షయ - ప్లీహావృద్ధి, సంధిశూన్యత, రౌక్ష్య, మాంసము నంగు కోరిక, కటీశ్వాప, కృశాంగత, ఉదరతనుత్వ.

(5) ఎ. అస్థివృద్ధి :- అధ్యస్థి, అధిదంత ఉత్పత్తి.

బి. అస్థిక్షయ :- అస్థిశూల, దంత, నఖభంగ, రౌక్ష్య, కేశ, లోమ, శ్మశ్రుపాతశ్రమ, అస్థిబద్ధమాంసేచ్ఛ.

(6) ఎ. మజ్జావృద్ధి - సర్వాంగగౌరవ, నేత్రగౌరవ, స్థూలపర్వ, అరూంషిక, (వ్రణ)

బి. మజ్జాక్షయ :- అల్పశుక్రత, సర్వభేద, అస్థిశూన్యత, [సౌషిర్య] నిస్తోద, భ్రమ, తిమిరదర్శన, అస్థిదౌర్బల్య, లఘుత్వ, వాతరోగోత్పత్తి.

[7] ఎ. శుక్రవృద్ధి :- శుక్రాశ్మర, అతిశుక్రత, అతిస్త్రీకామత.

బి. శుక్రక్షయ :- మేఢ్రవృషణపీడ, చిరప్రసేక, క్లైబ్య, సురక్త ప్రసేక, దౌర్బల్య, ముఖశోష, శ్రమ, పాండుత్వ.

[8] ఎ. ఆర్తవవృద్ధి :- అతిస్రావ, అంగమర్ద, దౌర్గంధ్య.

బి. ఆర్తవక్షయ - ఉచితకాల అదర్శన, అల్పదర్శన, యోనివేదన.

9) ఎ. స్తన్యవృద్ధి - స్తనపీనత, తోద, ముహుర్ముహుః ప్రవృత్తి.

బి స్తన్యక్షయ :- స్తనమ్లానత, స్తన్యాల్పత, అనుత్పత్తి

10) ఎ. పురీషవృద్ధి - ఆటోప, కుక్షిశూల, ఆధ్మానము, ఉదర గౌరవము.

బి. పురీషక్షయ - హృదయ పార్శ్వ ప్రదేశపీడ, సశబ్ద ఊర్ధ్వ గమన, ఆటోపము.

11) ఎ. మూత్రవృద్ధి :- మూత్రప్రమాణవృద్ధి, ముహుర్ముహుః ప్రవృత్తి.

బి. మూత్రక్షయ - అల్పమూత్రత, బస్తితోదము, కృచ్ఛ్రప్రవృత్తి. వైవర్ణ్యము, పిపాస, ముఖశోషము.

12) ఎ స్వేదవృద్ధి - అతిస్వేద ప్రవృత్తి, కండువు, దౌర్గంధ్యము.

బి. స్వేదక్షయ - త్వక్ శోషము, స్ఫుటనము, స్తబ్ధరోమము, కూపత్వ, స్పర్శ వైగుణ్యము, స్వేదనాశము, రోమచ్యుతి ఇత్యాది.

### లక్షణాల బలాబలాలు -

అన్నిరోగాలలోనూ వాటివాటి రోగలక్షణాలు ఒకే విధముగా ఉండజాలవు. కొన్నిరోగాలలోని లక్షణాలు అల్పబలంతోనూ, అల్ప

సంఖ్యలోనూ, మరియు కొన్ని రోగాలలో అధిక సంఖ్యలోనూ, అతిబలిష్ఠం గానూ, ఉంటాయి. ఈవిధంగా ఉండటానికి కొన్ని కారణాలు ఉంటాయి. (40 ఎ)

1) హేతు :- రోగోత్పత్తికి కారణభూతమైన మిథ్యాహార విహారాదులు మొదలైనకారణాలు అల్పసంఖ్యలోనూ దుర్బలంగానూ ఉన్నట్లయితే కన్పించే రోగలక్షణాలు కూడ అల్పసంఖ్యలోనూ బలహీనంగాను ఉంటాయి. కాని పైకారణాలు బలిష్ఠమై అధికంగాఉన్నట్లయితే కన్పించే రోగలక్షణాలు కూడ బలిష్ఠంగానూ, అధికసంఖ్యలోనూ ఉంటాయి.

2) దేహప్రకృతి - మనుష్యుని శరీరప్రకృతి ఏ దోషంతో కూడినదో ఆ దోషంవలన రోగోత్పత్తి జరిగినట్లైతే ఆ వ్యాధిలక్షణాలు తీవ్రతరంగా ఉంటాయి. (తుల్యదోష - ప్రకృతి)

కాని అవే రోగకారణాలైన దోషాలు శరీర ప్రకృతికి వ్యతిరేక గుణధర్మాలు కలిగి ఉన్నట్లయితే ఆ రోగలక్షణాలు అంతతీవ్రంగా ఉండవు. దుర్బలంగానే ఉంటాయి. (అతుల్యదోష ప్రకృతి).

3) శరీరబలము :- శరీరాన్ని పోషించిన రసాదిసప్త ధాతువులు మరియు వాటిసారరూపమైన ఓజస్సు తమ సహజ ప్రమాణగుణ కర్మలలో సరిగా ఉంటే శరీరం బలిష్ఠంగా ఉంటుంది ఈ ఓజస్సు శక్తిమంతమై శరీరారోగ్యాన్ని కాపాడుతూన్నంత సేపు, ఏవిధమైన రోగలక్షణాలు జనించినా అవి అంత తీవ్రంగాఉండవు. బలహీనంగానే ఉంటాయి కాని ధాతువుల బలం, ఓజశ్శక్తి క్షీణించిన శరీరంలో దౌర్బల్యం చోటుచేసి కొని, ఆ శరీరంలో వచ్చేరోగాలు అతిబలిష్ఠంగాఉండి శరీరానికి చెఱుపు చేస్తాయి.

4) వయస్సు - అసంపూర్ణ ధాతువులుగల బాల్యావస్థలోనూ,క్షీణించిన ధాతువులుగల వార్ధక్యంలోనూ, శరీరం అతిదుర్బలమై రోగాలకు సులభంగా ఆకరమౌతుంది. అందుచేత ఏ రోగం శరీరంలో ప్రవేశించినప్పటికీ బాల్య వార్ధక్యాలలో ఆ రోగతీవ్రత ఎక్కువగాను మధ్యవయస్సులో దుర్బలంగాను ఉంటుంది. దోషప్రాధాన్యం కూడా ఆయా వయస్సులలో చాల ప్రధానపాత్ర వహిస్తుంది. బాల్యంలో స్వాభావికంగా కఫాధిక్యము

వలన కఫజన్య లక్షణాలుగల వ్యాధులు వచ్చినప్పుడు వాటి లక్షణాలు, వాటి పరిణామం చాల తీవ్రతరంగా ఉంటుంది. ఇదేవిధంగా మధ్యవయస్సులో పిత్తం, వార్ధక్యంలో వాతం ప్రధానం అవటం మూలంగా ఆయా సమాన దోషాలవల్ల జనించే వ్యాధుల లక్షణాలు తీవ్రంగానూ, బలిష్ఠంగానూ. వేరుదోషాల వల్ల కలిగే వ్యాధుల లక్షణాలు బలహీనంగానూ ఉంటాయి.

5) దూష్యము – వ్యాధికారణ భూతమైన దోషదూష్యాలు రెండూ కూడా ఒకే గుణధర్మా లున్నవైనట్లయితే (తుల్యదోషదూష్య) అపుడు ఉత్పన్నమయ్యే లక్షణాలు బలిష్ఠంగానూ తీవ్రంగానూ ఉంటాయి.

6) ఋతువు – ఋతువుల ననుసరించి ఏయే ఋతువులలో ఏయే దోషం ప్రకోపిస్తుందో ఆయా ఋతువులలో ఆయా దోషజన్యరోగం తీవ్రంగానూ బలిష్ఠంగానూ ఉంటుంది. అట్లుగాక ఋతుదోషవిపర్యయమైన లక్షణాలు సౌమ్యంగా ఉంటాయి.

(7) దేశము – రోగి నివసించే దేశంలో ఏ దోషం ప్రాధాన్యం వహిస్తుందో ఆ దోషంవల్ల రోగోత్పత్తి జరిగినట్లైతే ఆ రోగలక్షణాలు బలిష్ఠంగానూ, కానిచో సామాన్యంగానూ ఉంటాయి.

(8) సత్త్వము – ఎవనికి దృఢమైన మనోబలం, దీక్ష, ధైర్యం ఉంటాయో అతనికి జనించే వ్యాధిలక్షణాలు దుర్బలమౌతాయి. ఈ మనోబలం క్షీణించినవారికి వ్యాధి లక్షణాలు దుర్బలమై వ్యక్తమౌతాయి.

నిదాన (మిథ్యాహార విహారాదులు) దోషములు మరియు దూష్యములు (ధాతువులు) రోగాన్ని ఉత్పత్తి చేయుకారణాలు. ఈ రోగోత్పత్తికర హేతువులవల్ల అననుబంధ, అనుబంధం [దోష దూష్య సమ్మూర్ఛన] జరిగే రతివల్లనే రోగాల ప్రాదుర్భావంగాని, అప్రాదుర్భావంగాని జరుగుతుంది.

1) అననుబంధము – (దోష దూష్యాల సమ్మూర్ఛన జరుగకుండుట) రోగం ఉత్పత్తి చెందకుండుట.
2) అనుబంధము – దోషదూష్య సమ్మూర్ఛన జరుగుట, రోగం ఉత్పత్తి యగుట.

3) అబల అనుబంధము :- ఉత్పత్తి అయిన రోగం నిదానదోష దూష్య బలహీనత వలన అల్పలక్షణాలతో బలహీనమై వ్యక్త మౌతుంది.

4) ప్రబల అనుబంధము :- రోగం నెమ్మదిగా బలిష్ఠంగా సర్వ లక్షణాలతో తీవ్రంగా కూడి వ్యక్తమగుట.

| భావములు | అననుబంధ | అనుబంధ | అబల అనుబంధ | ప్రబల అనుబంధ |
|---|---|---|---|---|
| నిదాన | రోగము | రోగము | నెమ్మదిగాను అల్ప బలంతో | ప్రబల వేగంగాను తీవ్రంగాను |
| దోష | యొక్క | యొక్క | అల్పలక్షణాలతో ఉత్పత్తి | అన్ని లక్షణాలతో ఉత్పత్తి. |
| దూష్య | అనుత్పత్తి | ఉత్పత్తి | అవుతుంది | |

పైని వివరించిన రోగోత్పత్తి నిదాన సంబంధ విషయంలో అనను బంధ, అబల అనుబంధాలను వికార విఘాత భావమని అనుబంధ ప్రబలాను బంధాలు రెంటినీ వికార విఘాత అభావమనీ పిలుస్తారు. ఇందులో వికార విఘాతం అంటే రోగ నిరోధకశక్తి శరీరంలో సహజంగా ఏ వికారం లేకుండా (ఓజస్సు) ఉండేంతవరకూ శరీరానికి రోగాల భయం తక్కువ. అథవా ఉత్పత్తి జరిగినా స్వల్పబలంతో అల్పలక్షణాలతో జనిస్తాయి. వికార విఘాత అభావం అంటే ఓజస్సు శరీరంలో నాశనం చెంది, వ్యాధి క్షమత్వం క్షీణించి శరీరంలో వ్యాధి ఉత్పత్తి చెందటం. (41)

### ఆఱవ క్రియాకాలము – భేదము :

పంచమక్రియాకాలమైన 'వ్యక్తి' లో సమ్యక్ చికిత్సను పొందక మరల దోషప్రకోపంచేసే మిథ్యాహార విహారాదులను ఆచరించుట మొద లగు కారణాలవల్ల దోష దూష్య సమ్మూర్ఛన మరికొంత బలిష్ఠత చెంది ఆఱవ అవస్థయగు భేదావస్థను కల్పిస్తుంది (42) దోష ధాతు స్రోతస్సులలో ఉండే

వైకృతులు అతి బలమునొంది దోషయోగ్యమైన చికిత్సకు కూడా లొంగవు. స్రోతస్సులలో కాఠిన్యము, అతిసంచనము, విస్తృ(కృ)తత్వం, వక్రత, గ్రంథులేర్పడుట, విమార్గ గమనము (వేరే స్రోతస్సులలో ప్రవేశించుట) క్రియాహీనత, లేదా అధికచేష్ట మొదలైన నానావిధములైన మార్పులు (వికృతులు) ప్రాదుర్భవిస్తాయి (43) అందుచేత ఈ క్రియాకాలంలో సంపూర్ణ రోగనివారణ ఆరోగ్య స్థాపన అనేవి అసాధ్యమైన విషయాలు అవుతాయి. ఈ స్థితిలో రోగి దీర్ఘాయుష్మంతుడై యశస్వియైన వైద్యుని చేత చికిత్స చేయించుకొన్నట్లయితే, దైవకృపకూడా ఒనగూడినట్లయితే, ఆ రోగికి కొంచెంగా రోగం శాంతించినప్పటికీ జీవితపర్యంతం రోగిగానే బ్రతుకు ఈడ్వవలసి ఉంటుంది. కాని ఇట్లా కాకుంటా రోగి ఆయుస్సు లేనివాడై, తగిన చికిత్సలేక, దైవకృపకు కూడా పాత్రుడు కాని యెడల తప్పక యమపురికి చేరుతాడు.

ఈవిధంగా దీర్ఘకాలానుబంధంచేత, మరణంచేత ఈ ఆఱవ క్రియాకాలం ముందు వివరించిన ఐదుక్రియాకాలాలకన్న భిన్నలక్షణాలు కలది అనే అర్థాన్ని భేదం అనే పదం సూచిస్తుంది.

దీర్ఘకాలానుబంధంచేత మఱియు మరణానికి సంబంధించిన మరొక రెండు ప్రముఖమైన లక్షణాలు కూడ (సంఘటనలు కూడ) ఈ కాలంలో ఉంటాయి. ఇవి 1 ఉపద్రవాలు. 2. అరిష్టలక్షణములును.

ఉపద్రవాలు :- తీవ్రమైన ఒకరోగానికి అంత్యసమయంలో కనిపించే బలిష్ఠమైన వేరొండు రోగలక్షణాలకు, లేదా రోగం శాంతించిన పిమ్మట కనుపించే దుర్బల రోగలక్షణాలకు 'ఉపద్రవాలు' అని పేరు.

(ఉప = సమీపంలో, ద్రవతి = సంచరించునది.)

ఈ ఉపద్రవాల ఉత్పత్తికి అంతకు ముందు వచ్చే ప్రధానరోగం ఒక్కటే కారణం కానవసరం లేదు. రోగి సేవించే మిథ్యాహార విహారాదులు, వైద్యుడు నెరపే చికిత్సావిధానము, ఆయుః క్షయము మొదలగు కారణములు సహాయపడతాయి. (44)

ప్రధానమైన, మొదట జనించే, వ్యాధి ఏ మూలకారణము అయిన దోషంచేత జనించిందో ఉపద్రవాలు కూడా అదే దోషం చేత ఉత్పన్నమవుతాయి అన్యదోషంచేత జనించే ఉపద్రవాలు చాల తక్కువగా ఉంటాయి. ప్రధాన వ్యాధి, ఉపద్రవాలు రెండూ ఒకే దోషంచేత జనించడం మూలంగా సామాన్యంగా ప్రధానవ్యాధికి చేసే చికిత్స వల్లనే ఉపద్రవాలు కూడా శాంతిస్తాయి. ఉపద్రవాలు బలిష్ఠంగా ఉండి శరీరానికి అధికమైన బాధ కల్గిస్తూ ఉంటే ప్రధాన వ్యాధికన్న ముందుగ వాటికే చికిత్స చేయాలి. ఎందుకంటే ఉపద్రవాలతో కూడిన రోగం అసాధ్యంగా పరిణమిస్తుంది. (45)

ఈ "భేదం" అనే క్రియాకాలం వరకు సాగిన అన్నిరోగాలకూ ఉపద్రవాలు ఉండాలని ఎక్కడా లేదు. ధాతువుల బలం (ఓజస్సు) క్షీణించ కుండా ఉండి యోగ్యమయిన చికిత్స చేయించినట్లయితే ఉపద్రవాలు తల ఎత్తనే ఎత్తవు. అందుచేతనే చికిత్సాసమయంలో రోగి యొక్క సత్త్వబలరక్షణకు అత్యంతమైనప్రాధాన్యంఇవ్వాలని ఆయుర్వేద శాస్త్రాలు ముక్తకంఠంతో ఘోషిస్తున్నాయి. (46)

అరిష్ట లక్షణాలు (మరణసూచక లక్షణాలు) :

చేసే చికిత్స విఫలమై, రోగం శరీరాన్ని కబళించేముందు విలక్షణమైన పెక్కుగుర్తులు, లక్షణాలు రోగిశరీరంలో వ్యక్తమవుతూఉంటాయి. ఈ విలక్షణమైన లక్షణ - (చిహ్న) సముదాయానికి కూడ ప్రకోపించిన దోషాలే కారణం. శరీరంలోని అవయవాలకు సంబంధించిన పంచేంద్రియముల విషయస్వరూపాలైన (రూప, ఆకృతి, వర్ణ, ఛాయా ఇత్యాదులు), రస (వైరస్య,రసిక),గంధ (నానాపుష్పాగల సౌంగధ్య, దౌర్గంధ్యాలూ), స్పర్శ (శీతోష్ణాది గుణాలు, స్పందన, చ్యుతి, భ్రంశ, నాశ ఇత్యాదులు), శబ్ద (నానారీతుల వికృతస్వరాల వైపరీత్యం, ఇంద్రియాల, మనస్సుల వైపరీత్యం మొదలగు అనేక భావాలలో అరిష్టలక్షణాలు గోచరిస్తూఉంటాయి. (48) వీటి విస్తృత వివరణ తొమ్మిదవ అధ్యాయంలో తెలుపబడినది.

రిష్టాభాస - అరిష్టలక్షణాలను బోలినవి [ ష్టానుకారి] కానీ నిజముగ అరిష్టలక్షణాలు గాని లక్షణాలకు 'రిష్టాభాస' అని పేరు. [అరిష్టలక్షణాల వలె కనబడేవి ] కొన్ని సమయాలలో ఇటువంటి లక్షణాలు రోగాలలో కన్పిస్తూఉంటాయి. అనుభవంలేని వైద్యుడు వీటిని గమనించడంతోటే రోగి అంత్యసమయాన్ని ఊహించి చికిత్ససలుపక ఆ రోగిని అట్లే వదలి వేస్తే నవ్వులపాలు అవుతాడు. నిజమైన అరిష్టలక్షణాలను నిర్ణయించక పోవుట, రిష్టాభాస లక్షణములను నిజమైన అరిష్టలక్షణాలని భ్రమించడం- ఈ రెండూ కూడా వైద్యులు చేసే ప్రజ్ఞాపరాధం అని చరకసంహితలో వర్ణించబడింది. [48]

ఉదర్కము :- ఉదర్కం అంటే ఉత్తరకాలీన ఫలం. సంచయ ప్రకోపాది క్రియాకాలాల్లో వ్యక్తమయ్యే వికారాలకు సకాలంలో చికిత్స చేయక ఉపేక్షించినచో కలిగే హానికే ఉదర్కమని విశేషించి పేరు పెట్టారు. మొదట మూడు క్రియాకాలాల్లోనూ దోషవైషమ్యమే ముఖ్యమైన వికృతి. ఈ దోషవైషమ్యాన్ని సరిపే చికిత్సను జాగ్రత్తగా చేసినట్లయితే వికృతిదోషాలు ప్రాకృతావస్థకు చేరుకొని ఆరోగ్యాన్ని కల్గిస్తాయి. అందుచేత ముందుముందు రోగాన్నే ఉత్పత్తిచేయవు. వ్యాధిచేత జనించినను గూడ దాని నడుపులో పెట్టుట (వ్యాధిబలవిరోధిత్వము) ద్వారా ఈ రెండూ సాధ్యమవుతాయి. [49]

మొదటి మూడు క్రియాకాలాలైన సంచయ, ప్రకోప, ప్రసారము లలో శరీరంలో వ్యక్తమయ్యే రోగలక్షణాలను గమనించి వాటికి తగిన యోగ్యమైన చికిత్స చేయక ఉపేక్షించినట్లయితే వృద్ధి చెందిన దోషవైషమ్యం నాల్గవ క్రియాకాలమైన స్థానసంశ్రయంనుండి ధాతువులను కూడా వైషమ్యం చెందిస్తుంది. ఆ సమయంలో దోషప్రత్యానీక చికిత్సతోపాటు రోగప్రత్యానీక చికిత్సనుగూడ చేయించవలసిన అవసరం ఉంటుంది. స్థాన సంశ్రయకాలంలో దోష, దూష్య, సమ్మూర్ఛన ప్రారంభావస్థలో ఉండటం మూలంగా ఈ నాల్గవ క్రియాకాలంలో జాగ్రత్తగ యోచించి యోగ్యమైన చికిత్స గావించినట్లయితే ఆ రోగం ముందుకు వృద్ధి నొందకుండ ధాతువులు, దోషాలు కూడ ప్రాకృతావస్థకు, ఆరోగ్యావస్థకు వచ్చి

చేరుతాయి. స్రోతో వికారంకూడ పై చికిత్సవలన సహజ ప్రాకృతావస్థను చెంది రోగం నిశ్శేషంగా నివారణ అవుతుంది.

ఐదవదైన వ్యక్తి క్రియాకాలంలో దోషదూష్య సంమూర్ఛన బలంగా స్థిరపడి స్రోతస్సులను, ఓజస్సును వికృత పరచటం మూలంగా యోగ్యమైన చికిత్స చేయించినను కూడ శరీరంలో ఏర్పడిన వైషమ్యం, వికృతి. రోగం నిశ్శేషంగా నివారణ అవుతుందనే నమ్మకంలేదు. ఈ స్థితిలో ఎంతటి చికిత్సయైనా కష్టతరమూ, రోగనివారణ సందేహాస్పదమూ అవుతుంది. ఈస్థితిలో పౌష్టికాహారం రసాయనసేవన అత్యంతం అవసరం. వీటివల్ల ఓజస్సు వృద్ధిచెంది వ్యాధిక్షమత్వం (వ్యాధిని ఎదుర్కొనే శక్తి) శరీరంలో ఏర్పడుతుంది. దీనివలన కొంచెం ఆరోగ్యం కల్గుతుంది. కొన్ని సమయాల్లో అతిప్రభావము కల్గిన ఔషధముల మూలముగా వ్యాధి తీవ్రత తగ్గి లక్షణాలుతగ్గి శరీరానికి కల్గే బాధ కొంచెంనివారణ కావచ్చు. కాని ఇదియే వ్యాధినివారణ యని భ్రమింపరాదు. ఆసమయంలో వ్యాధికర అంశములు అల్పంగానూ, దుర్బలంగానూ ఉండి శరీరంలోని ధాతువులలో లీనం చెందుతాయి (ధాతులీనత). కాని ఈ లుప్తమైన రోగలక్షణాలు తమకు అనుకూలమైన పరిస్థితులు రాగానే తిరిగి బలిష్ఠమై రోగాన్ని వ్యక్తం చేస్తాయి ఈవిధంగా అనేకమైన వ్యాధులు ఆధునిక చికిత్సవల్ల ఆయా ఔషధప్రభావంవల్ల తగ్గినట్లుగా లుప్తమై తిరిగి అనుకూల పరిస్థితి యేర్పడినప్పుడు బలిష్ఠమై తీవ్రతర మవుతుంటాయి. దీనికే రోగ 'పునరావర్తనం' అని పేరు. [50]

ఈ స్థితిలో చికిత్స యోగ్యమైనదిగానియెడల వ్యాధికారక అంశాలు బలిష్ఠమై అది ఆశ్రయించిన ధాతువులలో బలిష్ఠమైన వికృతి, వైషమ్యం కల్గించి అసాధ్యలక్షణాలను ఉపద్రవాలను కల్గిస్తుంది. ధాతువులు తమ ప్రమాణంలోను, బలంలోను క్షీణిస్తాయి. రసధాతువు మొదలు ఉత్తరోత్తర ధాతువులు క్షీణించడాన్ని రోగం యొక్క ధాతుగతత్వం అనే పిలుస్తారు. ఈధాతుగతత్వం రసరక్తమాంసాది ధాతువులలో కన్పిస్తే (అవి క్షీణత నొందితే) ఉత్థాన అవస్థ అనియు వీటితోపాటు మేదస్సు అస్థి

మజ్జా శుక్ర ధాతువులలో కూడ ఆశ్రయించి క్షీణింపచేస్తే దానిని గంభీరావస్థ యనియు పిలుస్తారు. [51]

అయిదవ క్రియాకాలం అయిన రూపావస్థ దాటి ఆఖరిదైన 'భేద మనే క్రియాకాలంలో వికృతాది దోషధాతువులను సాన్నిహితావస్థకు తేవడం అసాధ్యంకావడంమూలంగా ఈస్థితిలో రోగాలు అసాధ్యంగానే పరిగణించాలి. అత్యుత్కృష్టమైన చికిత్స చేయించినా కూడ రోగతీవ్రత కొంత శాంతింపవచ్చునేమో గాని అంగవైకల్యం, చేష్టానాశం, అతి దౌర్బల్యం మొదలైన లక్షణాలు మాత్రం జీవితకాలమంతా ఉంటూనే ఉంటాయి. రోగం తీవ్రత తగ్గినప్పటికీ తగిన కాలంలో కొంచెం మిథ్యాహార విహారాదులు కల్గినా కూడ అతితీవ్రతరమై మరణ పర్యంతం ఆ రోగిని పీడిస్తూనే ఉంటుంది. ఇటువంటి రోగాలను 'అప్యరోగాలు' అంటారు. ఈస్థితి అనేకమైన ఇతర రోగాలను పుట్టిస్తుంది. ఈవిధముగ వేరే ఇతరమైన రోగాలకు కారణభూతమయ్యే రోగాలకు 'నిదానార్థక' రోగాలని పేరు. [52]

వ్యక్తిభేదం అనే ఆఱు స్థితులను పొందిన ఏరోగమైనా యాప్యమే అవుతుంది అనే నియమం ఏమీ లేదు. ఆయుర్భాగ్యం, దైవబలం, శారీరక, మానసికబలం, లేని రోగులు యోగ్యుడైన వైద్యునిద్వారా చికిత్స పొందినా కూడ ఏప్రయోజనం పొందలేనివారై అరిష్టలక్షణాలతో కూడిన మరణమునుపొందుతారు. (ప్రత్యాయ) ఈవిధంగా మొదటి మూడు క్రియాకాలాల్లోను వ్యాధినిరోధం, వ్యాధిబల నిగ్రహం, స్వాస్థ్య సాధనయు, నాల్గవ క్రియాకాలంలో వ్యాధిసాధ్యతనూ, ఐదవక్రియాకాలంలో యాప్యతనూ, అసాధ్యతనూ నిదానార్థకర రోగాలు అసాధ్యమున్నూ అగును. ఇవిఅన్నియూ ఉదర్కమనే (సమాప్తిస్థితి) తెలిసికోవాలి.

ఉదర్కములు రూపావస్థ తరువాత ప్రతివ్యాధికీ వేర్వేరుగా ఉంటాయి. యోగ్యుడైన వైద్యుడు ఈ ఉదర్కములు, అరిష్టాలు సంభవించకుండా ఉండేటట్లు చూచుకోవాలి. ఇది అతని కర్తవ్యం.

## దోషపాకం - ధాతుపాకం.

"పాకం" అంటే పక్వత చెందుట - ఉడుకుట - పచనమగుట అని అర్థం. ఇది ఆగ్నేయవ్యాపారం. దోషాలు వృద్ధి చెంది సామరసంతో కూడి సంచరిస్తూ రోగాలను ఉత్పత్తి చేస్తూ ఉంటాయి. ఈ సామావస్థ గూడ శాశ్వతిముగా నిలిచిపోయేదేమీ గాదు. శరీరబలవృద్ధి, నిదానవర్జన. పథ్యపాలన, యోగ్యచికిత్స మొదలగు వానివలన కోష్ఠాగ్ని తీవ్రత చెంది శరీరంలో మిగిలిన ఆమాంసం కూడ పచనం చెందుతుంది. జఠరాగ్ని సహాయం చేత దోషాలలోని ఆగ్నేయాంశములు వాటిలో పేరుకొని పోయిన ఆమద్రవ్యాలను పచనం చేస్తుంది. ఈ విధంగా ఆమపాచన జరిగేందుకు ముందు దోషాల ఆమావస్థ యనీ, పాకం (పక్వత) జరిగే కాలాన్ని పచ్యమానావస్థ యనీ ఆమపాకం పూర్తిగా జరిగిన అవస్థను పక్వావస్థ (నిరామ అవస్థ) అని విభజించవచ్చును. పక్వంచెందిన దోషాలు సహజ ప్రాకృతావస్థను చెందుతాయి. అందువల్ల వాటివల్ల ఉత్పత్తి చెందిన రోగాలు కూడ నివారణ చెందుతాయి. ఈ స్థితినే దోషపాకస్థితి యని అంటారు. ఇది ఆరోగ్యకరం. ఆరోగ్యసాధకము.

### దోషపాక లక్షణాలు:- (నిరామ దోషలక్షణాలు)

వాతము - (నిరామదోషలక్షణాలు) విశదం, రూక్షం, నిర్విబంధ (అవరోధం లేని) అల్ప వేదన స్నేహానము చేత సెమ్మదిగ శమించుట మొ॥

పిత్తము - ఆతామ్రి (తోపు - ఎఱుపు) పీతవర్ణ, అత్యుష్ణగుణ, కటురస, సర (అస్థిర); నిగంధ (స్వాభావిక విశిష్టగణ), రుచి, ఆహార పచనము బలిష్ఠమగుట

కఫము - ఫేనిల (నురుగుఏర్పడుట) పిండిత (గట్టియగుట) పాండు వర్ణ, అగంధ (వాసన లేకపోవుట); నిస్సార; భేదవంతము (సులభంగా విడునది) మరియు నోరు శుభ్రత చెందుట.

ఈపై ఆయా దోషాల లక్షణాలు శరీరంలో వ్యక్తమయినచో దోష పాచనము ముగిసినదనియూ తప్పక గణం కన్పిస్తుందనియూ తెలిసికో వచ్చును. (53)

ధాతువుల పాకం శరీరనాశానికి దారితీస్తుంది. కోష్ఠాగ్ని (తదితర అగ్నులు) అతివృద్ధిచెంది ఆమద్రవ్యాలను పక్వం చేస్తున్నపుడు ధాతు పరమాణువులు కూడ దీనితో కలసి పక్వం చెంది చీము, రసి రూపంగా శరీరమందుండి స్రవించటం మొదలుపెడతాయి. ఈ విధంగా ధాతునాశం జరగటం మూలంగా ఓజస్సు నాశనం చెంది శరీరం కృశించి దుర్బలమై నశిస్తుంది ఈ విధంగా ధాతువులు పరిపక్వత నొందటం (అతిపక్వం పొందటం) శరీరానికి ఎప్పుడూ హానికరమే (మరణసూచకమే) అందువల్లనే ధాతుపాకం మరణ సూచకం. (54)

ఈపై ధాతుపాకం అన్ని ధాతువులనూ ఒకే సమయంలో ఉండజాలదు. ఆహారరసంలో ఉండే అస్థాయి ధాతువులతో ప్రారంభమై రస, రక్త, మాంస- ఈక్రమంలో ఉత్తరోత్తర ధాతువులను ఆక్రమించుకొంటుంది కొన్ని రోగాలలో ఈ ధాతుపాకం కేవలం ఒకే ధాతువుకు పరిమితమై యుంటుంది, (ఉ దా॥ విద్రధి, గుల్మ మొదలగు బాహ్యరోగాలు మాంసము, అస్థి, మజ్జ మొదలగు ధాతువులలో). కనుక ధాతుపాక లక్షణాలను తెలుసుకోవటం వైద్యునికి అత్యంతావశ్యకం విధి చికిత్సోద్దేశం ధాతువుల సామ్యతయే, ధాతుస్వాస్థ్య సాధనయే! అందుచేత కేవలం దోషపాకం మాత్రమే శరీరంలో జరిగేటట్లుగానూ ధాతుపాకం జన్మించకుండునట్లుగాను జాగ్రత్త తీసుకోవడం వైద్యుని కర్తవ్యం. అందుకోసమే ధాతుపాక లక్షణాలను జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి.

ధాతుపాక లక్షణాలు –

నిద్రానాశ, హృత్స్తంభ (హృదయంలో నొప్పి), విష్టంభ (మలబద్ధత) గౌరవం, అరుచి, బలహాని, నాభిహృదయాలమధ్య

నొప్పి,శరీరంలో తీవ్రగాయా లేర్పడుట, అతివేదన-ఇట్లుండుట ధాతుపాక ప్రారంభావస్థను సూచించే లక్షణాలు. ఇవే గాక ధాతువుల స్వాభావిక గుణకర్మల నాశనం, క్షయం, దోషోదక, చీము, రసి-ల ఉత్పత్తి, మరియు వాటి ప్రసరణ, శరీరదౌర్బల్యం, కృశత్వం, రోగవృద్ధి మొదలైనవి ధాతు పాక లక్షణాలు. (55)

కొన్ని ప్రత్యేక రోగాల్లో చికిత్స ద్వారా ధాతుపాకాన్ని కల్పించడం ఆవశ్యకం. విద్రధి, గ్రంథి, అర్బుదం మొదలైన రోగాల్లో జాగ్రత్తగ చీమును పూయోత్పత్తి చేయడానికి బాహ్యస్వేదం, లేపం లోపలికి అభిష్యంది ఆహారపదార్థాల సేవన మొదలైనవి గావించి శస్త్ర యోగ్యమైన విధంగా రోగాన్ని మళ్ళించడం కూడ ధాతుపాకం రీతియే॥

## వివిధరోగాల సాధ్యతా సాధ్యతలు :-

వ్యక్తి, భేదక్రియాకాలాలలోని దోషదూష్య సంమూర్ఛన, రోగ కారణం, స్థానం ఇత్యాదుల ఆధారంపై రోగాల సాధ్యాసాధ్యత్వం నిశ్చయించబడుతుంది. సామాన్యముగా అన్ని రోగాలను సాధ్యమనీ, అసాధ్యమనీ రెండు రకములుగ విభజించవచ్చును. తగిన చికిత్సలో నిశ్శేషంగా నివారణ చెందేవి సాధ్యరోగాలు. ఇట్లు దీర్ఘకాలం బాధిస్తూ చికిత్సకు లొంగని మరణకారణమైనవి అసాధ్యాలు పైసాధ్యరోగాల్లోనే సుసాధ్యం అనీ, కృచ్ఛ్రసాధ్యమనీ రెండు విధాలుగ ఉంటాయి. అసాధ్యంలో యాప్యమనీ (దీర్ఘకాలం బాధించి చివరకెప్పుడో ఒకప్పుడు మరణాన్ని కల్గించేవి.) మరియు ప్రత్యాఖ్యేయమనీ లేదా అనుపక్రమంఅనీ (తథ్యంగా మరణాన్ని కల్గించేది) అనీ విభాగా లున్నాయి. [56] ఈ నాల్గువిధాల లక్షణాలను నిర్దిష్టంగా తెలుసుకోవడం అత్యంతావశ్యకం.

1. సుసాధ్యలక్షణాలు -ఏక్రమమైన, విధమైన చికిత్సాక్రియాన్నైన తట్టుకోగల్గిన శక్తిమంతమైన శరీరంగల యువకుడైనపురుషుడు జితేంద్రియుడు అయినట్టియు మర్మశ్రియముగాని,అల్పకారణముచే జనించిన అల్ప పూర్వ రూపలక్షణాలుగల్గిన ఉపద్రవంలేని సమానదోష, ధాతు - దేశ -

ఋతుప్రకృతులు గల్గినట్టియూ నాలుగు చికిత్సాపాదులు కల్గినట్టియూ, అనుకూల గ్రహసంపత్తి కల్గిన ఒకేరోగమార్గాన్ని ఆశ్రయించిన ఒకే దోషం చేత ఉత్పన్నమైన అచిరకాల రోగములు సులభసాధ్యమైనవి. [57]

2. <u>కృచ్ఛ్రసాధ్య లక్షణాలు</u> - నిదాన,పూర్వరూప,రూపముల మధ్యము బలములు కల్గి సమానంకాని దేశ, కాల, దోష, ధాతు, ప్రకృతులుగల చికిత్సా పాదములు అసంపూర్ణమై అతిగా ఉపద్రవాలుకల్గిన రెండు రోగ మార్గాలనాశ్రయించిన ద్వంద్వదోషోత్పన్నమయిన శస్త్ర, అగ్నిక్షారముల ఉపయోగంచేత చికిత్స చేయదగిన గర్భిణీ, వృద్ధ, స్త్రీ, బాలుర వ్యాధులు కృచ్ఛ్రసాధ్యమైనవి. [58]

3 <u>యాప్యలక్షణాలు</u> - శరీరంలో దీర్ఘకాలంనుంచిఉంటూ ధాతు, మర్మ, అస్థి. సంధులలో ఆశ్రయం చెంది, ద్వంద్వ దోషాలతో తయారైన తగిన పథ్య, ఆహార ఔషధాల సేవన చేత శమనం చెందే వ్యాధులు యాప్యం అనబడతాయి. (59)

4. <u>ప్రత్యాఖ్యేయ లక్షణాలు</u> - త్రిదోషోత్పన్నమై, అసాధ్య లక్షణాలు పరిపూర్ణంగాగలిగి, అన్నివిధాల అరిష్టలక్షణాలుగలిగి, ఔత్సుక్య, మోహ,అరతి, ఇంద్రియనాశం మొదలగు లక్షణాలను కల్గించే అతిముఖ్యల, ఆయుస్సుతీరిన రోగుల రోగాలు ప్రత్యాఖ్యేయములు అనబడతాయి. (60)

<u>మరణం</u> - ఎంతటియోగ్యుడైన వైద్యుడయినా గొప్పచికిత్స చేసినప్పటికీ ప్రయోజనంలేని శరీరం వ్యాధి బారిన పడి అచేతనత్వం చెందే అవస్థను మరణం అంటారు. శరీర, ఇంద్రియ, సత్త్వ, ఆత్మల మేలు కలయికల వికార రహిత అనుబంధాన్నే జీవితం అంటారు. ఆయువు అంటారు. వీటి వియోగాన్ని మరణం అంటారు. నాశం - ప్రళయం అనియూ దార్శనిక వేత్తలు సెలవిచ్చారు. లోకంలో చావు పుట్టుకలూ, సృష్టిలయాలూ అనవరతం సంభవిస్తూనేఉంటాయి. పుట్టిన ప్రతిజీవికి, వస్తువుకూ నాశనం ఉంటుంది. బాహ్యప్రపంచం అవాంతర ప్రళయం, మరియు మహాప్రళయం అనే రెండు రీతులలో నాశనం చెందుతుంది ఆవిధంగానే శరీరం కూడ రెండు రీతులుగా మరణం చెందుతుంది అని చెప్పవచ్చును.

1. అవాంతరమరణం - సంపూర్ణశరీరంలో ఆత్మ ఉన్నప్పటికీ శరీరం లోని కొన్ని భాగాలు కాలానుగుణంగా నాశనం చెందటం అవాంతర మరణం. శరీరం ప్రతిక్షణంలోనూ మార్పు చెందుతూనే ఉంటుంది. ఈ కార్యం శరీరాద్యంతాల్లో జరుగుతూ ఉండటంమూలంగా దానిఫలితం మనకు వెంటనే కనబడటంలేదు. ఇటువంటి మార్పులు చాల జరిగిన తరువాత శరీరం పెరిగి, వృద్ధిచెంది లేదా తరిగి, క్షీణించినతర్వాతనే వయస్సు అని తెలుసుకుంటాము. (వృద్ధి - క్షయ) శైశవావస్థలో ఉన్న శరీరం యౌవనావస్థకు ఒకామొకిని చేరుకోదు. లేదా శైశవావస్థలోని ధాతుపరమాణువులు ఒకేసారిగ పెరిగి యౌవనశరీరం తయారుగాదు. శరీరం అంటే 'శీర్యతే' అనే ఉత్పత్తిప్రకారం అనుక్షణం నశిస్తూ ఉంటుంది గావుననే, శరీరం అంటారు. ధాతుపరమాణువులలో జరిగే అభ్యంతర పరిణామాల్ని, మార్పుల్ని వాటి క్రమనాశాన్ని అవాంతర మరణమని పిలుస్తారు.

ఎ. ప్రాకృతము.- ఆరోగ్యసమయంలో స్వాభావికంగా ప్రతిక్షణంలోనూ సంభవించే వయస్సుకు కారణమయ్యేది. (16)

బి. వైకృతము - త్రిదోషాలవైషమ్యం, విషాలు విషసమానద్రవ్యాల సంయోగం, అభిఘాత (శస్త్ర, అగ్ని, హిమ, అనిల, పిడుగు మొదలైనవి పడుట) భావంచేత నిర్దిష్టస్థానంలోని ధాతుపరమాణువులు నాశనం పొందుతాయి. ఇది జరుగకుండా శరీరాన్ని రక్షించుకొంటూ ఉండాలి ఔషధాలు మొదలగు ఉపచారాలు తమ ప్రభావంచేత వీటిని నివారిస్తాయి. యోగ్యమయిన, తగినచికిత్సను సకాలంలో చేయలేకపోయినచో ధాతుపరమాణువులనాశం శీఘ్రంగా, వ్యాపకంగా అయిపోతూ వ్యాధి దారుణావస్థను పొంది శరీరాన్ని నాశనం చేస్తుంది.

ధాతుపరమాణువులు నాశనం చెందటానికి ధాతుపాకమనే పేరు తెలుసుకొన్నాం. పాకం అనేది తేజోగుణం (పిత్తధాత్వగ్ని) చేత జరిగే ప్రక్రియ. వ్యాధుల అంతిమావస్థలో పాకక్రియ రెండు విధాలుగా ఉంటుంది.

ఎ. పిత్తం మరియు వాతదోషాల సంయోగంచేత ధాతుపరమాణువులలోని ఆప్యాంశమును సంపూర్ణముగా శోషింపచేసి పరమాణువులను నాశనం చేస్తాయి. ఈవిధంగా శరీరమంతా కుష్కించి అవయవాల కార్య నిర్వహణశక్తి నశిస్తుంది.

బి. పిత్తకఫాలు రెండూ సంయోగించినచో ధాతుపరమాణువులు కుళ్లి చీము రక్తంతో కూడి శరీరం నుండి బయటకు స్రవిస్తాయి. దేహంలో ప్రత్యేకస్థానాలలో గ్రంథి, విద్రధి, పిడికవ్రణములు, లేచి వాటినుండి తెల్లని దుర్గంధయుక్తమైన చిక్కని ద్రవం స్రవిస్తుంది. దీనినే పూయంఅని, చీముఅనీ అంటాము. కొన్ని రోగాలలో ఈ చీము పలుచని నీరువలెను (జలోదరం), కొన్ని రోగాలల్లో అతిస్నిగ్ధమైన దోషోదకం (సంధులలోవి దోషోదకం) వలెనూ, మరియు కొన్ని రోగాలలో రక్తం కలిగిన చీము వలెనూ కన్పిస్తూ ఉంటుంది. ఈలక్షణాలలో వీటన్నింటినీ పరిపక్వ ధాతువులనియూ అవి శరీరాన్ని మలస్వరూపమై మలినపరుస్తాయనీ తెలిసికోవాలి. చరకాచార్యులు ఇవి శరీరానికి శల్యములవంటి వనియు వీటినుండి రక్షింపబడాలనియు నుడివిరి (62)

2. మహామరణం – ధాతువులన్నియూ కూడా అవాంతర మరణంచేత (ప్రాకృత లేదా వైకృత రీతిలో) నాశనం పొందే శరీరంలో ఉండజాలక ఆత్మ, శరీరంనుండి వేర్పడతాడు. దీనికి తోడుగా ఇంద్రియాలూ మనస్సూ గూడి కలిసి విముక్తము లౌతాయి. ఈవిధంగా ఆత్మశరీరంనుండి బైటపడడమే మహామరణం అంటే. ఆత్మ నిష్క్రమించిన వెంటనే శరీరం నిర్జీవం, నిశ్చేష్టం, సంజ్ఞాహీనమై, శవమై, కట్టె యౌతుంది. ఈ పంచభూతాత్మకమైన కట్టెను అగ్నిసంస్కారములతో దహనం చేయాలి. ఈ మహామరణాన్ని కూడ రెండు విధాలుగా విభజింపవచ్చును. (63) (64)

(1) కాలమరణం – మానవుని ప్రారబ్ధకర్మము, పుణ్యం, ఆయువూ యీ మూడూ పరిసమాప్తి చెందిన వెంటనే దేహం రాలిపోతుంది. ఇది అనివార్యం. (65).

2. అకాలమరణం :-రోగాలు, ప్రమాదాలు, ఆఘాతాలు మొదలగు వాటివల్ల ఆయుర్భాగ్యం ఉన్ననూ కూడ మరణం కలుగుతుంది. దీనిని కొంతవరకు నివారించవచ్చును.

## అధ్యాయ సారాంశము

1. సంచయాది ఆరు క్రియాకాలాల్లోనూ కత్గేవికృతి - విపరీతలక్షణాలు ఉత్తరోత్తర శరీరంలో బలిష్ఠమౌతాయి. అయినను యోగ్య చికిత్సచేత మొదటి మూడు క్రియాకాలాల్లోని వ్యాధిని నిరోధించవచ్చును.

2. నాల్గవ క్రియాకాలంలో సంభవించే దోష, దూష్య, సమ్మూర్ఛన రోగోత్పత్తికి అత్యంతప్రాధాన్యంగల ప్రక్రియ.

3. దోష, దూష్య, ఆమ, స్రోతస్సు మొదలగు వస్తువులు వికృతి చెంది తమ తమ లక్షణాలను వ్యక్తం చేస్తాయి. ఈ లక్షణాలన్నీ సమాన బలం కల్గినవి కావు. ప్రతి వ్యాధిలోనూ స్థానికమనీ, ఆగంతుకమనీ రెండు దోషాలు ప్రాధాన్యం వహిస్తూ వాటినుండి క్రమంగా ప్రత్యాత్మ అనీ, సామాన్యమనీ రెండు విధముల లక్షణాలు వ్యక్తమౌతాయి.

4. దోషపాకంచేత వ్యాధినివారణ - ధాతుపాకంచేత అసాధ్యత్వమున్నూ మరణమున్నూ ప్రాప్తిస్తాయి.



# అధ్యాయం - 6

## క్రియాల కాలవిమర్శ.

## శాస్త్రోక్త ప్రమాణ శ్లోకములు

1. చయప్రకోప ప్రశమాః వాయోః గ్రీష్మాదిషు త్రిషు ।
వర్షాదిషు చ పిత్తస్య శ్లేష్మణః శిశిరాదిషు ॥ (అ హృ సూ 12/24)

2. సంచయం చ ప్రకోపం చ ప్రసరం స్థాన సంశ్రయం ।
వ్యక్తిభేదం చ యోవేత్తి దోషాణాం సభవేద్భిషక్ ॥
(సు. సూ. 12/36)

3. చయో వృద్ధిః స్వధామ్నేవ ... ...। (అ హృ సూ. 12/22)

4. తత్ర సంచితానాం ఖలు దోషాణాం స్తబ్ధపూర్ణకోష్ఠతా పీతావభాసతా, మందోష్మతా చాంగానాం గౌరవ మాలస్యం చయకారణ విద్వేషశ్చేతి లింగాని భవంతి॥ (సు. సూ 20/18)

5. ... ... ప్రద్వేషో వృద్ధిహేతుషు ।
విపరీత గుణేచ్ఛా చ .. . ...॥ (అ హృ.సూ. 12/22

6. యదన్నం ద్వేష్టి యదపి ప్రార్థయేతావిరోధి తు।
తత్ర త్త్యజన్ సమశ్నంశ్చ తౌ తౌ వృద్ధిక్షయౌ జయేత్ ॥
(అ హృ. సూ. 10/42

చయ ఏవ జయే ద్దోషం కుపితం త్వవిరోధయన్ ।
సర్వకోపే బలీయాంసం శేషదోషావిరోధతః ॥
(అ. హృ. సూ. 13/15

సంచయోప హృతాదోషాః లభంతే నోత్తరా గతిః ।
తే తూత్తరాసు గతిషు భవంతి బలవత్తరాః ॥ (సు సూ. 21/27)

7. కోపస్తూన్మార్గగామితా । (అ. హృ. సూ. 12/23)
తేషాం ప్రకోపాత్ కోష్ఠతోద సంచరణ ఆమ్లికాపిపాసా పరిదాహాన్నద్వేష హృదయోత్క్లేదాశ్చ జాయంతే। తత్ర ద్వితీయః క్రియాకాలః॥
(సు.సూ. 21/27)

8. అత ఊర్ధ్వం ప్రసరం .. । తేషామేభి రాతంక విశేషైః ప్రకుపితా నాం పర్యుషిత కిణ్వోదక పిష్ట సమవాయ ఇవోద్రిక్తానాం ప్రస రోభవతి। తేషాం వాయుః గతిమత్త్వాత్ ప్రసరణ హేతుః సత్య ప్యచైత న్యే। సహి రజో భూయిష్ఠః, రజ శ్చ ప్రవర్తకం సర్వ భావానాం। (సు. సూ. 21/17)

9. యథా మహా నుదక సంచయో అతివృద్ధః సేతు మవదార్య అపరే ణైవ ఉదకేన వ్యామిశ్రః సర్వతః ప్రధావతి ఏవం దోషాః కదాచి దేకశో ద్విశః సమస్తాః శోణిత సహితా వా అనేక ధా ప్రసరంతి। (సు. సూ. 21/27)

కృత్స్నేఽర్ధేఽవయవే వాఽపి యత్రాంగే కుపితో భృశమ్।
దోషోవికారం నభసి మేఘవత్ తత్ర వర్షతి॥ (సు.సూ. 21/27)

10. ఏవం ప్రకుపితానాం ప్రసరతాంచ వాయోః విమార్గ గమనాటోపౌ, ఓషశోష పరిదాహధూమాయనాని పిత్తస్య,అరోచకాఽవిపాకాంగ సాద చ్ఛర్ది శ్చేతి శ్లేష్మణో లింగాని భవంతి। (సు. సూ. 21/24)

11 లింగానాం దర్శనం స్వేషాం అస్వాస్థ్యం రోగసంభవః। (అ. హృ. సూ. 12/24)

12. కుపితానాం హి దోషాణాం శరీరే పరిధావతాం।
యత్రసంగః ఖవైగుణ్యాత్ వ్యాధి స్తత్రోపజాయతే॥
(సు. సూ. 24/10)

13. వృద్ధస్తు కురుతేఽనిలః।
కార్శ్య కార్ష్ణ్యోష్ణ కామిత్వం కంపానాహ శకృత్ గ్రహాన్।
బల నిద్రేంద్రియ భ్రంశ ప్రలాపభ్రమ దీనతాః॥
(అ. హృ. సూ. 11/6)

స్రంస వ్యాసవ్యథః స్వాప సాదరుక్ తోద భేదనం।
సంగాంగ భంగసంకోచ వర్తహర్ష ణ తర్పణా॥
కంప పారుష్య సౌషిర్య శోషస్పందన వేష్టనం।

స్తంభః కషాయో రసతావర్ణః శ్యావారుణోఽపివా॥
కర్మాణి వాయో ... ... ..। (అ.హృ.సూ. 12/49-50)
చూడు (సు. సూ. 15/15) (చ.చి. 28/20-22)

14. లింగం క్షీణేఽనిలేఽంగస్య సాదోల్పం భాషితే హితమ్।
(అ. హృ. సూ. 11/15)

తత్ర వాతక్షయే మందచేష్టతా అల్పవాక్త్వం అప్రహర్షో మూఢ సంజ్ఞతా చ। (సు సూ. 15/9)

15. పీత విణ్మూత్ర నేత్రత్వక్ క్షుత్ తృట్ దాహాల్ప నిద్రతాః।
పిత్త .. . ।
. పిత్తస్య దాహరాగోష్మ పాకతా।
స్వేదః క్లేదః స్రుతిః క్రోధః సదనం మూర్ఛనం మదః।
కటుకామ్లౌ రసౌ వర్ణ పాండురారుణ వర్జితం॥
(అ. హృ సూ. 12/51-52)

పిత్తవృద్ధౌ పీతావభాసతా సంతాపః శీతకామిత్వ మల్పనిద్రతా మూర్ఛాబలహాని రింద్రియ దౌర్బల్యం పీతవిణ్మూత్ర నేత్రత్వం॥
(సు. సూ. 15/15)

16. పిత్తే మందోనలః శీతం ప్రభా హానిః . .. ।
(అ. హృ. సూ. 11/16)

పిత్తక్షయే మందోష్మాగ్నితా నిష్ప్రభత్వం చ॥
(సు. సూ. 15/9)

స్తంభశైత్యా నియతతోద దాహారోచకా విపాకాంగ పారుష్య కంప గౌరవ నఖనయన శౌక్ల్యాదిభిః పిత్తం॥ (అ సం.సూ. 19)

17. శ్లేష్మాగ్ని సదన ప్రసేకాలస్య గౌరవం
శ్వైత్య శైత్య, శ్లథాంగత్వం శ్వాసకాసాతి నిద్రతా।
(అ.హృ. సూ. 11/7)

చూడు. అష్టాంగ హృదయం సూత్రస్థానం ( 12/52 )

(అ. సం. సూ. 16)

18 ... ... ... .. కఫే భ్రమః ।

శ్లేష్మాశయానాం శూన్యత్వం హృద్ద్రవః శ్లథసంధితా ॥

(అ.హృ సూ 11/16)

చూడు. (అ.హృ.సూ. 19; సు సూ. 15/9)

19. ఓజస్తు తేజో ధాతూనాం శుక్రాంతానాం పరం స్మృతం ।

(అ.హృ. సూ. 11/37)

ఓజః సోమాత్మకం స్నిగ్ధం శుక్లం శీతం స్థిరం సరం।

వివిక్తం మృదు మృత్స్నంచ ప్రాణాయతన ముత్తమం ॥

దేహః స్సావయువ స్తేన వ్యాప్తో భవతి దేహినాం॥ (సు. సూ.15/22)

తత్ర రసాదీనాం శుక్రాంతానాం ధాతూనాం

యత్ పర స్తేజః తత్ ఖలు ఓజః । తదేవ బల మిత్యుచ్యతే ।

... తత్ర బలేన స్థిరోపచిత మాంసతా సర్వచేష్టా స్వప్రతిఘాతః

స్వరవర్ణ ప్రసాదో బాహ్యానా మభ్యంతరాణాంచ కరణానాం ఆత్మ

కార్య ప్రతిపత్తి ర్భవతి । (సు.సూ. 15/22)

20. ప్రాణాశ్రయోజనో అష్టౌ బిందవో హృదయాశ్రితా।

యత్ పరస్యోజసః స్థానం తత్ర చైతన్య సంగ్రహః।

హృదయం మహాదర్థశ్చ . .. . (చ. సూ. 30/7)

యస్య నాశాత్తు నాశో స్తి ధారి యత్ హృదయాశ్రితమ్ ।

(చ. సూ. 30/11)

21. తావదేవ పరిహీణాః (అర్ధాంజలి) శ్లేష్మిక స్యోజసః (చ. శ్లో. 8)

దశమూల శిరా హృత్ స్థా తాః సర్వం సర్వతో వపుః ।

రసాత్మకం వహం త్యోజః తన్నిబద్ధం హి చేష్టితం ॥

(అ.హృ.శా. 3/17)

తత్ర రసాదీనాం శుక్రాంతానాం ధాతూనాం యత్పర స్తేజః।

తత్ ఖల్వోజః తదేవ బలమి త్యుచ్యతే .. ॥ (సు సూ. 15/22)

22. వ్యాధిక్షమత్వం వ్యాధిబల విరోధిత్వం వ్యాధ్యుత్పాదక
ప్రతిబంధకత్వమితి యావత్॥ (చక్రపాణి చ. సూ. 18/7)

23. న చ సర్వాణి శరీరాణి వ్యాధిక్షమత్వే సమర్థాని భవంతి।
... శరీరాణి చాతి స్థూలాతికృశా న్యనివిష్ట
మాంసశోణితాస్థీని దుర్బలా న్యసాత్మ్యాహారోపచితా న్యల్పా
హారా ణ్యల్పసత్త్వాని భవంతి అవ్యాధిసహాని । (చ. సూ. 18/7)

24 ఓజః క్షీయతే కోప క్షు ద్ధ్యాన శోక క్రమాదిభిః ।
(అ.హృ. సూ. 11/36)

వ్యాయామోఽనశనం చింతా రూక్షాల్ప ప్రమితాశనం ।
వాతాతపౌ భయం శోకః రూక్షపానం, ప్రజాగరః ।
కఫశోణిత శుక్రాణాం మూలానాం చాతివర్తనం।
కాలో భూతోపఘాతశ్చ జ్ఞాతవ్యా భయహేతవః ॥
(చ.సూ. 18/86-88)

అభిఘాతాత్ క్షయాత్ కోపాత్ శోకాద్ధ్యాన శ్రమాత్ క్షుధః ।
ఓజః సంక్షీయతే హ్యేభ్యో ధాతుగ్రహణ నిస్సృతం ।
(సు. సూ. 15/24-25)

25. తస్య విస్రంసో వ్యాపత్ క్షయ ఇతి లింగాని వ్యాపన్నస్య భవంతి।
సంధి విశ్లేషో గాత్రాణాం సదనం దోషచ్యవనం క్రియా సన్నిరో
ధశ్చ విస్రంసే।

26. స్తబ్ధగురు గాత్రతా వాతశోఫో వర్ణభేదో (సు. సూ 15/26)
గ్లాని స్తంద్రా నిద్రాచ వ్యాపన్నే। (సు.సూ. 15/28)

27. మూర్ఛా మాంసక్షయో మోహః ప్రలాపో మరణ మితి చ క్షయే।
(సు. సూ. 15/2-28)

బిభేతి దుర్బలోఽభీక్ష్ణం ధ్యాయతి వ్యథితేంద్రియః।
దుశ్ఛాయో దుర్మనో రూక్షో భవేత్ క్షామశ్చ తత్ క్షయే॥
(అ.హృ.సూ. 11/40)

28. బలం హ్యలం నిగ్రహాయ దోషాణాం

29. దోషస్య దూష్యేణ రక్తాదినా సంసర్గో దోషదూష్య సం
(చక్రపాణి. చ.ని. 19.9)

తథావిధ దోషదూష్య సంమూర్ఛనా విశేష ...్యః।
(మధుకోశ. మా.ని. 1/9)

... దోషదూష్య సంమూర్ఛనావస్థాజన్య ... ॥
(చక్రపాణి. చ.ని. 1/18)

30. ప్రతిరోగమితి క్రుద్ధా రోగాధిష్ఠాన గామినీ।
రసాయనీః ప్రపద్యాశు దోషాన్ దేహే వికుర్వతే॥
(అ. హృ. ని. 1/23)

31. కుపితానాం హి దోషాణాం శరీరే పరిధావతాం।
యత్ర సంగః ఖవైగుణ్యా వ్యాధి స్తత్రోపజాయతే॥
(సు. సూ. 24/11)

32. అత ఊర్ధ్వం స్థానసంశ్రయం వక్ష్యామః। .. ఏవం ప్రకుపితాః తాం స్తాన్ శరీర ప్రదేశా నాగమ్య తాంస్తాన్ వ్యాధీన్ జనయంతి తేషా మేవ అభినివిష్టానాం పూర్వరూప ప్రాదుర్భావః . తత్ర పూర్వరూపగ తేషు చతుర్థః క్రియాకాలః॥ (సు సూ. 21/33)

స్థాన సంశ్రయిణః క్రుద్ధాః భావి వ్యాధి ప్రబోధకం।
దోషాః కుర్వంతి యల్లింగం పూర్వరూపం తదుచ్యతే॥
(చక్రపాణి. చ. ని. 1/23)

33. ... .. ప్రాగ్రూపం యేన లక్ష్యతే।
ఉత్పిత్సు రామయోదోష విశేషేణానధిష్ఠితః।
లింగ మవ్యక్త మల్పత్వాత్ వ్యాధీనాం తద్యథాయథమ్।
(మా. ని. 1/5-1)

34. ద్వివిధం హి పూర్వరూపం భవతి సామాన్యం విశిష్టం చ।
(మధుకోశ. మా.ని. 1/5-9) చక్రపాణి.

తత్ర సామాన్యం యేన దోషదూష్య సంమూర్ఛ్ నావస్థా జనితేన భావిజ్వరాది వ్యాధిమాత్రం ప్రతీయతే, న తు వాతాది జనితత్వాది విశేషః॥ (మధుకోశ)

యత్తు పూర్వరూపం దోషదూష్య సంమూర్ఛనావస్థా నియతం।
తత్ వ్యాధి మాత్రస్య గమకం న తద్దోష విశేషం గమయతి॥
(చక్రపాణి. చ ని. 1/8)

35. విశిష్ట ప్రాగ్రూప మేవ లింగ మవ్యక్త మల్పత్వాత్ వ్యాధీనాం తద్వ్యథాయథం। (మధుకోశ మా.ని. 1/5)
అవ్యక్తం లక్షణం తేషాం పూర్వరూపమితి స్మృతమ్॥
(చ చి. 11/12)

36. అత ఊర్ధ్వం వ్యాధే ర్దర్శనం షష్ఠ్యాయః। శోఫార్బుదగ్రంథి విద్రధి విసర్ప ప్రభృతీనాం ప్రవ్యక్త లక్షణతా జ్వరాతిసార ప్రభృతీనాం చ, తత్ర పంచమః క్రియాకాలః॥ (సు సూ. 2 /34)
తదేవ వ్యక్తతాం యాతం రూపమిత్యభిధీయతే।
సంస్థానం వ్యంజనం లింగం లక్షణం చిహ్న మాకృతిః ॥ (మా.ని.)
ప్రాదుర్భూత లక్షణం పునః లింగం। (చ.ని. 1/9)

37. ఆగంతుం శమయే ద్దోషం స్థానినం ప్రతికృత్యవా।
(అ.హృ సూ. 13/21)

38. ప్రకృత్యా హేతుభూతయా సమః కారణానురూపః సమవాయః।
కార్యకారణ భావ సంబంధః ప్రకృతి సమ సమవాయః। కారణానురూపం కార్య మిత్యర్థః యథా శుక్లతంతు సమవాయారబ్ధస్య శుక్లత్వం. (మధుకోశ. మా. ని. 1/14)

తత్ర యదా వాయుపిత్తయోః సంసర్గ స్తదా శోషణాత్మకతయా స్వభావ సదృశేన పిత్తేన వాయుః సమవేత ఇతి ప్రకృతి సమవేత ఉచ్యతే। (డల్హణ. సు. సూ.21/38)

39. వికృత్యా హేతుభూతయా విషమః కారణానాం రూపః
సమవాయో వికృతివిషమ సమవాయః ।
యథా హరిద్రా చూర్ణ సంయోగజం లోహిత్యమితి
(మధుకోశ. మా. ని. 2/14)

యదాతు పిత్తశ్లేష్మణో స్సంయోగ స్తదా పిత్త ముష్ణం శీతేన శ్లేష్మణాయూ క్తం స్వభావ విపరీతేన సమవేత ఇతి వికృతి విషమ సమవేత ఉచ్యతే॥ (అల్హాణ. సు.సూ. 21/38)

40. ఎ) వాతలక్షణాలు:- మాధవనిదాన - వాతవ్యాధి (10/21)
(చ.చి. 28,6. సం. ని. 15)

ఎ) పిత్తలక్షణాలు :- (అ. సం. సూ. 19)

ఎ) కఫలక్షణాలు :- (అ. సం. సూ. 19)

అ.హృ సూ. 10/5-22, సు సూ. 15/11-18. చ.సూ 18/64-72)

యస్య హి వ్యాధేః దోషదూష్య ప్రకృతి దేశకాల బల సామ్యం భవతి, మహా చ్చ హేతులింగబలం .. । (చ. వి. 8/10)

41. ఇహ ఖలు నిదానదోష దూష్య విశేషేభ్యో వికార విఘాత భావా భావ ప్రతివిశేషా భవంతి ... .. ... ... ... ...
విశేషాభివృత్తి హేతుర్భవత్యుక్తః॥ (చ.ని. 4/7)

42. అత ఊర్ధ్వం ఏతేషాం అవదీర్ణానాం వ్రణభావ మాపన్నా నాం షష్ఠః క్రియాకాలః జ్వరాతి సారప్రభృతీనాం చ దీర్ఘకాలానుబంధః, తత్రా ప్రతిక్రియమాణే అసాధ్యతా ముపయాంతి। (సు.సూ 21/35)

43. వ్యాధుల అసాధ్యలక్షణాల వివరణవలన ఈవిధమైన వికృతులను గమనింపవచ్చును.

44. ఉపద్రవస్తు ఖలు రోగోత్తరకాలజో రోగాశ్రయో రోగ ఏవ స్థూలో అణుర్వా, రోగాత్ పశ్చాత్ జాయతే ఇత్యుపద్రవ సంజ్ఞః।
(చ.చి 20/40)

45. తత్ర ప్రధానో వ్యాధిః వ్యాధేః గుణభూత ఉపద్రవః .. ..
. .. ... . ... ...
.. తస్మాదుపద్రవం త్వరమాణోఽభిబాధేత ॥ (చ.చి. 21/40)

46. బలాధిష్ఠాన మారోగ్యం ఆరోగ్యార్థః క్రియాక్రమః॥

47. పుష్పం యథా పూర్వరూపం ఫలస్యేహ భవిష్యతః।
తథా లింగ మరిష్టాఖ్యం పూర్వరూపం మరిష్యతః ॥
(చ ఇం. 1/3, 2/3)

48 దోషాణామపి బాహుల్యాత్ రిష్టాభాసః సముద్భవేత్ ॥
(అ.హృ.శా. 5/3)

మిథ్యాదృష్ట మరిష్టాభ మనరిష్ట మజానతా।
అరిష్టం వ్యాప్య సంబద్ధ మేతత్ ప్రజ్ఞాపరాధజం॥ (చ.ఇం. 2/9)

49. ఉదర్కః ఉత్తరకాలీనఫలం। (చక్రపాణి)

50 దృష్ట్వా తేషు చ దోషేషు యస్యాపి వినివర్తతే।
స్వల్పేనా ప్యపచారేణ తస్య వ్యావర్తతే పునః ॥
చిరకాల పరిక్లిష్టం దుర్బలం హీనతేజసం।
అచిరేణైవ కాలేన స హంతి పునరాగతః॥ (చ.చి. 3/33-34)

51. అథవాపి పరీపాకం ధాతుష్వేవ క్రమాత్ మలాః।
యాంతి జ్వర ముపర్వంతః తే తథాప్యుపకుర్వతే॥
ఏవమన్యేఽపి చగదా వ్యావర్తంతే పునర్గతాః ॥
(చ.చి. 3/336-338)

ఉత్తాన మథ గంభీరం ద్వివిధం తత్ ప్రచక్షతే।
త్వఙ్మాంసాశ్రయ ముత్తానం గంభీరం త్వంతరాశ్రయమ్ ॥
(చ.చి. 26/26)

అంతరాశ్రయమితి త్వఙ్మాంస వ్యతిరిక్త గంభీర ధాత్వాశ్రయం ।
(చక్రపాణి)

52. శేషత్వాదాయుషో యాప్యః అసాధ్యం పథ్యసేవయా ।
లబ్ధాల్పసుఖ మల్పేన హేతునాశ ప్రవర్తకం॥ (చ.సూ. 10/17-18)
నిదానార్థకరో రోగో రోగస్యాప్యుపజాయతే ...... తద్యథా
జ్వరసంతాపాత్ .. ...। (మాధవనిదాన 1/15)

53. నిరామో విశదో రూక్షో నిర్విబంధోఽల్పవేదనం।
విపరీతగుణైః శాంతిం స్నిగ్ధై ర్యాతి విశేషతః॥

... ... .. ... . ... ...

పక్వం స ఏవ విజ్ఞేయః భేదవాన్ వక్త్రశుద్ధికృత్ ॥
(అ.సం.సూ. 21) మధుకోశ. మా.ని. 1/4)

... మలపాకాత్ విముంచతీతి వ్యవస్థితః వికల్పః॥
(మధుకోశ. మా.ని.)

54. ధాతుపాకాత్ ఘ్నంతి .. ... ...। (మా.ని. 2/83)

55. నిద్రానాశో హృది స్తంభో విష్టంభో గౌరవారుచిః॥
అరతి ర్బలహానిశ్చ ధాతూనాం పాకలక్షణం
సంబాధ్యమానో హృది నాభిదేశే గాత్రేషువా పాకరుజాన్వితేషు।
వ్రీడా జ్వరార్తో అంగులిభిశ్చ గచ్ఛేత్ సధాతు పాకః కథితో
భిషగ్భిః॥

నాభేరూర్ధ్వం హృదేరధస్తాత్ పీడితే చేద్వ్యథా భవేత్।
ధాతోః పాకం విజానీయాత్ అన్యధాతు మలస్య చ॥
(భా.ప్ర.మ. ఖండ. 1/536)

56. సాధ్యోఽసాధ్యఇతి వ్యాధిః ద్విధా తౌతు పునర్ద్విధా।
సుసాధ్య కృచ్ఛ్రసాధ్యశ్చ యాప్యాయశ్చానుక్రమః॥
(అ.హృ. సూ. 1/26-30)

57. సర్వౌషధక్షమే దేహే యూనః పుంసో జితాత్మనః।
అమర్మగో అల్పహేత్వగ్రరూప రూపోనుపద్రవః॥

అతుల్యదూష్య దేశర్తు ప్రకృతిః పాదసంపది।
గ్రహేష్వను గుణే ష్వేక మార్గో నవఃసుఖః॥ (అ.హృ.సూ. 1)

58. శస్త్రాదిసాధనో కృచ్ఛ్రః సంకరే చ తతో గదః॥

59. శేషత్వాదాయుషో యాప్యః పథ్యాభ్యాసాద్విపర్యయే ।

60. అనుపక్రమ ఏవస్యాత్ స్థితో౽త్యంత విపర్యయే।
ఔత్సుక్యమోహారతికృత్ దృష్టరిష్టోక్షు నాశనః॥
(అ.హృ.సూ. 1/30-33) (చ.సూ. 10/11-20)

61. నిత్యం శరీరస్య క్షణిక త్వేన గచ్ఛతేతి నిత్యగః (ఆయుః)
(చక్రపాణి. చ సూ. 1/42)

62. ...... ప్రకుపితాశ్చ వాతపిత్తశ్లేష్మాణః .. పరి పక్వాశ్చ ధాతవః
... .. తాన్ మతే సంచక్ష్మహే ॥ (చ.శా. 9/1)

63 న మృతస్యాత్మ లింగాని తస్మాదాహుర్మ హర్షయః ।
శరీరం హి గతే తస్మిన్ శూన్యాగార మచేతనం ।
పంచభూతావశేషత్వాత్ పంచత్వం గత ముచ్యతే॥
(చ శా. 2/72)

64. . తస్మా దుభయ మస్తి కాలే మృత్యు రకాలేచ .. .. ॥
(చ. శా. 6/28)

.. యథా కాలం .. తథా ఆయుశ్ శరీ రోపగతం బలవత్
ప్రకృత్యా యథావదుప చర్యమాణం స్వప్రమాణ క్షయాదే వావ
సానం గచ్ఛతి। స మృత్యుకాలే ... పశ్యామ ఇతి ॥
(చ. వి. 3/38)

65. మరణం ప్రాణినాం దృష్టం ఆయుః పుణ్యోదయ క్షయాత్ ।
తయోరప్యక్షయాదృష్టం విషమా పరి హారిణామ్॥ (అ. హృ )

# 7 వ అధ్యాయము

## రోగస్వరూపము- నిరూపణము

శరీరంలో దోషదూష్య సమ్మూర్ఛన జరిగిన క్షణంనుంచి రోగల క్షణాలు ఒకదాని వెంట ఒకటిగా క్రమంగా వ్యక్తమవుతూ ఉంటాయి ఈవికారలక్షణ సమూహాన్నే "రోగం" అని పిలుస్తారు.(1) దీనినే"దోష దూష్య సంమూర్ఛనా జన్య ఆభ్యంతర వికృతి పరంపరా వ్యాధిః॥ అనేది స్పష్టం చేస్తుంది.(2) త్రిదోషాలు, సప్తదూష్యాలు(ధాతు,వివిధ స్రోతస్సు లు, అగ్నులు వీటి వికృతి రోగోత్పత్తికి సూక్ష్మమూలకారణాలు. ఈ విధ మైన ఒక్కొక్క సూక్ష్మ మూలకారణము అనేక రోగలక్షణాలను వ్యక్తం చేస్తూఉంటుంది. ఈరోగలక్షణాలు స్వతఃగా కార్యరూపాలేగాని రోగాల మూలకారణాలు మాత్రం గావు. అందుచేతనే రోగములు కేవలం 'లక్షణ సముచ్చయములే' కాక అనేక అభ్యంతర వికృతితో గూడినట్టివై ఉన్న విగా తెలుసుకోవాలి. (3)

గోత్పత్తికి సూక్ష్మకారణభూతాలయిన వివిధదోష, దూష్య, స్రోతోగ్నుల వికృతి శరీరంలో ఒకేచోట ఒకేసమయంలో జరగాలని కాని ఈవికృతి ఒక్కసారిగా నివారణ జరగాలనే నియమంగాని ఏదీ లేదు. ఆయా దోషధాతువుల వి-్ృతి ఫలితంగా రోగం శరీరంలో ఏదిచో ఒక స్థానంలోగాని అనేక స్థానాల్లోగాని సూక్ష్మ (అణు)రూపంలో ప్రారం భమై క్రమంగా అభివృద్ధి చెందుతూ వివిధస్థానాల్లో బలంగా నాటుకొని శారీరకబలాన్ని నాశనం చేస్తూ తనబలాన్ని పెంచుకుంటూ ఉంటుంది.(4) తగిన చికిత్స చేసినా కూడా సర్వరోగలక్షణాలూ-బాధలూ ఒక్కసారిగా కాకుండా క్రమేణ నెమ్మదిగా నివారింపబడతాయి. ఈవిధంగా శరీరంలో రోగముల ప్రాదుర్భావం-దాని ఉప శమనం (నాశం) ఒక్కసారిగా అకస్మాత్తుగా జరిగే సంఘటనలుగా గాకుండ క్రమంగ వివిధావస్థలతో కూడిన సక్రమదోషదూష్య పరిణామంగా గుర్తించుకోవాలి. ఈరోగోత్పత్తి రోగశాంతుల మధ్యకాలంలో శరీరంలో అగపడే రోగస్వరూపాన్ని ఒక

విశేషరూపంగా పరిగణించి వ్యక్తి-శక్తి- రాక్షస ఇత్యాది పేర్లతో ఆయా రోగలక్షణాలకు అనుసారంగా భీకరరూపాన్ని రోగాలకు ఆపాదించి వివరించి వర్ణించడాన్ని కూడ మనం కొన్ని ప్రాచీన గ్రంథాలలో గమనిస్తాం! (5)

## రోగం - దాని పర్యాయపదాలు

రోగం పాప్మా, జ్వర, వ్యాధి, వికార, దుఃఖ, ఆమయ, యక్ష్మ, ఆతంక, గద, ఆబాధ అనే వివిధ పర్యాయపదాలు కల్గి యున్నది. (6) ఇందలి ప్రతి ఒక్క పదం రోగంలోని ప్రత్యేక స్వభావాన్ని తెలియ చేస్తుంది. (7)

(1) రోగం - శరీరానికి బాధను, నొప్పిని కల్గించేది కావడం మూలంగా 'రోగం' అంటారు. (రుజాకర్తృత్వాత్ రోగ ఇత్యుచ్యతే।) ప్రతి ఒక్క రోగానికి ఒక్క ప్రత్యేక బాధ నొప్పి ఉండనే ఉంటాయి. ఈ బాధ నొప్పి శరీరాన్ని బాధించవచ్చు లేదా మనస్సును కూడ ఆక్రమించుకోవచ్చు.

(2) పాప్మా - పాపం చేత, అధర్మం చేత జనించినది గావున (పాప్మా పాపజన్యత్వాత్ పాప్మా) పాపం అంటే అధర్మ ఫలం. పరపీడ, పర ద్రోహం మొదలైనవి పాప కారణాలు. ఇవి పూర్వజన్మకూ ఈజన్మకూ కూడ సంబంధించి ఉండ వచ్చు. ఈపాపాలు ఆచరించే వారికి రోగోత్పత్తి జరుగుతుంది. ఈపై అర్థమే గాకుండ 'పాప్మా' అనే పదానికి మరొక విధంగా అర్థం చెప్పుకోవచ్చు ధర్మంఅంటే నియమము. దానికి విరుద్ధంగా మిథ్యాహారవిహారాదులు, ప్రజ్ఞాపరాధం మొదలగునవి ఆచరించడం వలన రోగాలు ఉత్పన్నమవుతాయి. ఇట్లా ఆచరించడం అధర్మం. ఎందుకంటే శరీరారోగ్యానికి హితమైన ఆహార విహారాదులు సేవించడమే ధర్మం. ధర్మవిరుద్ధమైన ఆచరణవలన పాపంవలన ఉత్పన్న మయ్యేది కావున దీనిని 'పాప్మా' అంటారు.

(3) జ్వరము - సంతాపాన్ని బాధను కల్గించేది కావున జ్వరతి సంతాపయతీతి జ్వరః అని పిలుపబడుతుంది. సర్వరోగాలు శరీరానికి ఇంద్రియాలకూ, మనస్సుకూ అనేక విధాలుగా బాధను కల్గిస్తూ ఉంటాయి.

(4) వ్యాధి :- అనేకవిధములైన దుఃఖాలను తెచ్చేదికావున వ్యాధి అంటారు.(వివిధం దుఃఖం ఆదధాతి ఇతి) శారీరక, మానసిక, ఆధి భౌతిక, ఆధి దైవికము లని వ్యాధులు అనేక విధాలుగా సంప్రాప్తిస్తూ ఉంటాయి. శబ్దస్తోమ మహానిధిలో ఈ వ్యాధిని 'విశేషేణ ఆధీయతే అభి నివేశ్యతే ప్రతీకారాయ మనః ఇతి వ్యాధిః' అనే ఈ వివరణ రోగనివా రణలో మనస్సుయొక్క ప్రాధాన్యమును స్పష్టంచేస్తుంది.

(5) దుఃఖము:- రోగసమయంలో శరీరంలో ఉండే వేదనలు అన్ని యును ప్రతికూలమైనవే గావున రోగాన్ని దుఃఖం అంటారు.

(6) వికారము :- దోష ధాతు మలములు ప్రాకృత ఆరోగ్యస్థితిని నాశనం గావించి వికృతిని కల్గించడం మూలంగా రోగాలను 'వికారం' అని కూడ అంటారు.

7) ఆమయము :- అనేకమైనరోగాలు ముఖ్యంగ ఆమసంచయము వల్లనే కల్గుతాయి. అందువల్లనే రోగాలు 'ఆమయము' లని పిలువబడ తాయి. 'ప్రాయేణ ఆమసముత్థత్వేన ఆమయః.'

8) యక్ష్మ - అంటే రోగసమూహం. ఒకటి కంటె ఎక్కువగా రోగములుగాని రోగలక్షణములుగాని యున్నచో 'యక్ష్మ' అంటారు.

9) ఆతంకము - రోగి ఈకాలంలో తనకు ఇష్టమైన ఆహారవిహా రాదులను అనుభవించలేక బాధలకు గురి అవుతాడు గావున రోగానికి 'ఆతంక' మని పేరు. ('తకి కృచ్ఛ్రజీవనే, ఆతంకః-కృచ్ఛ్ర జీవనం కరోతి')

10) ఆబాధము :- నిరంతరం శరీరానికి మనస్సుకు బాధను కల్గిం చడం మూలంగా 'ఆబాధ' మంటారు.

11) గదము :- ఒకటికంటె ఎక్కువగా రోగకారణాలవలన జనిం చిన సర్వరోగాలూ 'గదములు' అనబడతాయి. దోష, దూష్య, అగ్ని స్రోతస్సు - ఈవిధంగా రోగాలకు అనేక కారణా లుంటాయి.

12) దోషము - దోష మనే శబ్దాన్ని రోగపర్యాయంగా కూడ పరిగణించ వచ్చు. దుష్టిని కలుగజేసేది దోషం. రోగాలు కూడ శరీర

సౌకర్యాన్ని కలుగజేస్తాయి కావున వాటిని కూడ దోషాలు అనే పిలు స్తారు. (8)

## రోగసంకర - లింగసంకరం

ఏక కాలంలో శరీరంలో ఒక్కే రోగం జనించాలనే నియమం ఏమీ లేదు. ఒకే సమయంలో ఎన్నో రోగాలు బాధలూ కల్గుతూ ఉండడం మనం గమనిస్తూనే ఉన్నాం. ఈ విధంగా వివిధరోగాలు కూడి ఉండ టాన్ని 'రోగసంకరం' అంటారు. ఈ స్థితిలో ప్రత్యేక రోగ కారణాలతో జనించి స్ఫుటలక్షణాలు కల్గి క్రమేణ శాంతించే రోగాల్ని ప్రధానవ్యాధి అనియూ, మరియు అప్రధాన కారణాలతో గూడి సామాన్య లక్షణాలు కల్గిన బలహీనమైన వ్యాధిని అప్రధాన మనియూ, 'గౌణ' మనియూ పిలుస్తారు. (9)

కొన్ని రోగాలు ఏక కాలంలో ఒకేవ్యక్తిలో జనించినప్పటికిన్ని వాటి రోగతీవ్రతలోనూ లక్షణాలలోనూ ఎంతో తేడా ఉంటుంది. ఇంసు కొన్ని లక్షణాలు సువ్యక్తమై బలిష్ఠంగానూ, మరికొన్ని అవ్యక్తమై దుర్బలంగానూ జనిస్తాయి. ఈపరిస్థితినే 'లింగసంకరం' అంటారు.

ఈరోగ సంకరకాలంలో ప్రధానరోగానికీ, బలిష్ఠమైన తీవ్రలక్ష ణాలకు ముందుగా చికిత్స చేయాలి. ఈప్రధాన సూత్రాన్ని వైద్యుడు అను సరించాలి.

## వ్యవచ్ఛేదక నిదానం లేదా సాపేక్ష నిదానం

ప్రతి ఒక్క వ్యాధికి నిర్దిష్టమైన ప్రత్యాత్మ లక్షణాలు ఉన్నప్పటి కిన్ని కొన్ని లక్షణాలు మాత్రం సామాన్యంగా ఒకటి కంటే ఎక్కువ వ్యాధులలో అగపడుతూ ఉంటాయి. ఇట్టి పరిస్థితులలో వ్యాధి ఇది, అని నిశ్చయంగా చెప్పడానికి వీలుగాదు. అటువంటి సమయంలో రోగనిర్ణయ సాధనాలయిన నిదాన, పూర్వరూప, రూపసంప్రాప్తి, ఉపశయాదుల సహాయం పొంది అనుమానాస్పద రోగాలు, వాటి లక్షణాలు, వాటి స్వభావం మొదలగు విషయాల్ని ఒకదానితో ఒకటిపోల్చి పిదప ఒకనిశ్చి తాభిప్రాయానికి రావడాన్ని 'సాపేక్ష' లేదా 'వ్యవచ్ఛేదక నిదానం' అని

అంటారు ఉదాహరణకు రక్తంతో కూడిన మూత్రం రక్త పిత్తం, ప్రమేహం, అశ్మరి, మూత్ర మార్గంలోని రాయి (శల్యం) మొదలగు రోగాల్లో కనబడుతుంది. ఒకానొక రోగిలో పై రక్తమూత్రం అగుపించాక అతనికి ఈపై నాల్గు వ్యాధులలో ఏవ్యాధి సంప్రాప్తమైనదో తులనాత్మకంగా పరీక్షించి, నిర్ణయించడానికి వ్యవచ్ఛేదక లేదా ఈసాపేక్ష నిర్ణయం ఎంతో సాయపడుతుంది.

## రోగముల సంఖ్య అనిర్దిష్టం -

రోగోత్పత్తికి కారణభూతాలైన ప్రకృతి(త్రిదోషాలు) అధిష్ఠానములు (ధాతువులు - స్రోతస్సులు), లింగములు (లక్షణాలు), ఆయతనములు (బాహ్య రోగకారణాలయిన మిథ్యాహార విహారాదులు) వీటి వికల్పములు భేదములు ఇవన్నియూ అసంఖ్యాకములు కావడంచేత మానవునికి సంభవించే రోగముల సంఖ్య కూడ అసంఖ్యేయమే. దేశం, కాలం, వయస్సు. ప్రకృతి, దేహం, సత్త్వం మొదలైన భావముల ప్రభావం చేత రోగములు సంఖ్యలోను, బలములోను వైవిధ్యమును తేడాను పొంది ఉంటాయి. (10)

## రోగ సంఖ్యానిర్దేశం - నానాత్మజవ్యాధులు.

రోగోత్పత్తిలో త్రిదోషములే ప్రధాన కారణం అవడంచేత అవి వికృతి చెందినపుడు వాటి వికృతస్థితివలన శరీరంలో వ్యక్తమయ్యే లక్షణాలను అన్నింటినీ క్రోడీకరించి, సంగ్రహించి వాటికి రోగం అనీ, " వ్యాధి " అనీ పేరు పెట్టి, చరక, సుశ్రుతాది గ్రంథాలలో వాటిని విశదీకరించారు. ఈరోగ శబ్దాన్ని త్రిదోషాలకు, వాటి వికృతి వల్ల జనించే లక్షణ సముదాయానికీ కూడ కలిపి అన్వయించడం శాస్త్ర సంప్రదాయం. ఈశాస్త్ర సంప్రదాయా న్ననుసరించి వాతరోగాలు 80, పిత్తరోగాలు 40 మరియు కఫరోగాలు 20 మొత్తంకలిపితే 140 రోగాలుగా రోగసంఖ్యను నిర్దేశించారు. (11) ఈవిధంగా నిర్దేశించిన రోగాలు కేవలం ఒకొక్కొక్క లక్షణం మాత్రమే ! మిగిలినవి కొన్నిప్రత్యేక రోగాలు అవడంచేత ఆయుర్వేదంలోని లేదా మానవునికి సంభవించేవి 140 మాత్రమే అని భ్రమించకూడదు. ఆయా ప్రత్యేక దోష వికృతిచేత కల్గే ప్రత్యేక రోగములకు రోగలక్షణములకు (కేవలం తద్దోషజన్యములు) నానాత్మజరోగములనే విశిష్టమైన నామకరణం చేయడం జరిగింది.

యుగాలలోను ఋతువులలోను మార్పు వస్తున్నట్లుగానే రోగాలలో కూడ మార్పు వస్తూనే ఉంటుంది. ప్రాచీనకాలంలో గుర్తింపబడి వర్ణించబడిన అనేకరోగాలు ఇప్పుడు కనుపించనే కనిపించవు. అట్లే ఇపుడు మన మధ్యగోచరించే అనేకరోగాలు అపుడు ఉండకనూ పోవచ్చు. మరియు ఇపుడు మనమధ్య తల ఎత్తి బాధించే అనేకరోగాలు ముందు ముందు తరాలవారిని కూడ బాధిస్తాయని చెప్పనూలేము. కనుక వివిధ కాలాలు యుగాల మార్పులతో పాటు పాతరోగాలు లుప్తమై క్రొత్త రోగాలు జనిస్తూనే ఉంటాయి. (12) అందువల్ల ఏకసమయంలో సర్వ రోగాలకూ నిర్దిష్టమైన నామకరణం గావించి వాటిని వర్ణించడం సాధ్యం గాని పని. మన ప్రాచీన ఆయుర్వేద ఆచార్యులు తమ తమ సమయాల్లో-జీవితకాలంలో వివిధజన సమూహాలలో వ్యక్తమయిన వ్యాధులకు పేర్లు పెట్టి వాటి వివిధ లక్షణాలను చికిత్సను తమ తమగ్రంథాలలో వివరించారు. అందుచే ఇపుడు మనసమయంలో వ్యక్తమయ్యే రోగాలనుగురించిన వివరం ప్రాచీనగ్రంథాలలో వెదకటం, ఉన్నదని వితండవాదం గావించడం అవివేకం, మరియు మూర్ఖత్వం అనబడుతుంది గూడ. అందుచేతనే పూర్వాచార్యులు ఈవిధంగా అతిస్పష్టంగా ప్రబోధించారు. 'సర్వరోగాలకూ పేర్లు పెట్టి వర్ణించడం సాధ్యం కానిపని, పేరు తెలియనంత మాత్రాన చికిత్స చేయజాలమని వైద్యుడు వెనుకంజవేయరాదు. అసాధ్యమని భయపడనూ రాదు. రోగప్రకృతి లక్షణాలను పరీక్షించి వికృతి చెందిన దోషదూష్యాలకు తగిన చికిత్స గావించాలి,అనే చక్రుని హెచ్చరిక చేసారు. (13)

## 1. వాతనానాత్మజ రోగాలు - 80(14)

నఖభేద, విపాదిక, పాదశూల, పాదభ్రంశ, పాద సుప్తతా, వాతబుద్ధతా, గుల్ఫగ్రహ, పిండికోద్వేష్టన, గృధ్రసీ, జానుభేద, జానువిశ్లేష, ఊరుస్తంభ, ఊరుసాద, పాంగుల్య, గుదభ్రంశ, గుదార్తి, వృషణాక్షేప, శేఫస్తంభ, వంక్షణానాహ, శ్రోణిభేద, విడ్భేద, ఉదావర్త, ఖంజత్వ, కుబ్జత్వ, వామనత్వ, త్రికగ్రహ, పృష్ఠగ్రహ, పార్శ్వావమర్ద,ఉదరావేష్ట,

హృన్మోహ, హృద్ద్రవ, వక్షఉద్ఘర్ష, వక్ష ఉపరోధ, వక్షతోద, బాహుశోష, గ్రీవా స్తంభ, మన్యా స్తంభ, కంఠోద్ధ్వంస, హనుభేద, ఓష్ఠభేద, అక్షిభేద, దంతభేద, దంతశైథిల్య, మూకత్వ, వాక్సంగ, కషాయాసతా, అరసజ్ఞతా, ముఖశోష, ఘ్రాణనాశ, కర్ణశూల, అశబ్దశ్రవణ, ఉచ్చైశ్శ్రుతి, బాధిర్య, వర్త్మస్తంభ, వర్త్మసంకోచ, తిమిర, అక్షిశూల, అక్షివ్యుదాస, భ్రూవ్యుదాస, శంఖభేద, లలాటభేద, శిరోరుక్, కేశభూమిస్ఫుటన, అర్దిత, ఏకాంగరోగ, సర్వాంగరోగ, పక్షవధ, ఆక్షేపక, దండక, తమ, భ్రమ, వేపథు, జృంభా, హిక్కా, విషాద, అతిప్రలాప, రౌక్ష్యపారుష్య, శ్యావారుణావభాసతా, అస్వప్న, అనవస్థితచిత్తత్వ - ఈ యెనుబదిన్ని వాతనానాత్మజ రోగములు.

## 2. పిత్తనానాత్మజ వ్యాధులు 40 (15)

ఓష, ప్లోష, దాహ, దవథు, ధూమిక, ఆమ్లిక, విదాహ, అంతర్దాహ, అంసదాహ, ఊష్మాధిక్య, అతిస్వేద, అంగగంధ, అంగావదరణ, శోణితక్లేద, మాంసక్లేద, త్వక్దాహ, (మాంసదాహ) త్వగవదారణ, చర్మదలన, రక్తకోఠ, రక్తవిస్ఫోట, రక్తమండల, హరితత్వ, హారిద్రత్వ, నీలికా, కక్షా, కాదులా, తిక్తాస్యతా, లోహితగంధాస్యతా, పూతిముఖ, తృష్ణాధిక, అతృప్తి, ఆస్యవిపాక, గలపాక, అక్షిపాక, గుదపాక, మేఢ్రపాక, జీవాదాన, తమఃప్రవేశ, మూత్రపురీష, హారిద్రత్వ-ఇవి 40 పిత్తజ వికారాలు.

## 3. కఫనానాత్మజ వ్యాధులు 20 (16)

తృప్తి, తంద్రా, నిద్రాధిక్య, స్తైమిత్య, గురుగాత్రతా, ఆలస్యం, ముఖమాధుర్య, ముఖస్రావ, శ్లేష్మోద్గిర్ణం, మలాధిక్యం, బలాధిక్య(బలాసక) సౌపక్తి, హృదయోపలేప, కంఠోపలేప, ధమనీప్రతిచయ, గలగండ, అతిస్థౌల్యం, శీతాగ్ని, ఉదర్ద, శ్వేతావభాసతా, మూత్రనేత్ర పురీషములు తెల్లగనగుట - ఇవి 20 కఫనానాత్మజ వికారములు.

## రోగముల నామకరణము - వాటి క్రమము

వివిధరోగాలకు నామకరణం చేయడంలో అనుసరింపదగిన విధానం గాని, క్రమంగాని ఏదీకూడ నిర్దిష్టంగా మన గ్రంథాలలో కనబడదు అయితే వర్ణించిన వివిధరోగముల పేర్లను విమర్శించి చూస్తే మన పూర్వాచార్యులు అనుసరించిన పద్ధతి ద్యోతక మవుతుంది. వాటిలో -

ప్రధానలక్షణాత్మక నామం - శాస్త్రంలో వివరించిన అనేక రోగాల పేర్లు ఈ ఆధారం పైనే ఒసంగబడ్డాయి. ఉదాహరణకు - జ్వర, పాండు, అతిసార, శ్వాస మొదలగునవి.

2. హేతుసూచక నామం .- మృద్భక్షణజ పాండువు, భూతోన్మాదం, క్రిమిజహృద్రోగం, దౌహృద ఛర్ది ఇత్యాది.

3. సంప్రాప్తి సూచకనామం - రక్తపిత్త, అమ్లపిత్త, ఆమవాత, వాతరక్త, ఊర్ధ్వవాత ఇత్యాదిరోగాలు.

4. వికృత అంగసూచక నామ :- హృద్రోగ, గ్రహణీ, శిరోరోగ, నాసారోగ ఇత్యాదులు.

5. అన్యవస్తు సాదృశ్యనామ - గుల్మరోగం, వాల్మీకం, ధనుస్తంభ, క్రోష్టుశీర్షక, కంభకామిల ఇత్యాదులు

6. పౌరాణికనామం - వేదపురాణాదులలో సూచింపబడిన వ్యక్తికిగాని, శక్తికిగాని సంబంధించిన పేర్లు. ఉదా .- రాజయక్ష్మ, భూతోన్మాదము మొదలగునవి.

7. రూఢనామం - గృధ్రసి, ఖిప్ప ఇత్యాదులు.

8. ప్రభావసూచకనామము (అన్వర్థనామములు) శతఘ్నీ దారుణక, కంఠకుబ్జ, కునఖ ఇత్యాదులు.

## రోగోత్పత్తి స్థానములు మరియు వ్యక్త(క్తి) స్థానములు -

"నిజరోగాలన్నీ కూడ మహాస్రోతస్సు (కోష్ఠం) లోనే ఉద్భవిస్తాయి-" అనేది ఆయుర్వేద మూలసిద్ధాంతాల్లో ఒకటి. సర్వరోగాలకూ త్రిదోషములే మూలకారణం. ఆ త్రిదోషములకు మహాస్రోతస్సు

(కోష్ఠం) మూలస్థానం కావడమే ఈసిద్ధాంతానికి మూలాధారం.
ఈ మహాస్రోతస్సులోని అగ్రిభాగం (ఊర్ధ్వఆమాశయం) కఫానికీ, మధ్య
భాగం (అధో ఆమాశయం) పిత్తానికీ, పక్వాశయం (అధోభాగం) వాతా
నికీ విశిష్టస్థానాలు కావడం మూలంగా వివిధ కారణాలచేత దోషసంచ
యం ఆయా స్థానాల్లోనే మొదట జరుగుతూ ఉంటుంది. ఈదోష (కుపిత)
సంచయమే ఆయా స్థానాల్లో క్రమేణ రోగంగా పరిణమిస్తుంది. అందు
వలననే కఫరోగాలన్నిటికీ ఊర్ధ్వ ఆమాశయం (ఫుప్ఫుసాలు) పిత్త
రోగాలన్నింటికీ అధో ఆమాశయం (గ్రహణి), మరియు వాత రోగా
లన్నింటికిన్నీ పక్వాశయమున్నూ ఉత్పత్తి స్థానాలుగా ప్రసిద్ధి చెందాయి.

(17) వివిధరోగాలు తమతమ ఉత్పత్తి స్థానాల్లోమాత్రమే ఉండి
వాటి లక్షణాలను వ్యక్తం చేయాలనే నియమం ఏమీలేదు. కొన్నిరోగాలు
తమఉత్పత్తిస్థానం నుండియూ కొన్ని వేరువేరు స్థానాలనుండియూ తమ
రోగలక్షణాలనువ్యక్తంచేస్తూంటాయి. ప్రత్యేకరోగంయొక్క ముఖ్యమైన
లక్షణాలు (ప్రత్యేకలక్షణాలు) ఏయే స్థానాల్లో వ్యక్తమవుతుంటాయో
అదే ఆరోగానికి వ్యక్తి (వ్యక్త) స్థానం. కనుకనే ప్రతిరోగం యొక్క
ఉత్పత్తి వ్యక్తిస్థానాలను క్షుణ్ణంగా తెలుసుకోవడం ప్రతివైద్యుని కర్తవ్య
మున్నూ. శరీరంలోని భిన్నభిన్న అంగప్రత్యంగాలన్నీ కూడ వివిధరోగా
లకు వ్యక్తి (వ్యక్త) స్థానములే. ఈ ఉద్దేశంచేతనే ఈవివిధ అంగప్రత్యం
గాలను మూడుభాగాలుగా (తరగతులుగా) విభజించి వాటికి 'త్రివిధరోగ
మార్గాలు' అని నామకరణం గావించారు. (18)

## త్రివిధరోగ మార్గములు

1. అభ్యంతర రోగమార్గం .-

ఈరోగ మార్గానికి అంతః కోష్ఠమనీ, మహాస్రోత స్సనియూ పేర్లు.
నోటినుండి మలద్వారం వరకుగల మహాస్రోతస్సు, దీనికి సంబంధించిన
ఆమాశయ, పక్వాశయ, యకృత్, ప్లీహా, తైలవర్తికా, వపావహన,
ఔదర్యకల మొదలైన ఇతర కోష్ఠాంగాలున్నూ, జ్వర, అతిసార, ఛర్ది,
అలసక, విషూచిక, కాస, శ్వాస, హిక్కానాహా, ఉదర, ప్లీహా, విసర్ప,

శోథ, గుల్మ, అర్శో విద్రధి ఇత్యాది రోగాలున్నూ ఈ మహాస్రోతో మార్గంలోనే వ్యక్తం అవుతూ ఉంటాయి. ఇవియే కాకుండ ఇంకా అనేక రోగాలకు ఈమహాస్రోతస్సు (అంతః కోష్ఠమే) ఉత్పత్తి స్థానం.

2. బాహ్యరోగ మార్గం :-

దీనినే శాఖామార్గమనీ, ధాతుమార్గమనీ కూడ అంటారు. 'శాఖా' అంటే త్వక్ (చర్మం-రసం) మరియు రక్తాది స్థాయీ ధాతువులున్నూ. ఈశాఖాదులు శరీరంలోని బాహ్యాభ్యంతర అవయవనిర్మాణానికి కారణం అయినప్పటికన్నీ కోష్ఠానికంటె బయటఉండడం మూలంగా దీనిని బాహ్య రోగమార్గంగా వర్ణించారు. గలగండ, పిడిక, అలజీ, చర్మకీల, వంషక, వ్యంగ, కుష్ఠ, విసర్ప, శ్వయథు, గుల్మ, అర్శ, విద్రధి మొదలగునవి బాహ్య రోగ మార్గంలో జనించే రోగాలు.

3. మధ్యమ రోగమార్గం -

బస్తి, హృదయం, మూర్ధము (శిరస్సు) ఇవి మర్మస్థానములు, అస్థి, సంధులు - వీటి కలయిక, కండరాలు, సిరలు, ధమనులు- ఇవి అన్నియూ మధ్యమరోగ మార్గాలు. పక్షవాతం, అంగగ్రహం, అపతానక, అర్దిత, శోష, రాజయక్ష్మ, అస్థి సంధిశూల, గుదభ్రంశము, మరియు శిరస్సు హృదయం, బస్తి - వీటిలో జనించే వివిధరోగాలు ఈ మధ్యమ రోగ మార్గంలోనికి వస్తాయి.

కొన్నిరోగాలు ఒకే రోగమార్గంలోను, మరి కొన్నిరోగాలు ఒకే సమయంలో రెండు అథవా మూడు రోగమార్గాల్లోను అభివ్యక్తం అవుతూ ఉంటాయి. కనుక రోగము, సాధ్యాసాధ్యతలు నిర్ణయించడంలో ఈ త్రివిధరోగమార్గాల జ్ఞానం ఎంతో ఉపయోగపడుతుంది.

రోగములు - వాటి వర్గీకరణం -

ప్రాచీన ఆచార్యులు వివిధ రోగాలనూ భిన్నభిన్న దృక్కోణా ల్లోంచి విభజించి వర్గీకరించారు. ఈ వర్గీకరణ లన్నింటిలోను, సుశ్రుత సంహితలోని(త్రివిధ)రోగవర్గీకరణను ఆధారంచేసికొని ఇతరవర్గీకరణాల్ని అందులో సమావేశ పరచడం శ్రేష్ఠమైన విధిగా కానవస్తుంది. (19)

త్రివిధ వర్గీకరణం :-

సాంఖ్య దర్శనంలో వివరించినట్లుగ మనుష్యునికి, ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధిదైవికములనే మూడువిధములైన దుఃఖాలు (బాధలు) సంభ విస్తూ ఉంటాయి శరీరానికి కల్గే ప్రతికూల వేదననే 'దుఃఖం' అంటారు. రోగ సమయంలో ఉత్పన్నమయ్యే లక్షణాలన్నీ ప్రతికూల వేదనలే కావ డం మూలంగా రోగాల్ని 'దుఃఖసంయోగం' అనికూడ అంటారు. ఈదుఃఖ ములు మూడు విధాలు గావున రోగాలను గూడ మూడు వర్గాలుగా చేయ వచ్చును. (20)

## ఆధ్యాత్మిక వ్యాధులు

ఆధ్యాత్మికం అంటే శరీరానికి అతి దగ్గరి సంబంధం కల్గినట్టివి అని అర్థం. శరీరోత్పత్తి, శరీరధారణ పోషణలు, దాని ఉపచయం (వృద్ధి) మొదలగునవి ఆధ్యాత్మిక విషయాలు. వీటి వికృతి వలన వ్యత్యాసం వలన జనించే రోగాలు ఆధ్యాత్మిక రోగాలు. ఈ ఆధ్యాత్మిక వ్యాధులు మూడు విధములైన 'బలములచేత' (బలం అంటే రోగకారక అంశం అని అర్థం) ఉత్పన్న మవుతూంటాయి. (21)

ఎ) ఆదిబల ప్రవృత్తములు - శరీరోత్పత్తికి శుక్రశోణితాలు [పుం స్త్రీబీజములు] అత్యంతావశ్యకం. ఈ స్త్రీపురుష బీజములు ఆరోగ్యంగా ఉంటే జనించే శరీరంకూడ ఆరోగ్యంగానే ఉంటుంది. అట్లుగాక ఈ ఈ పుంస్త్రీ బీజములు రోగభూయిష్ఠ మైనట్లయితే ఉద్భవించే శరీరం రోగభూయిష్ఠమై యుంటుంది. ఇటువంటి రోగాల్ని శుక్రశోణిత జన్య రోగాలని పిలుస్తారు. కుష్ఠం, ప్రమేహం, అర్శస్సు మొదలగునవి ఇందుకు ఉదాహరణలు. ఈ ఆదిబలవ్యాధులు మరల పితృజ (దుష్టశుక్రజ),మాతృజ (దుష్టశోణితజము) లనే రెండువిధాలు. ఈ దోషాలు ఒకేశరీరానికి సంబం ధించినట్లయితే ఆకుటుంబానికంతకూ (పుత్రపౌత్రాది సంతానానికి)ఆయా రోగాలు సంభవిస్తాయి. ఇట్లు అనేక కుటుంబాలకు సంభవించే స్వభావం గలవి గావున ఈరోగాలను కులజ వికారాలు అనికూడ పిలుస్తారు. ఇవి అసాధ్యములు. చికిత్సకు లొంగనివి.

బి) జన్మబలప్రవృత్తములు - గర్భధారణ జరిగిన సమయం మొదలు కొని శిశువు బయటకు వెలువడేవరకు గర్భిణీస్త్రీ కొన్ని ప్రత్యేక నియమాలు పాటించక పోవడంవలన గర్భస్థ శిశువునకు అనేక రోగాలు సంక్రమించే అవకాశం ఉంది. ఉదా - పంగుత్వ, జాత్యంధత్వ, బధిరత్వ, మూకత్వ మిన్మిరత్వ, వామనత్వ ఇత్యాదులు. ఈ రోగాలను జన్మబల ప్రవృత్తాలని, మాతృఅపచారజము అనియూ కూడ అంటారు. శరీరంతోపాటు జనించే రోగాలు గావున వీటిని సహజరోగాలనికూడ అంటారు. ఇవి మరల రెండు విధాలు.

1) రసకృతము :- గర్భిణి సేవించే లోపభూయిష్ఠ ఆహారం వలన కలిగే వ్యాధులు.

2) దౌహృదోపచారజము :- గర్భిణికి కల్గే కోర్కెలను (విలక్షణ మైన ఇచ్ఛ- దౌహృదములను) నెరవేర్చక నిర్లక్ష్యంచేస్తే వచ్చేరోగాలు.

సి) దోషబలప్రవృత్తము - తల్లి శరీరంనుండి వేర్పడి స్వతంత్రజీవనం ప్రారంభించిన పిదప, శరిరధారకములైన త్రిదోషాలు శిశువుసేవించే ఆహార విహారాదుల ప్రభావానికి లోనవుతాయి. పోషకర ఆహారవిహారాదులున్నూ, నిరపాయకర ఆహారాదులున్నూ ఆరోగ్యరక్షణకు ఎంతో దోహదం చేస్తాయి. కాని విపరీతగుణాలుగల ఆహారవిహారాదుల సేవనంవల్ల ఈవివిధ రోగాలు జనిస్తాయి. ఇటువంటి రోగాలనే దోషబలప్రవృత్తా లంటారు. (జన్మోత్తరకాలజ మిథ్యాహారజన్యము) ఈరోగములు ఆయాకారణాల్ని బట్టి ఉంటాయి. ఈరోగములు మరల శారీరకములని...మానసిక రోగము లని రెండు విధాలు.

## 2) ఆధిభౌతిక వ్యాధులు (శశ)

మానవుని జీవితకాలంలో అతని శరీరం బాహ్య ప్రపంచంలోని అనేక వస్తువులతో సంపర్కం పొందుతూ ఉంటుంది. ప్రపంచంలోని వస్తువులన్నీ పాంచభౌతికాలు. వీటిల్లో కొన్ని సచేతనాలు. కొన్ని అచేతనాలున్నూ. శరీరానికి వీటి సంయోగం చేత కల్గేవికారాలను [సంఘాతం

తత - కలయిక చేత] సంఘాత బలప్రవృత్త వ్యాధు అని అంటారు. ఈ సంఘాత బలప్రవృత్తి వ్యాధులు చేతనా చేతన వస్త్వనుసారంగా రెండు విధాలు.

1) శస్త్రకృత :- పదునైన, సూదిగానున్న, తీక్ష్ణమైన కత్తులు, రాళ్ళు మొదలయినవాటి వలననూ, పిడుగు, మంచు, తీక్ష్ణమైన ఎండ వేడి వలననూ కలిగే వ్యాధులు.

2) వ్యాలాదికృత :- సింహం, పులి, పాము, గ్రద్ద మొదలగు హింస్ర ప్రాణులు శరీరానికి కీడు చేయుట మొదలైన వాటి వలననూ, కీటకములు, తేలు, జెర్రి, నల్లులు, పేలు, దోమలు మొదలైనవి కరచుట వల్లనూ కలిగే రోగాలను ఆగంతుక వ్యాధులని కూడ అంటారు. బయట ప్రపంచంలోని చేతనా చేతన వస్తుసంపర్కంచేత కల్గే వ్యాధులవడంచేత వీటిని ఆగంతుజ వ్యాధులనవచ్చు. ఈ ఆగంతుక కారణాల్ని పునః నాల్గువిధాలుగా విభజించ వచ్చును. (23)

1) అభిఘాత :- అస్త్ర, శస్త్ర, అగ్ని, హిమపాతం, ఎండ, విషం ఇత్యాదులచేత శరీరానికి కల్గేవ్యాధులు.

2) అభిచార - భైరవి, మోహిని, బ్రహ్మరాక్షసి మొదలగు, క్షుద్రశక్తులను, దేవతలను మంత్రశక్తి ద్వారా శరీరంలో ప్రవేశపెట్టి శారీరకంగానో, మానసికంగానో వ్యాధులను కల్గజేయుట. వీనినే దైవబల ప్రవృత్త వ్యాధు అని కూడ అంటారు.

3) అభిశాప .. రుద్ర, ఇంద్ర, దిక్పాలక, ఋషి, గురు, భక్త, సిద్ధ మొదలగు గొప్పవ్యక్తులను దూషించుట, అవమానించుట వలన వారికి కలిగే కోపతాపాలవల్ల శాపం వల్ల కలిగే వ్యాధులు.

4) అభిషంగ :- వెనుక వర్ణించిన హింస్ర మరియు క్షుద్ర ప్రాణులు శరీరంపై ప్రహరించుట.

ఈపై నాల్గువిధాలైన ఆగంతు కారణాలుకూడ మానవుని ఆరోగ్య సుఖమయజీవనానికి చోటుకల్గిస్తూనే ఏదోఒకవిధమైన రోగాలను కల్పిస్తూ

ఉంటాయి. ఈ నాల్గింటిలోనూ, అభిఘాతం, అభిషంగం ముఖ్యమైనవి. మిగిలిన రెండున్నూ అంటే అభిచార అభిశాపములు ప్రస్తుతకాలంలో, ఆధునిక యుగంలో అంతగా కనుపించవు. నాల్గవదైన భూతాభిషంగాన్ని (అభిషంగం) రెండవ అధ్యాయంలోని 'క్రిమికారణత్వం' యొక్క వివరణలో తెలుపబడినది.

క్రిములనేవి శరీరానికి రెండు అధిష్ఠానాలుగా రోగాలను కలుగ జేస్తూ ఉంటాయి.

1] కేవలం ఒకే శరీరంలో కలుగజేసే వ్యాధులు.

2] అన్యశరీరాలకు గూడ ప్రాకెడివి [వ్యాధులు] ఒకానొక రోగి శరీరంలో వృద్ధిచెందిన రోగక్రిములు అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తుమ్ము, దగ్గు, ఉమియుట,మలమూత్రవిసర్జన ఇత్యాదులద్వారా బయటపడి అతని బట్టలను, పాత్రలను, వస్తువులను ఆశ్రయించి, ఆయావస్తువులద్వారా ఆరోగ్యవంతుల శరీరంలోనికి కూడ ప్రవేశించి వారిలో ఆయారోగాలు కల్గించె అవకాశం ఉంది. ఈ విధముగ పరస్పర సంపర్కంవల్ల కలిగే వ్యాధులను ఔపసర్గిక వ్యాధులు అంటారు. కొన్ని విధాలైన జ్వరాలు, నేత్రాభిష్యందం, ప్రతిశ్యాయం, కుష్ఠం మొదలగు అనేక విధాల చర్మ రోగాలు ఈ ఔపసర్గిక రోగాల ప్రత్యేకోదాహరణములు. [24]

ఈ ఔపసర్గిక రోగాలు ఒకే కాలంలో వేలకొలది ప్రజలను [జనపదాలను] ఆక్రమించి బాధింపవచ్చు. మసూరికా, శీతల, దుష్ట, అతిసార, అభిష్యంద, ప్రతిశ్యాయ, సన్నిపాత జ్వర, ప్రవాహిక మొదలగు వ్యాధులు ఈజనపదధ్వంసాలకు ఉదాహరణములు. సర్వరోగాల వ్యాప్తికి సూక్ష్మ క్రిములే కారణం అయినప్పటికీన్నీ, శరీరంలో వ్యాధిక్షమత్వం (రోగ నిరోధ శక్తి) శారీరబలం తగ్గినవారిలో మాత్రమే ఈ రోగ కారక క్రిములు వ్యాధులను కల్గించగలవు. ఇది ముఖ్యంగా గమనించదగ్గ విషయం. ఉత్తమరోగ నిరోధకశక్తిని బలాన్ని కలిగిన మనుష్యులు ఈజనపదోధ్వంసకాలంలో కూడ ఏవిధమైన వ్యాధులకూ లోనుగాకుండా ఆరోగ్యంగానే ఉండగల్గుతారు. [25]

## 3. ఆధిదైవిక వ్యాధులు .-

మానవుని ఉన్నత మేధను, శక్తిని, యుక్తిని అతిగమించిన; అతని అధీనంలో లేకుండ ఈమానవుని నిలుకడను (మనుగడను) అస్తిత్వాన్ని తమ గుప్పిడిలో పెట్టుకొనే; శక్తినిగాని వ్యక్తినిగాని 'దైవం' అంటారు. ప్రకృతి భూతాలయిన ఉరుములు, పిడుగులు, భూమి, వర్షం, వరదలు, వేడిమి మొదలైన వాటియెడల మానవునికి ఒకవిధమైన భయం, భయం చేత భక్తియున్నూ, భక్తిచేత శ్రద్ధాగౌరవాలున్నూ అందువల్ల ఈ ప్రకృతి శక్తుల కోపాల్ని చల్లార్చడానికి వాటికే పూజలు - బలులు - ఇష్టవస్తు నైవేద్యాలు వగైరాలు ఏర్పడినాయి. ఈవిధమైన ఆచరణలో అధర్మం,అప చారం జరిగితే ఆయా దైవాలకు కల్గే కోప ఫలితంగా జనపదాలకు కల్గే వ్యాధులే, కష్టనష్టాలే ఆధిదైవిక దుఃఖాలు అనబడతాయి ఇవి ఒకే వ్యక్తికి గాని సామూహికంగా గాని (జనపదధ్వంస) మనుష్య సమూహాల్ని హింసిస్తూ ఉంటాయి. ఈ ఆధిదైవిక వ్యాధులు మూడు విధములైన బల ముల ద్వారా జనిస్తూ ఉంటాయి. (బలం-రోగకారకవంశం) [26]

### (1) కాల బల ప్రవృత్త :-

అనవరతం ప్రకృతిలో జరిగే పగలు, రాత్రి, షడృతువులు, వాటిలో గోచరించే చలి, వేడిమి, గాలి, వర్షం మొదలగు వాటిచేత శరీరానికి కల్గే రోగాలను కాలబల ప్రవృత్త వ్యాధులని అంటారు. వీటినే ఋతుకృతము లనికూడ అంటారు ఇవి పునః రెండువిధాలు.

### (ఎ) అవ్యాపన్న ఋతుకృతాలు,-

ఒక నిర్దిష్ట, భూభాగం లోని స్వాభావికమైన ఋతు పరిణామం వలన జనించే వ్యాధులు.

### (బి) వ్యాపన్న ఋతుకృతాలు -

ఋతుక్రమంలోని వైషమ్యాల వలన కలిగే వ్యాధులు.

## (2) దైవబల ప్రవృత్త - (21)

బ్రహ్మ విష్ణు, మహేశ్వర, ఇంద్రాగ్ని, వరుణ, వాయ్వాది దిక్పాలురు, సూర్యచంద్రాది ఖగోళాలు, యక్ష, రాక్షస, గంధర్వ పిశాచ గ్రహాలు, శాకినీ, ఢాకినీ, మోహిన్యాది క్షుద్రశక్తులు, దేవతా స్వరూపులైన ఋషి, ముని, గురువులు ఇత్యాదిదైవ శక్తులయెడల మానవులచే జరిగిన అవమానం. ద్రోహం, అధర్మాచరణ మొదలగువానిచేత కోపం కలిగి ఆయా శక్తుల శాపం, శరీరావేశం మొదలగు అద్భుతరీతులలో మనుష్యునకు రోగాలను కల్పిస్తూ ఉంటాయి. ఈవిధమైన రోగాలను, వికారాలను 'దైవబల ప్రవృత్తాలు' అంటారు. ఇవి రెండు రీతులుగా శరీరానికి బాధలను కల్గిస్తాయి.

(ఎ) సంసర్గజ _నికట సంబంధంచేత పిడుగు. భూకంపం మొదలగునవి॥

(బి) ఆకస్మిక – ఒక్క సారిగా కల్గే ప్రళయం తుపాను వరదాలు.

## (3) స్వభావ బల ప్రవృత్త -

జీవితకాలంలో ప్రతినిత్యం మానవునికికలిగే ఆకలి, దాహం, పిపాస నిద్ర, వయస్సుతోపాటు వచ్చే ముసలితనం, రోగం, మరణం మొదలగునవి కూడ దుఃఖాలే. అయితే ఇవి స్వాభావికరోగాలుగా వివరించ బడినాయి. ఇవి రెండు విధాలు.

## (1) కాలకృత -

సరియగు కాలంలో ఒక పద్ధతిలో క్రమంలో జరిగేవి. క్రమమైన ఆహార విహార సేవన, రసాయనాదుల సేవన వల్ల రక్షించబడిన శరీరంలో ఈ స్వభావజ వ్యాధులైన ముసలితనం, మరణం కాలాన్ని అనుసరించి క్రమంగా చోటు చేసికొంటాయి.

(2) అకాలకృత :-

మిథ్యాహార విహారాదులు, జరాక్షయం ఇత్యాదుల వలన శరీరం దూషింపబడి అకాలంలోనే పలితం, స్థాలిత్యం, ఇంద్రియశక్తి నాశం, దౌర్బల్యం, ముసలితనం, మరణం వగైరాలు సంభవిస్తూ ఉంటాయి.

ఈ విధంగా ఈ మానవ శరీరాన్ని మూడు విధాలైన దుఃఖాలు నిత్యమూ అనుసరిస్తూనే ఉంటాయి. సప్తవిధములైన (వ్యాధులు) బలప్రవృత్తాల్ని ఈవర్గీకరణంలోనికే, సర్వవిధాలైన వ్యాధుల్ని సమావేశపరచవచ్చు. ఆచార్య సుశ్రుతునిచే గావించబడిన ఈ వర్గీకరణాన్ని సమర్థిస్తూ వాగ్భటాచార్యుడు కూడ తమ అష్టాంగ సంగ్రహంలో సహజ, గర్భజ, జారజ, పీడజ, కాలజ, ప్రభావజ, స్వభావజాలని, వివిధాలైన రోగసమూహాలను (వర్గీకరించి) సూచించారు. (28)

## రోగస్వభావాన్ని వివరించే వర్గీకరణం

పైని వివరించిన త్రివిధరోగ వర్గీకరణంలో ఇమిడే సర్వరోగ సమూహాల్ని వాటివాటి వివిధ ప్రత్యేక స్వభావాల ఆధారంగా తిరిగి అనేక విధములుగా విభజించటాన్ని మనం ఆయుర్వేద గ్రంథాల్లో గమనిస్తూ ఉంటాం. అవి ఈక్రింది విధంగా ఉంటాయి :-

1 ఏకవిధం :- రుజా (బాధ) ;- నొప్పి సర్వరోగాలకూ సామాన్యం గావున రోగాలన్నీ ఒకటేవిధం (తరగతి).

2 ద్వివిధం – వ్యాధి సమూహాలు రెండువిధాలు.

a) అధిష్ఠానభేదంచేత – శరీరాధిష్ఠాన రోగాలు మనోఽధిష్ఠాన రోగాలు.

b) ఆశయ భేదంచేత – ఆమాశయ సముత్థములు పక్వాశయ సముత్థములు.

c) నిమిత్తభేదంచేత :- నిజరోగాలు, ఆగంతురోగాలు

d) బలభేదంచేత – 1) మృదురోగాలు, దారుణరోగాలు (2) అనుబంధ్య (ప్రధాన–స్వతంత్ర) అనుబంధ, గౌణ.

e) కాలభేదంచేత – ప్రాకృత (తుల్యదోష, ఋతుజన్య రోగాలు) వైకృత – (అతుల్య దోష ఋతుజన్యరోగాలు).

f) అగ్నికార్యదుష్టి చేత .– సామరోగాలు – నిరామరోగాలు

g) ఆహార సేవన దుష్టి చేత – సంతర్పణ జన్యములు (అహారాతి సేవనచేత) అపతర్పణ జన్య (హీన ఆహార సేవనము చేత).

h) దోషదుష్టి చేత – సామాన్యజ – నానాత్మజ (విశిష్ట దోషజన్య).

i) ప్రభావ భేదం చేత .– సాధ్యరోగాలు – అసాధ్యరోగాలు.

j) చికిత్సాదుష్టి చేత .– శస్త్రసాధ్యాలు – స్నేహాది క్రియా సాధ్యాలు.

3. త్రివిధరోగాలు –

1. హేతుభేదం చేత – (1) అసాత్మ్యేంద్రియార్థ – ప్రజ్ఞాప రాధ – పరిణామి.

(2) దుష్టాపచారజ – పూర్వాపచారజ – పరికరజ.

2. దుఃఖ భేదం చేత – ఆధ్యాత్మిక – ఆధిభౌతిక – ఆధిదైవిక.

3. అధిష్ఠాన భేదం చేత – శారీరక – మానసిక – ఐంద్రియక.

4. దోష భేదం చేత – ఏకదోషజ – ద్వంద్వజ – సన్నిపాతజ.

4 చతుర్విధత్వ (రోగాలు)

1– ఆగంతు –.శారీరక– మానసిక– స్వాభావిక.

6 సప్తవిధత్వ (రోగాలు)

1. దోషభేదం చేత :- ఏకదోషంచేత (3) ద్వంద్వజ (3) సన్నిపాతం. (1)

2. దూష్యభేదం చేత :- రస, రక్తమాంస, మేద, అస్థి, మజ్జా-శుక్రదూష్య(ఉపధాతువులు - ఓజస్సు - కండరాలుకూడ సమావేశ పరచవచ్చును).

3. స్రోతః ప్రదోషజ - శారీరక 13 + మానసిక 2 = 15 స్రోతస్సులు.

ధాతుప్రదోషజ వ్యాధులు 13

1. రసప్రదోషజ :- అశ్రద్ధా (అన్నద్వేషం), అరుచి, ఆస్యవైరస్యా, హృల్లాస, గౌరవ, తంద్రా, అంగమర్ద, జ్వర, తమః పాండుత్వ, స్రోతోరోధ, క్లైబ్య, అంగసాద, కృశాంగతా, అగ్నినాశ, అకాల వలీపలిత ఇత్యాదులు.

2. రక్తప్రదోషజ :- కుష్ఠ, విసర్ప, పిడక, రక్తపిత్త, అసృగ్దర, గుద, మేఢ్ర, ఆస్యపాక(వ్రణ), ప్లీహా, గుల్మ, విద్రధి, నీలికా, కామిలా వ్యంగ, పిప్లు, తిలకాలక, దద్రు, చర్మదల, శ్విత్ర, పామకోర, రక్తమండల ఇత్యాదులు.

3. మాంస ప్రదోషజ :- అధిమాంస, అర్బుద, కీల, గలశాలుక, గలశుండిక, పూతిమాంస, అలజీ, గలగండ, గండమాలా, ఉపజిహ్వక.

4. మేదఃప్రదోషజ - ముఖతాలు, కంఠ, శోష, పిపాస, ఆలస్య, మలసంచయం, అంగసుప్తి మూత్రదోషం, నిద్రా, తంద్రా ఇత్యాది ప్రమేహవ్యాధి పూర్వరూప లక్షణాలు.

5. అస్థిప్రదోషజ - అధ్యస్థి, అధిదంత, దంతభేద, దంతశూల, అస్థిభేద, అస్థిశూల, వివర్ణత్వ, కేశ, లోమ, నఖ, శ్మశ్రు, వికారములు మొదలగునవి.

6. మజ్జా ప్రదోషజ - పర్వరుక్ (సంధులలో నొప్పి) భ్రమ, మూర్ఛ, తమోదర్శనం (కళ్లు చీకట్లు క్రమ్ముట), అరుంషిక (వ్రణములు) స్థూలకంధులు ఇతాదులు.

7. శుక్ర ప్రదోషజ - క్లైబ్యం, అహర్షణ, శుక్రంలో గర్భోత్పాదక శక్తి నాశం, గర్భోత్పత్తి జరిగినా కూడ గర్భస్రావం లేదా గర్భపాతం జరుగుట, లేదా వికృతరూప శిశూత్పత్తి మొదలగునవి.

ఇదేవిధంగా ఉపధాతు, ఓజస్సు, మరియు మల ప్రదోషజ రోగాలలో కొన్నింటిని సంగ్రహించడ మయినది.

8. ఉపధాతు ప్రదోషజాలు :- స్తన్య లసీకా (క్లేద) ప్రదోషజ.

1. (a) దుష్ట స్తన్య రోగములు, స్తనరోగములు.

(b) వ్రణ, శోథ, పిడికా ఇత్యాదులు.

(c) రోమశాతన, త్వక్ స్ఫుటన ఇత్యాదులు.

2 రజః ప్రదోషజములు :- ప్రదర, ఆర్తవ వికారాలు, వంధ్యాత్వం మొ॥ వి.

3, కండర, సిరా, ధమనీ ప్రదోషజ.- సిర జాల, సిరాహర్ష, సిరాగ్రంధి.

4. వసా ప్రదోషజములు - ఆర్తవ వికారాలు, లింగంమార్ద్వ లక్షణాలు మొ॥ వి.

5. త్వక్ ప్రదోషజ :- దద్రు, పామా, కండూ, పిటికా, కుష్ఠ ఇతాదులు.

6. స్నాయు ప్రదోషజ:- అపతానక, అపతంత్రక, ఆక్షేపక, ఖల్లీ ధను స్తంభ ఇత్యాదులు.

7. ఓజః ప్రదోషజములు :- మద, మూర్ఛ, సన్యాస, మచ్ఛాయ, దౌర్బల్య ఇత్యాది లక్షణాలు.

## 9. మలప్రదోషజ వ్యాధులు -

(1) మూత్రప్రదోషజములు - మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, మూత్రాఘాతము, ప్రమేహము.

(2) పురీషప్రదోషజములు :- విబంధము, అతిసారము, ప్రవాహిక.

(3) స్వేదప్రదోషజములు - అతి స్వేదము, దౌర్గంధ్యము, కండువు, త్వక్ స్ఫుటనము.

(4) అన్యమల ప్రదోషజములు - కర్ణ, అక్షి, నాసా, మేఢ్ర, యోనులలో కల్గే రోగాలు మొదలైనవి.

## 10. స్రోతః ప్రదోషజ వ్యాధులు -

(1) శారీరక స్రోతస్సు :- ప్రాణ, అన్నాది 13 విధాల స్రోతస్సుల వివిధ రోగముల సముదాయం.

(2) మానసిక స్రోతస్సులు - సంజ్ఞావహ, మనోవహ, ఇంద్రియ రోగాగులు - ఉన్మాదం, అపస్మారం - అతత్త్వాభినివేశం - మూర్ఛ, సన్న్యాసం మొదలగునవి.

## అధ్యాయ సారాంశము

1. దోషదూష్య సంమూర్ఛనాజన్య అభ్యంతర వికృతుల పరంపరకే వ్యాధి అని పేరు. దోషాలు, దూష్యాలు, (ధాతు) అగ్ని స్రోతస్సులు- ఇవి వ్యాధికి మూలకారణాలు. కేవలం లక్షణసముచ్చయాన్నే వ్యాధి అని పిలువజాలము.

2. రోగములు అసంఖ్యాకములు. వాటిని సౌకర్యానుసారంగా భిన్నభిన్న రీతులలో, వివిధదృష్టి కోణాల్లోంచి అనేక విధాలుగా విభజించవచ్చు.

3. నిజరోగాలు మహాస్రోతస్సు (కోష్ఠం) లో జనించి అన్యప్రదేశములకు ప్రాకి అచట వ్యక్తం అవుతూంటాయి.

# వ్యాధి వర్గీకరణ తాళికా.

## తత్ దుఃఖసంయోగాత్ వ్యాధయః — దుఃఖం త్రివిధం.

- ఆధ్యాత్మిక
  - ఆదిబలప్రవృత్త — శుక్రశోణితదుష్టిజన్య (నిజ)
    - పితృజ
    - మాతృజ
    - శుక్రజ
    - శోణితజ
    - కులజ
  - జన్మబలప్రవృత్త — మాత్రోపచారజ జన్య (నిజ)
    - రసకృత
    - దౌహృద అపచారజ
    - సహజ
  - దోషబలప్రవృత్త — మిథ్యాహార విహారజన్య (నిజ)
    - శారీర
    - మానసిక
      - ఆమాశయ సముత్థ (కఫ-పిత్త)
      - పక్వాశయ సముత్థ (వాత)
- ఆధిభౌతిక
  - సంఘాతబల ప్రవృత్త — బలవద్విగ్రహాదిజన్య (ఆగంతు)
    - శస్త్రకృత
    - వ్యాళకృత
      - హింస్ర
      - క్షుద్ర
- ఆధిదైవిక
  - కాలబలప్రవృత్త (నిజ)
    - అవ్యాపన్న ఋతుకృత్
    - వ్యాపన్న ఋతుకృత్
  - దైవబలప్రవృత్త — కృత్యాదిజన్య (ఆగంతు)
    - విద్యుత్ అశనికృత
    - పిశాచాది కృత
      - ఆకస్మిక
      - సంసర్గజ
  - స్వభావ బలప్రవృత్త (నిజ)
    - కాల కృత
    - అకాల కృత



I మృదు × దారుణ, సాధ్య × అసాధ్య, ప్రాకృత × వైకృత, సామాన్యజ × నానాత్మజ, సామ × నిరామ సంతర్పణ × అపతర్పణ. II ధాతుప్రదోషజ, III స్రోతోదుష్టిజ.

## శాస్త్రోక్త ఆధారశ్లోకములు (Refferences)

1. తథావిధ దోషదూష్య సంమూర్ఛనా విశేషో జ్వరాదిరూపో వ్యాధిః॥ (మధుకోశ.మా.ని. 1/7)
2. పూనాలోని ప్రఖ్యాత విద్వాంసులు శ్రీపండిత గణేశశాస్త్రి సూచించిన నిష్పత్తి.
3. నచ రూపవ్యతిరేకేణ వ్యాధిరుపలభ్యతే యతో మిలితా అరుచ్యాదయ ఏవ జ్వరః, కాసాద్యేకాదశ రూపాణ్యేవ రాజయక్ష్మా। ఉచ్యతే నైవంరూపో వ్యాధిః, తత్కార్యా శ్చారుచ్యాదయః। (మధుకోశ. మా.ని. 1/7)
4. అణుర్హి ప్రథమం భూత్వా వ్యాధిః పశ్చాత్ వివర్ధతే।
   సజాతమూలో ముష్ణాతి బలమాయుశ్చ దుర్మతేః॥ (చ.సూ. 11/58)
5. హరివంశంలో జ్వరంయొక్క స్వరూప వివరణ -
   జ్వరస్త్రిపాదస్త్రిశిరాః షడ్భుజో నవలోచనః
   భస్మప్రహరణో రౌద్ర కాలాంతకయమోపమః॥ ఇత్యాది।
6. రోగః పాప్మా జ్వరో వ్యాధిః వికారో దుఃఖ మామయః।
   యక్ష్మాతంక గదాబాధాశ్శబ్దాః పర్యాయవాచకాః।
   (అ. హృ. ని. 1/1)
7. చ.ని. 1/5. చక్రపాణివ్యాఖ్యా
   అ. హృ. ని. 1/1 అరుణదత్త వ్యాఖ్యానం.
8. సమానో హి రోగశబ్దో దోషేషు వ్యాధిషు చ।
   దోషాహ్యపి రోగశబ్ద మాతంక శబ్ద...లభంతే। (చ.వి. 6/4)
9. స్వతంత్రో వ్యక్తలింగో యథోక్త సముత్థాన ప్రశమో
   భవత్యను బంధ్యః, తద్విపరీత లక్షణస్తు అనుబంధః॥ (చ వి.6/11)
10. వికారాః పురసంఖ్యేయాః ప్రకృత్యధిష్ఠాన లింగ,
    ఆయతన వికల్ప విశేషాణా పరిసంఖ్యేయత్వాత్। (చ.సూ.20/3)
    ద్వౌ పురుషౌ వ్యా తరూపౌ భవతః
    గురువ్యాధితః లఘువ్యాధితశ్చ ... విప్రతిపద్యతే॥ (చ.వి. 7/3)
11. చ. సూ. 20/10.

12. ప్రాచీనాః ప్రవిలీయంతే నవీనాః ప్రాదురాసతే। (సి. నిదాన)

13. వికారనామా కుశలో న జిహ్రీయాత్ కదాచన।
నహి సర్వవికారాణాం నామతోఽస్తి ధ్రువా స్థితిః॥
తస్మాద్వికార ప్రకృతీ రధిష్ఠా నాంతరాణి చ।
బుద్ధ్వా హేతువిశేషాంశ్చ శీఘ్రం కుర్యా దుపక్రమం॥
(అ. హృ. సూ 12/64-66)

14, 15, 16. (చ. సూ. 20/11-14-17)

17. ఏతాని ఖలు దోషస్థానాని, ఏషు సంచీయంతే దోషాః॥
(సు. సూ. 21/18)

18. త్రయో రోగమార్గా, ఇతి శాఖామర్మాస్థి సంధయః।
కోష్ఠశ్చ। . భవంతి రోగాః।
(చ సూ. 11/48-49, అ. హృ. సూ. 12/44)

19. సు. సూత్రస్థాన 24 వ అధ్యాయం.
ప్రాగభిహితం తద్దుఃఖసంయోగా వ్యాధయః ఇతి॥ తచ్చ

20. దుఃఖం త్రివిధం ఆధ్యాత్మికం ఆధిభౌతికం ఆధిదైవికమితి।
(సు. సూ. 24/4)

21. తత్రాదిబలప్రవృత్తా యే శుక్రశోణిత దోషాన్వయాః కుష్ఠార్శ ప్రభృతయః తేఽపిద్వివిధాఃమాతృజాః పితృజాశ్చ . ..
... పునశ్చ ద్వివిధాః శారీరా మానసాశ్చ త ఏతే ఆధ్యాత్మికాః॥
(సు. సూ. 24/5)

22. సంఘాత బలప్రవృత్తా య ఆగంతవో దుర్బలస్య బలవద్విగ్రహాత్, తేఽపి ద్వివిధాః శస్త్రకృతాః వ్యాలకృతాశ్చ। ఏతే ఆధిభౌతికాః॥
(సు.సూ. 24/6)

23. అభిఘాతాభిచారాభ్యాం అభిశాపాభిషంగతః।
ఆగంతుర్జాయతే దోషైః। . .. (మాని 2/26)
ముఖాని తు ఖల్వాగంతోః నఖదశన
పతనాభిచారాభి శాప ... ..
దహన శస్త్రాశనిభూతోప సర్గాదిని। (చ. సూ. 20/4)

24. ప్రసంగాత్ గాత్రసంస్పర్శాత్ నిశ్వాసాత్ సహభోజనాత్ ।
ఏకశయ్యాసనాచ్చైవ వస్త్రమాల్యానులేపనాత్ ॥
కుష్ఠం జ్వరశ్చ శోషశ్చ నేత్రాభిష్యంద ఏవచ ।
ఔపసర్గిక రోగాశ్చ సంక్రామంతి నరాన్నరం ॥
(సు. ని. 5/32-33) మా.ని. కుష్ఠప్రకరణం)

25. తేషు ఖల్విమే భావాః సామాన్యాః జనపదేష్టు ఉధ్వంసకాభవంతి తద్యథా వాయుః - ఉదకం - దేశః కాల ఇతి । విగుణేష్వపి ఖల్వేతేషు జనపదోధ్వంసకరీర భావేషు భేషజేనోపపద్య మానానా మభయం భవతి రోగేభ్యః ఇతి । (చ. వి. 3/6-8)

26. కాలబలప్రవృత్తా యే శీతోష్ణ వాతవర్షా ప్రభృతి నిమిత్తాః తేఽపి ద్వివిధాః వ్యాపన్న ఋతుకృతా, అవ్యాపన్న ఋతుకృతాశ్చ ।
(సు సూ. 24/7)

27. దైవబల ప్రవృత్తా ఉపసర్గజాశ్చ తేఽపి ద్వివిధావిద్యుదశని కృతాః పిశాచాది కృతాశ్చ పునశ్చ ద్వివిధాః సంసర్గజాః ఆకస్మికాశ్చ ॥
(సు. సూ. 24/7)

28. స్వభావ బల ప్రవృత్తాః క్షుత్ పిపాసా జరామృత్యు నిద్రా ప్రభృతయః । తేఽపి ద్వివిధాఃకాలకృతా అకాలకృతాశ్చ। తత్ర పరిరక్షణ కృతాః కాలకృతాః, అపరిరక్షణ కృతాః అకాలకృతాః, ఏతే ఆధిదైవికాః ॥ (సు. సూ. 24/7)

29. సప్తవిధాఃఖలు రోగా భవంతి । సహాగర్భ జాతపీడాకాల ప్రభావ స్వభావజాః ॥ (అ. సం. సూ. 22/1)

30. చ.వి. 6/3, అ. సం. సూ. 22/. సు. సూ. 24/, చ. సూ. 20/3, అ. హృ. సూ. (13/75)

31. చరక సూత్రస్థానం 28/9-10.

—•••—

# అధ్యాయం - 8

## రోగసంప్రాప్తి - దాని విమర్శ

శరీరంలో త్రిదోష వికృతి జనించిన క్షణంనుంచి సంచయ ప్రకోపాదులైన ఆఱుక్రియా కాలాలద్వారా శరీరంలో వ్యక్తమయ్యే ప్రత్యేక రోగలక్షణాల క్రమాను సార వివరణనే 'సంప్రాప్తి' అని పిలుస్తారు. దీనినే జాతి, ఆప్తి అనీ పిలుస్తారు. (1) అంటే దోషవైషమ్యం చేత క్రమంగా శరీరంలో కల్గే ధాతువైషమ్యం, అగ్నివైషమ్యం, స్రోతోదుష్టి, వ్యాధి ప్రత్యాత్మలక్షణాలు, వ్యాధిస్వరూపం, దాని సాధ్యాసాధ్యతలు మరియు ఉదర్కము- ఈ విషయాలన్నింటి విశదమైన వర్ణననే సంప్రాప్తి అంటారు.

ప్రతిరోగం యొక్క సంప్రాప్తి విజ్ఞానం వైద్యుడన్న ప్రతివానికి అత్యంతావశ్యకం. ఏఏ వికృతులు శరీరంలో కల్గినవి, వాటి బలాబలాలు ఏవి? అనే విషయాలు తెలిసిన వైద్యుడే యోగ్యమైన చికిత్స చేయగల్గుతాడు. 2) క్షుణ్ణమైన సంప్రాప్తిజ్ఞానం రోగిని నిశితంగా పరీక్ష చేయడం వల్లనే కల్గుతుంది. రోగి శరీరంలో ఉత్పన్నమయ్యే లక్షణాలను పరీక్షించి అవి వ్యక్తమయ్యే రీతిని, రోగకారణాల (దోషధాత్వాదుల) వికృతిని నిర్ణయించడం సాధ్యపడుతుంది. చరక, సుశ్రుతాది ఆర్ష గ్రంథాల్లో వివరించిన ప్రతియొక్క వ్యాధిలోనూ ఆయావ్యాధుల సంప్రాప్తి విమర్శ, దాని వివరణ సూక్ష్మంగా గోచరిస్తూ ఉంటాయి.

### సంప్రాప్తిజ్ఞానం ద్వారా వ్యాధినిర్ణయం.

క్షుణ్ణమైన సంప్రాప్తి జ్ఞానం చేత వ్యాధినిర్ణయం సాధ్యమౌతుంది. అందుచేత సంప్రాప్తి నిదాన పంచకాల్లో ఒకటిగా పరిగణించ బడినది. ప్రతియొక్క వ్యాధిలోనూ ఉండే వికృతులు ఏవి ? అనే విషయాన్ని గ్రంథాధ్యయనంచేత గ్రహించిన వైద్యుడు ఒకరోగిని పరీక్షించి కన్పించే లక్షణాలను శాస్త్రోక్త లక్షణాలతో పోల్చి ఆరోగియొక్క వ్యాధిని నిర్ణయించడంలో సమర్థుడౌతాడు. ఉదా - పాండురోగం పిత్తప్రధాన

సన్నిపాతం అనీ, ఆరోగంలో రసధాతువృద్ధి, రక్తధాతుక్షయం జరిగి గుండెదడ, దౌర్బల్యం, అగ్నిమాంద్యం మొదలగు లక్షణాలతో గూడి, శరీరం ప్రాకృత వర్ణం మారి పాండువర్ణంగా మారుట ఈరోగ ప్రత్యాత్మ లక్షణమనియూ, గ్రంథాధ్యయనం చేత తెలిసికొన్న వైద్యుడు, ఒకానొక రోగియందు పైలక్షణాలను గుర్తించి, ఈరోగం పాండురోగమని అతిసులభంగా నిర్ణయించ గల్గుతాడు. ఈవిధంగా ప్రతియొక్క రోగం లోనూ ఉండే సంప్రాప్తిని తెలిసికోవడంవలన వివిధవ్యాధుల జ్ఞానం వైద్యునికి కల్గుతుంది దోష ధాతువులు వికృతి చెందినమీదట ఏయే లక్షణాలు ఉత్పన్న మవుతాయి? అనే విషయం కుశలుడైన వైద్యునికి తెలుస్తుంది. అందువల్ల క్రొత్తక్రొత్త వ్యాధుల సంప్రాప్తిని శరీరంలో వ్యక్తమయ్యే లక్షణాల మూలంగానే నిర్ధారణచేసి యోగ్యచికిత్స చేయగలిగే అవకాశం ఉంది.

## సంప్రాప్తి భేదములు -

వ్యాధియొక్క సంప్రాప్తి వివరణ సంప్రాప్తిలో కన్పిస్తుంది. ఇటువంటి వివరణ పొందుపరచేటప్పుడు ముఖ్యమైన కొన్ని విషయాలను అత్యావశ్యకంగా తెలిసికోవలసి ఉంటుంది. గావున సంప్రాప్తిని సంఖ్యా, వికల్ప, ప్రాధాన్య, బల, కాలవిశేషము లని 5 విధాలుగా విభజింపవచ్చును. (3) చరకసంహితలో వీటి జతగా 'విధిసంప్రాప్తి' అనే దాన్ని క్రొత్తగాచేర్చి బల మఱియు కాలసంప్రాప్తులు రెండునూ జతగా చేర్చి 'బలకాల సంప్రాప్తి' అని ఒకటిగా పిలుచుటను గమనిస్తాం. (4)

1. సంఖ్యా సంప్రాప్తి - ప్రతివ్యాధియు శరీరంలో ఎన్ని విధాలుగా అభివ్యక్తం అవుతుందో తెలియచెప్పేది సంఖ్యా సంప్రా. ప్తి. ఉదా - జ్వరం 8 విధాలు, గుల్మం 5 విధాలు, కుష్ఠం 18 రకాలు (5) ఇత్యాదులు. ఈ సంఖ్యానిర్ణయం వ్యాధియొక్క కారణం, దోషం, ప్రధానలక్షణం మొదలగు వాటిపై ఆధారపడి ఉంటుంది.

2. వికల్ప సంప్రాప్తి - శరీరంలో ఉత్పన్నమయ్యే ప్రతి ఒక్క రోగలక్షణం కూడ దోష, ధాతు, అగ్ని, స్రోతస్సు మొదలగు వాటి

వికృతి చేతనే ఉత్పన్నమవుతుంది. అటువంటి లక్షణాలను విశ్లేషించి ఆ లక్షణాలకు కారణభూతమైన దోషాదుల వికృతి స్థితిని విశదంగా వివరించేదే వికల్ప సంప్రాప్తి. (6) ప్రతియొక్క అంశాన్ని ప్రత్యేకంగా విశ్లేషించి వివరించడం ద్వారా దీనికే అంశాంశ కల్పన అనే మరొక పేరుకూడ ఉన్నది. (7) ఉదా - జ్వరరోగంలోని సంతాపం- ఉష్ణత పిత్తంవలన అని తెలుస్తే చాలదు. శరీరోష్ణం పెరగాలంటే పిత్తం తన ఉష్ణ గుణంలో వృద్ధిచెందిన దనియూ, దేహంలోని పాచక, భ్రాజక పిత్తములు వృద్ధి చెందినవనియూ తెలుసుకోవాలి. అతిసారంలోని అతి ద్రవ మలప్రవృత్తి పాచక పిత్తం యొక్క ద్రవగుణం అధికమవడం వల్లనని తెలుసుకోవాలి ఆమ్ల పిత్తంలో కలిగే ఆమ్ల ఛర్దిలో పిత్తం ద్రవ్యతః వృద్ధిచెందినదని చెప్పుకోవాలి. కనురెప్పలు అనుమితంగా కదులుతూంటే వ్యాన వాయువు (కర్మతః) వృద్ధిచెందిన దనియు, చర్మం నునుపు తగ్గి బిరుసెక్కినచో వ్యాన వాయువు రూక్షత్వంచేత వృద్ధిచెందినదనియు శరీరంలో ఎచటనైనను వాపు కన్పించిన కఫం ద్రవ్యతః వృద్ధి చెందిన దనియూ, శరీరవర్ణం తెల్లబడినచో కఫం కర్మతః వృద్ధి చెందినదనియూ, కాలు సేతులు చల్లబడి, శరీరం బరువుగా చేష్టాహీనమై ఉన్నచో కఫం శీతగుణంచేత అభివృద్ధి చెందినదని తెలుసుకోవాలి. ఇదే విధంగా ధాతు వృద్ధి వలన కలిగే లక్షణాలనుగూడ అంశాంశ కల్పనచేసి తెలుసుకోవాలి. ఈ విధంగా చేయడం వలన దోషధాతువుల వృద్ధి తమ తమ ప్రమాణ, గుణ, కర్మలలో ఏఅంశంలో ఎక్కువగా కన్పిస్తుందో దానికి ప్రాధాన్యము నిచ్చి దోషధాతు వృద్ధి ద్రవ్యతః, గుణతః, కర్మతః అని విభజించినారు. గుణకర్మలు స్వతంత్ర ప్రతిపత్తిలేక ద్రవ్యాన్ని ఆశ్రయించి ఉంటాయి. గావున ద్రవ్యతః దోషధాతువులు వృద్ధిచెందిన పిమ్మట వాటి గుణ కర్మలుకూడ నిస్సంశయంగా వృద్ధిచెందుతాయి అనేది నిర్వివాదం. అయిననూ అన్ని సందర్భాల్లోనూ, ప్రమాణ, గుణకర్మలు సమానంగా వ్యక్తం అవుతూ ఉండవు. కొన్ని సమయాల్లో గుణవికృతి, కొన్ని సమయాలలో కర్మ వికృతి, మరికొన్ని సమయాల్లో ప్రమాణ వికృతి అధికంగా కనిపిస్తూ ఉంటుంది. ఈ అంశాంశ కల్పనలో దోషధాతు అగ్ని స్రోతస్సు మొదలగు

వాని సూక్ష్మ వివరణ వివరించినప్పటికిన్నీ దోష వైషమ్యానికి అధికమైన మహత్తునూ ప్రాముఖ్యాన్నీ ఇచ్చిన కారణంగా వికల్ప సంప్రాప్తిలో కూడా దోషవివరణకే అధిక ప్రాధాన్యము ఒసంగ బడింది.

యోగ్య చికిత్సకు ఈ దోషాల అంశాంశ కల్పన అత్యంత ప్రధానం. దోషాలు ప్రమాణంలో వృద్ధిచెందినపుడు చేసే చికిత్స గుణతః వృద్ధిచెందినపుడు ప్రభావం చూపనేరదు. మఱియు ప్రతియొక్క దోషధాతువుల గుణవృద్ధిలో చేసే చికిత్స వేరుగా ఉంటుంది. అదేవిధంగా దోషాలు కర్మతః వృద్ధి జరిగినపుడు చేసే చికిత్స గుణతః లేదా ద్రవ్యతః వృద్ధిచెందినపుడు చేయడంవలన ఫలితం కనబడదు.

ఉదా :- పిత్తం ద్రవ్యతః వృద్ధి నొందినపుడు దానిని బహిర్గతం చేయడానికి విరేచనకర్మయూ, ఉష్ణగుణంచేత వృద్ధి చెందినపుడు శీతోపచారాలునూ, కర్మతః వృద్ధిచెంది బుద్ధి భ్రంశం గ్రహించినట్లయితే మనస్సంతోషం, సంగీత శ్రవణం ఎంతో ఉపయోగపడతాయి.

ఈ విధంగా చికిత్సను సందర్భోచితంగా కాక విరుద్ధంగా ఉపయోగించినట్లయితే దోష వైషమ్యం చెందనేరదు. అందుచే ప్రతియొక్క వ్యాధిలోనూ యోగ్య చికిత్స కోసమై వికల్పసంప్రాప్తి అథవా దోష అంశాంశ కల్పనను నిర్దిష్టంగా నిర్ణయించే జ్ఞానాన్ని, యశస్సును కాంక్షించే వైద్యుడు తప్పక పొందిఉండాలి.

3) ప్రాధాన్య సంప్రాప్తి - ఒకటికంటె ఎక్కువ దోషాలచేత కనుక వ్యాధి జనించినట్లయితే, ఆయారోగ కారక దోషాల్లో ఏది ప్రధానమైనది? ఏది అప్రధానమైనది? (గౌణ) అనే రోగాల తరతమ భావాలను నిర్ణయం చేయడాన్ని ప్రాధాన్య సంప్రాప్తి అంటారు. (8) చికిత్సా కాలంలో ప్రధానదోషాలకు ముందుగా చికిత్స చేయాలి ఒక్కొక్కపుడు శరీరంలో ఒకటికంటె ఎక్కువ వ్యాధులు ఉత్పన్నం గావచ్చు. ఇటువంటి సందర్భాల్లో ప్రధానవ్యాధి, అప్రధాన (గౌణ) వ్యాధులను నిర్ధారించి తగిన చికిత్స చేయడం ఈ ప్రాధాన్య సంప్రాప్తి ముఖ్యోద్దేశం.

4) బలసంప్రాప్తి - వ్యాధికాలంలో శరీరంలో రెండు విధాలైన బలాలను వైద్యుడు పరీక్షించి, విమర్శించి తెలుసుకోవాలి. (1) శరీరబలం

(2) వ్యాధిబలం. శరీరబలాన్ని నిర్ణయించడానికి రోగియొక్క వయసు, లింగం (స్త్రీ పురుష భేదం), ప్రకృతి, సత్త్వం (మనస్సు) సాత్మ్య (ఆహార-విహార-దేశ-అభ్యాసము) ఇత్యాదులు సహాయపడతాయి. వ్యాధియొక్క బలాన్ని నిర్ధారించడంలో దాని నిదానం, పూర్వరూపం, లక్షణాలు మొదలైనవి సహాయపడుతూంటాయి, వీటి నన్నింటినిన్నీ నిర్ణయించి, పరీక్షించి శరీరం మరియు రోగంయొక్క బలాబలాల్ని నిర్ణయించడాన్ని బల సంప్రాప్తి అంటారు.

5) కాలసంప్రాప్తి - వ్యాధులు కాలాన్ని (ఋతువులను-వాటి మార్పులను) అనుసరించి వాటివాటి లక్షణాలను వ్యక్తంచేస్తూ ఉంటాయి. కొన్నికొన్ని ప్రత్యేక వ్యాధులు కొన్ని నిర్దిష్ట ఋతువులలో మాత్రమే ఉత్పత్తి చెందుతుంటాయి. వృద్ధిచెందిన దోషాలు తమః ప్రకోపకాలంలో తీవ్రంగా వ్యక్తంచేస్తూ ఉంటాయి. ఈ విధంగా నిర్దిష్టకాలానికి, ఆయా ఋతువులకూ వ్యాధికీ గల సంబంధాన్ని సూచించేదే కాలసంప్రాప్తి. రోగి వయస్సు, వ్యాధి వ్యక్తమయిన ఋతువూ, దోషవృద్ధినికల్గించే పగలు రాత్రి మరియు భోజన సమయం యొక్క ఆదిమధ్య అంతములు వీటిని వివేచించి వాటికి రోగానికి గల సంబంధాన్ని తెలియచెప్పేదే కాల సంప్రాప్తి. (10)

6 విధి సంప్రాప్తి:- శరీరంలో ఉత్పత్తి చెందిన వ్యాధులు ఏప్రకారంగా ఉన్నవి? అని తెలియచెప్పేదే విధిసంప్రాప్తి. (11) వ్యాధి వర్గీకరణ వివరణలో తెలిపిన విషయాలను పరీక్షించిన శరీరంలో జనిరిచిన రోగం ఎటువంటిదో తెలిసి పోతుంది. ఉదా:-కుష్ఠ మనే రోగం ఆధ్యాత్మిక రోగాల తరగతిలో ఆదిబల ( పత్త రోగం. ఆదిబల ప్రవృత్తములు కులజ వికారములు కావడం మూలంగా ఈ వ్యాధుల నిశ్శేషనివారణ అసాధ్యం అనే విషయం గుర్తుంచుకోవాలి. అదేవిధంగా నిజ ఆగంతు, సాధ్య-అసాధ్య. మృదు- దారుణ వ్యాధుల భేదాన్ని తెలిపేది కూడ విధి సంప్రాప్తి అనేఅంటారు. సంఖ్య మరియు వివిధి సంప్రాప్తులు రెండున్నూ వ్యాధుల భేదాల్ని కల్పనలనూ వివరిస్తూన్నప్పటికిన్నీ, రోగకారణాల గుణధర్మాల కనుసారంగా ఉండేవానిని సంఖ్యా సంప్రాప్తి అనియూ,

ప్రతిరోగం యొక్క (స్వభావాన్ని - గుణాన్ని తెలిపేది) విధిసంప్రాప్తి అనియూ వివరించబడింది. (12) ఈ విధమైన సంప్రాప్తి జ్ఞానం వైద్యునకెంతో ఆవశ్యకం. వివిధ వ్యాధులకు వివిధ విధాల చికిత్స కావలసి నందువల్ల, జాగ్రత్తగ పరీక్షించి గమనించి తగిన వ్యాధులకు వాటికి తగిన చికిత్స చేయుటానికి కూడ సంప్రాప్తిజ్ఞానం ఎంతో సహాయపడుతుంది.

పైని వివరించిన సంఖ్యావికల్పాది విషయములే కాక, వ్యాధుల ప్రత్యాత్మకలక్షణాలు, సాధ్యాసాధ్యతలు మరియు ఉదర్కము (ఉత్తరకాలీన ఫల) వీటిని కూడ సంప్రాప్తి విమర్శతో కలుపుకోవాలి. ప్రతి ఒక్క వ్యాధియూ సంపూర్ణ వివరణతో క్రింద వివరించిన అన్ని అంశాలనూ పొంది ఉండాలి.

1. దోషనామం — విభాగం.

అ) ఆగంతు దోష

ఆ) స్థానికదోష

ఇ) దోషవైషమ్య

వృద్ధి - ద్రవ్యతః (ప్రమాణతః)

గుణతః (నిర్దిష్టమైన గుణం పేరు)

కర్మతః (నిర్దిష్టమైన కర్మ పేరు)

2. దూష్యం - ధాతు లేదా మలం పేరు.

ధాతువైషమ్యం - వృద్ధి లేదా క్షయం.

ద్రవ్యతః

గుణతః

కర్మతః

3. స్రోతస్సు - అ) స్రోతోనిర్దేశం

(అంగప్రత్యంగ నిర్ణయం)

ఆ) స్రోతోదుష్టి ప్రకారం -

లక్షణ సహిత వివరణ -

1. అతిప్రవృత్తి
2. సంగ
3. స్రోతోగ్రంధి
4. విమార్గగమన.

4. అగ్ని - కోష్ఠాగ్ని వైషమ్యం.

అ) మంద
ఆ) తీక్ష్ణ
ఇ) విషమ

ధాత్వగ్ని వైషమ్యం - ధాతునిర్దేశం.

అ) సామ
ఆ) నిరామ

5. ఓజో వికృతి లక్షణాలు

1. విస్రంస
2. వ్యాపత్
3. క్షయ

6. వ్యాధిలక్షణ -

1 ప్రత్యాత్మ లక్షణాలు.
2. సామాన్య లక్షణాలు.

7. వ్యాధిభేద -

1. దోషానుగుణ - ఏకదోషజ
ద్వంద్వజ
సన్నిపాతజ
సామాన్యజ
నానాత్మజ.
2. ధాతుప్రదోషజ (లక్షణాలు)
3. లక్షణముల అవస్థ - ఆమ- పచ్యమాన - పక్వ (నిరామ)

4. వ్యాధివర్గం -

అ) ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక.

ఆ) బలప్రవృత్త.

ఇ) శారీరక, మానసిక, మృదు, దారుణ, నిజ, ఆగంతు ఇత్యాదులు.

ఈ) రోగం దాని అవధి - నవ, పురాణ.

ఉ) రోగకాలం - ప్రాకృత - వైకృత.

8. వ్యాధి నిర్ణయం .- వ్యాధినామ నిర్దేశం.

9. సాధ్యాసాధ్యతా నిర్ణయం -

1) కారణసంఖ్య - వాటిబలం.

2) రోగలక్షణములు - వాటిబలాబలాలు.

3) దోషముల సంఖ్య.

4) దూష్యవికృతి + వాటి బలాబలాలు.

5) రోగమార్గం - అభ్యంతర మధ్యమ - బాహ్య.

6) ఓజో వికృతి (శరీరబలం)

7) రోగియొక్క ప్రకృతి, సారం, సత్త్వ, సాత్మ్య, దేశ, వయః, లింగ ఇత్యాదులు.

8) ఉపద్రవములు -

9) ధాతుగతత్వ - ఉత్తాన, గంభీర.

10) అరిష్ట లక్షణాల నిర్ణయం.

10. సాధ్యాసాధ్యతలు -

1) సాధ్య - సుసాధ్య, కృచ్ఛ్రసాధ్య

2) అసాధ్య - యాప్య, ప్రత్యాఖ్యేయ.

## 5 ఉపశయం

'ఉపశయం' అనేది 5 వ వ్యాధి విజ్ఞానోపాయం. అనేక వ్యాధులను వాటివాటి నిదాన, పూర్వరూప, రూప, సంప్రాప్తుల ద్వారానే నిర్ణ

యించ వచ్చును. కాని కొన్ని కొన్ని అవ్యక్త (గూఢలింగ) లక్షణాలు కలిగిన, ఒకే విధమైన లక్షణాలు కలిగి, ఒకటి కంటె ఎక్కువ రోగావస్థలు కల్గి అవి లక్షణాలను - అవస్థలను సరిగా వ్యక్తం చేయని సందర్భంలో ఈ ఉపశయ - అనుపశయాల సహాయం ద్వారా (ఉపయోగము) రోగ నిర్ణయం చేయడం సాధ్యమవుతుంది. మరియు సులభతర మౌతుంది కూడ. (13)

ఉపశయం అంటే - 'ఉప సమీపే శేతే' చేరువలో దగ్గరగా ఉండేది 'పోలి' ఉండేది. అనుసరించి (రోగాన్ని) ఉండేది అని అర్థం చెప్పుకోవాలి. అంటే రోగనివారణకు తీసికొనే ఔషధాహార చర్యలకు, ఉపశయానికి పోలిక ఉంది. అంటే రోగ-చికిత్సలో 'ఉపశయం' చిక్కలి అందుబాటులో ఉండేది అనే అర్థంలో ఈశబ్దప్రయోగం చేసినారు. రోగ చికిత్సలో యోగ్యమైన ఆహార విహారాదుల ఉపయోగం ఉన్నట్లుగానే ఉపశయం లోనూ కొన్నివిధాలైన ఔషధాహార విహారాదుల ప్రయోగంవలన శరీరానికి కలిగే మేలు వలనగాని, చెడుపు వలనగాని రోగ నిర్ణయం చేయటం సాధ్యమౌతుంది. (14)

ఉదాహరణకు - 'ఊరు స్తంభరోగిలో' తొడల (ఊరువులు) చలనం పూర్తిగా నిలచి పోయిన రోగిని గాంచిన వైద్యునికి ఈలక్షణం కలిగిన రెండురోగాలు వెంటనే జ్ఞప్తికి వస్తాయి. కఫ మేదస్సుల దుష్టిచేత ప్రాప్తించిన విశిష్టమైన 'ఊరు స్తంభ' మనే వ్యాధి ఒకటి, మరియు కేవలం వాతవృద్ధిచేత కల్గిన స్తంభం మరియొకటిన్నీ,' నిదాన, పూర్వరూప, రూప, సంప్రాప్తుల ద్వారా కొన్ని సమయాల్లో రోగ నిశ్చయం సాధ్యపడదు. అటువంటి సందిగ్ధ సందర్భాల్లో ఆరోగియొక్క ఊరు భాగానికి బాహ్యస్నేహం (తైలమర్దనం) చేయించినప్పుడు ఆ ప్రక్రియవల్ల రోగికి సుఖంగానూ, రోగతీవ్రత (బాధ) తగ్గినట్లుగానూ, అనిపించిన; అతివాత (శుద్ధ) వ్యాధి అనియూ, కఫమేదోజన్య ఊరు స్తంభ వ్యాధి కాదనియూ, తెలుస్తుంది. బాహ్యస్నేహం వాతహారంకావడం మూలంగా వాతరోగ లక్షణాలు క్షీణించి రోగికి సుఖం, బాధానివృత్తి కల్గుతాయి. అందుచే

ఈ విధమైన (ప్రక్రియను) క్రమాన్ని ఉపశయం అంటారు. (హితాన్ని చేకూర్చేది) ఇదే బాహ్యస్నేహం కఫమేదస్సులను వృద్ధి చేయడం మూలంగా ఊరు స్తంభవ్యాధిని మరికొంత వృద్ధిచేసి లక్షణాలను, బాధలను కూడ పెంపొందించి రోగికి ఎంతో అసౌఖ్యాన్ని (అనుపశయాన్ని) కలుగ చేస్తుంది. బాహ్యస్నేహం వలన ఈవిధంగా రోగికి అనిపించినచో అది ఊరుస్తంభ వ్యాధి అని నిర్ణయించవచ్చును. (15)

ఈ విధంగా ఔషధ, అన్న, విహారాదుల ఉపయోగంచేత రోగికి హితాన్ని కల్గించి (అతని వ్యాధిలక్షణాలను ఉపశమింపచేసి) నిశ్చితమైన వ్యాధిని గోచరింపచేసే (స్ఫురింపచేసే) ఉపాయాన్ని అనుపశయం అనియూ పిలుస్తారు అహితాన్ని కలుగ చేయుడం వలన, రోగ లక్షణాలను హెచ్చించి బాధలను కలుగజేయడం వలన అనుపశయానికి అసాత్మ్యం అని కూడ పేరు (పర్యాయపదం) వాడుకలో ఉంది.

వ్యాధిలక్షణాలను శాంతపఱిచి రోగికి హితాన్ని కల్గించినప్పటికిన్నీ కూడ పైఉపశయాన్నే (సాత్మ్యాన్నే)పూర్తిచికిత్సగా భ్రమించకూడదు. శరీరంలోని దోషములు, ధాతువులు, స్రోతస్సు, అగ్ని మొదలగు వ్యాధి ఘటకముల వికృతుల నన్నింటినీ శాంతపరిచే గుణం, నివారించే శక్తి ఈ ఉపశయాలకు ఉండనేరదు. అనేకరోగాల్లో నిర్దేశించిన అనేక ఉపశయములు దోషశమనములు మాత్రమే. కాని ఆయుర్వేద చికిత్సా పద్ధతి ప్రకారం రోగముల చికిత్సకు దోషశోధనం అత్యంతావశ్యకమైన విధి. ఈదోష శోధనతోపాటు రోగ చికిత్సలో ఔషధాహార విహారాదులను జాగ్రత్తగ యోచించి ఎన్నుకోవాలి. అందుచే ఉపశయం (సాత్మ్యం)అనే ఈ రోగజ్ఞానోపాయాన్ని ఉపచికిత్సగానే భావించాలి తప్ప, ఇదియే పూర్ణ చికిత్స కానేరదు.

## ఉపశయానుపశయాల యోజనాక్రమం

రోగకారణానికి (హేతువునకు) మరియు రోగానికి, ఈరెంటికీ ప్రత్యేకంగా గాని కలిపిగాని వ్యతిరేకమైన ఔషధ ఆహారవిహారాదుల ఉపయోగమున్నూ, మరియు ఈపై హేతురోగాలకు వ్యతిరేకం గాక

సమాన గుణములు కల్గినప్పటికీన్నీ విపరీత ఫలితాలను కల్గించే ఔషధ ఆహార విహారాదుల ఉపయోగమున్నూ, ఈ రెండు విధములున్నూ ఉపశయ-అనుపశయాల స్థూల యోజనాక్రమం (16) ఇవియే క్రింద వివరించిన విధంగా 18 రకాలుగా విభజింప బడ్డాయి. (17)

A) విపరీతక్రమం

I హేతు విపరీతం:-

1) ఔషధం:- శీతజ్వరంలో ఉష్ణగుణం కల్గిన శుంఠి కల్ప సేవనం.

2) ఆహారం:- అతిశ్రమచే కల్గిన వాతజ్వరంలో మాంసరస (శ్రమహారం గావున) సేవనం.

3) విహారం:- దివాస్వాపంచే కల్గిన కఫవ్యాధిలో రాత్రి జాగరణము.

వ్యాధి విపరీతం:-

1) ఔషధం:- అతిసారంలో గ్రాహక స్తంభక గుణాలున్న పాఠాకల్ప సేవన.

2) ఆహారం:- అతిసారంలో స్తంభక గుణమున్న మసూర యూష సేవనం.

3) విహారం:- ఉదావర్త వ్యాధిలో ప్రవాహణం. (వేగోదీరణం)

3. హేతువ్యాధి విపరీతం - (ఉభయ విపరీత)

1) ఔషధం:- వాతజ శోథలోని వాతహార, శోథహార గుణములు గల దశమూల కల్పప్రయోగం.

2) ఆహారం - వాతకఫ గ్రహణీరోగంలో తక్రపానం.

3) విహారం - దివాస్వాప తంద్రారోగంలో రాత్రి జాగరణం.

B విపరీతార్థకారి క్రమం -

I హేతు విపరీతార్థ కారి -

1) ఔషధం - పిత్తజ వ్రణశోథలో పిత్తకర ఉష్ణ ఉపనాహం.

2) ఆహారం :- పచ్యమాన వ్రణశోథలో విదాహి ఆహారం.

3) విహారం :- వాతోన్మాదంలో త్రాసనం (భయపెట్టుట).

**2. వ్యాధి విపరీతార్థకారి -**

1) ఔషధం - ఛర్ది రోగంలో ఛర్దికారక మదనఫు ప్రయోగం.

2. ఆహారం .- అతిసారంలో విరేచనకారిక్షీరపానం.

3. విహారం - ఛర్దిరోగంలో ప్రవాహణం (వేగోత్పత్తి)

**3. హేతువ్యాధి విపరీతార్థకారి (ఉభయవిపరీతార్థకారి)**

1. ఔషధం :- అగ్నిదగ్ధ వ్రణంలో ఉష్ణగుణం కల అగరులేపం.

2) ఆహారం :- మద్యపాన జన్య మదాత్యయంలో మదకర మద్య పానం.

3. విహారం :- వ్యాయామజన్య మూఢవాతంలో పునః వ్యాయామం చేయుట.




## అధ్యాయ సారాంశం

1) వ్యాధి ఘటకములైన దోష, ధాతు, స్రోతః, అగ్ని మొదలగు వానిలో జరిగే వివిధ వికృతుల క్రమానుసార వర్ణనయే 'సంప్రాప్తి' అనబడుతుంది. యశః కాముడైన వైద్యునికి ప్రత్యేకరోగ - దాని సంప్రాప్తి

జ్ఞానం అత్యంతావశ్యకం. సంప్రాప్తి జ్ఞానంలో వికల్ప సంప్రాప్తి కూడ ఎంతో మహత్తుగలది. రోగిని జాగ్రత్తగ పరీక్షించడం ద్వారా కూడ సంప్రాప్తి జ్ఞానాన్ని పొందగలము.

2. ఉపశయానుపశయములు రెండు కూడ గూఢలింగ (అవ్యక్త లక్షణములు గల రోగముల) వ్యాధుల నిర్ణయాని సహాయపడతాయి. ఈ ఉపశయానుపశయములు చికిత్సను పోలినట్లుగ ఉన్ననూ ఇవియే సంపూర్ణ చికిత్స కాజాలవు.

## శాస్త్రోక్త ప్రమాణములు (Referrences)

1. యథా దుష్టేన దోషేణ యథా చానువిసర్పతా ।
   నిర్వృత్తిరామయస్యాసౌ సంప్రాప్తిర్జాతి రాగతిః ॥
   (మా. ని. 1/10)

   తస్మాద్దోషేతికర్తవ్యతోపలక్షితం ।
   వ్యాధి జన్మసంప్రాప్తిరిత్యేవ లక్షణం ॥ (మధుకోశ 1/10)

   వ్యాధి జనకదోష వ్యాపారయుక్తం
   వ్యాధిజన్మేహ సంప్రాప్తి శబ్దేన వాచ్యం ।
   (చక్రపాణి. చ. స. 1/11)

2. అసత్యాం చ సంప్రాప్తౌ పూర్వరూపాది ప్రతీత స్యాపి
   వ్యాధేః చికిత్సోపయోగినో వికల్పనాబల కాలాదేరప్రతీతే
   చికిత్సా విశేషో న స్యాత్ ॥ (మధుకోశ. మా.ని. 1/4)

3. సంఖ్యావికల్ప ప్రాధాన్య బలకాల విశేషతః ।
   సా భిద్యతే ... . ।
   (మా. ని. 11/1)

4. సా సంఖ్యా ప్రాధాన్య విధి వికల్ప బలకాల విశేషైర్భిద్యతే ।
   (చ. ని. 1/11)

5. వక్ష్యంతేఽష్టౌ జ్వరా ఇతి । (మా.ని 1/11)

6. దోషాణాం సమవేతానాం వికల్పో అంశాంశకల్పనా ।
(మా. ని. 1/12)

7. అంశాః వాతాదిగత రౌక్ష్యాదయః, తైరేక ద్విత్రాభిః సమస్తైర్వా వాతాది కోపావధారణ కల్పనా అంశాంశ కల్పనా ।
(మధుకోశ. మా. ని. 1/12)

అంశశ్చాంశశ్చ అంశాంశౌ తాభ్యాం కల్పనా అనేక విధో విశేషః భాగేన భాగేన కార్యాను మేయేన నిరూపణం స వికల్పః ॥
యథా అస్మిన్ వ్యాధౌ వాతః కుపితః కదాచిత్ ఏకేన గుణాధికేన రూక్షేణ, కదాచిల్లఘునా, కదాచిత్ శతేన కదాచిత్ ద్వాభ్యాం త్రిభిర్వాధికైః దుష్యతి ఇతి ॥ (అరుణదత్త 1/11)

8. స్వాతంత్ర్య పరతంత్రాభ్యాం వ్యాధేః ప్రాధాన్యమాదిశేత్ ।
అత్రాపి దోషాణాం అపి . అనువర్తనీయం ॥ (మా. ని. 1/12)

9. హేత్వాది కాత్స్న్యావయవైః బలాబలవిశేషణం । (మా.ని. 1/13)

10. నక్తం దినర్తు భుక్తాంశో వ్యాధికాలో యథామలం । (మా.ని. 1/13)
వ్యాధికాలో వ్యాధివృద్ధి హాని హేతు కాలః ॥
యథామలం ఇతి యథాదోషం । (మధుకోశ)

11. వివిధర్నామ ద్వివిధా వ్యాధయో నిజాగంతుభేదేన త్రివిధా వా త్రి ... భేదేన, చతుర్విధావా సాధ్యాసాధ్య మృదు దారుణ భేదేన, ఇతి॥ విధిశ్చ ప్రకారో భేద ఇత్యర్థః (చక్రపాణి చని. 1 4)

12. విధిసంఖ్యయో శ్చాయం భేదః – విధిర్హి ప్రకారః స చ . కారణ ధర్మానుగత ప్రకారో యుజ్యతే ॥ (మధుకోశ. మా ని. 1/11)

13. గూఢలింగం వ్యాధిం ఉపశయానుపశయాభ్యాం పరీక్షేత ।
(చ. వి. 4/87)

14. హేతువ్యాధి విపర్య స్త విపర్యస్తార్థ కారిణాం ।
ఔషధాన్న విహారాణాం ఉపయోగం సుఖావహం ॥
విద్యా దుపశయం వ్యాధేః స హి సాత్మ్య మితి స్మృతః ।
విపరీతోఽనుపశయో వ్యా ధ్యసాత్మ్యాభిసంజ్ఞితః॥ (మా.ని.1/8.9)

15. తత్రోపశయానుపశయ జ్ఞానార్థం స్నేహనం .. తతః స్నేహనా దనుపశయో భవతి । (ఊరు స్తంభ నిదాన మధుకోశ)

16. ఉపశయః పునః హేతువ్యాధి విపరీతానాం విపరీతార్థానుకారిణాం।
ఔషధాహారాణా ముపయోగః సుఖానుబంధః॥ (చ.ని. 1/10)

17. విజయరక్షిత, మధుకోశవ్యాఖ్యా। (మా.ని. 1/8-9)

చక్రపాణి వ్యాఖ్యా (చ.ని. 1/10)

అరుణదత్త వ్యాఖ్యా (అ. హృ. ని. 1/9)



# అధ్యాయం - 9



## అరిష్టలక్షణములు - విమర్శ

రోగియొక్క మరణానికి ముందుగా గోచరించే కొన్ని ప్రత్యేకలక్షణాలకు అరిష్ట లేదా రిష్టలక్షణాలు అని పేరు. చెట్టుకు పూచేపూవు ఏ విధంగా ముందు ముందు ఉత్పన్నమయ్యే పండును గోచరింప చేస్తుందో అదేవిధంగా ఈ అరిష్టలక్షణాలు రాబోయే మరణాన్ని కొంతవ్యవధికి ముందుగానే సూచిస్తాయి. అరిష్టలక్షణములు జనించకుండా మరణం కలుగ నేరదు. (1) మరియు ఇవి ఉద్భవించాక ఇకరోగి జీవించడు కూడ. (2) అందువలన యశఃకాముడయిన వైద్యుడు ఈ అరిష్ట లక్షణాలను గమనించి ఈ రోగికి చికిత్స చేయడమా ? మానడమా ? అన్నది నిర్ణయించుకోవాలి. కనుక ఈఅరిష్టలక్షణ జ్ఞానం ప్రతివైద్యునికీ అత్యంతావశ్యకం. ఈ అరిష్టలక్షణాలను గమనించినప్పటికిన్నీ వాటి సంపూర్ణజ్ఞానం లేని వైద్యుడు ఇంకనూ చికిత్స నెరపుతూ చివరకు అపకీర్తికి లోనవుతాడు. అదేవిధంగా ప్రాకృతలక్షణాలకూ రిష్టలక్షణాలకూ తేడా తెలియని వైద్యుడు సాధ్యమయిన రోగాలను కూడ విడిచిపెట్టి రోగిని దైవకృపకు వదలివేసే అవకాశమూ ఉన్నది. అందుచే చికిత్స మొదలుపెట్టుటకు ముందుగానే రోగియొక్క ఆయుఃపరితిని అరిష్టలక్షణాల ఉనికిని బట్టి లేదా లేమినిబట్టి గాని నిర్ణయించు కోవడం చాల ముఖ్యం. (3)

ప్రాచీనకాలంలో ఈఅరిష్టలక్షణాలకు రోగవిజ్ఞానంలోనూ చికిత్సా విజ్ఞానంలోనూ అత్యంత ప్రాధాన్యం ఒసంగబడింది. ఆయుర్వేద గ్రంథాల్లో దీర్ఘ, మధ్యమ, అల్పాయుర్దాయంగల పురుషులలక్షణాలు సమగ్రంగా వివరింపబడినాయి. (4) అంతేగాక ప్రాణం పోయేటప్పుడు గోచరించే లక్షణాలు కూడ (అరిష్టలక్షణ) ఇంద్రియ విజ్ఞానం అనే పేరుతో వేరుగ ప్రత్యేకంగ వివరించబడినాయి. చరకసంహితలోని 12 అధ్యాయాలు గల్గిన 'ఇంద్రియస్థానం' ప్రత్యేకంగా ఈ అరిష్టలక్షణాలను విపులీకరిస్తుంది. సుశ్రుత సంహితసూత్రస్థానం 6 అధ్యాయాలు (28-33) అష్టాంగ

సంగ్రహ శారీరస్థానం 4 అధ్యాయాలు (9-12) అష్టాంగ హృదయం శారీర స్థానం 2 అధ్యాయాలు - వీటిలో ఈ అరిష్ట లక్షణాల సమగ్రస్వరూపాన్ని పూర్తిగా వివరించాయి.

## అరిష్ట లక్షణాలు - వాటి ప్రభేదాలు :

మరణసూచక రిష్టలక్షణాలను రెండువిధాలుగా విభజింపవచ్చును. (5)

1. పురుష సంశ్రయ - రోగి శరీరంలో కనుపించే లక్షణాలు.

2. పురుషఅనాశ్రయ :- రోగి శరీరంలోనే కాక అతనికి సంబంధించిన లేదా అంత హెచ్చు సంబంధం లేని భావాలలో వ్యక్తమయ్యే లక్షణాలు.

ఈ రెంటిలోనూ పురుషసంశ్రయ లక్షణాలకు హెచ్చుప్రాధాన్యం ఈయబడినది. ఈ పురుషసంశ్రయ లక్షణాలు పునః 3 విధాలుగా విభజింపబడ్డాయి. (6)

1. లక్షణ నిమిత్తం :- (7) శరీరం జనించినప్పుడే దానితోపాటు జనించిన హస్త, పాదరేఖాది అంగ ప్రత్యంగ లక్షణాలు, శరీరంలోని నిర్దిష్టస్థానాల్లోని పుట్టుమచ్చలు, తిల, వ్యంగాదులు వీటిలక్షణాలు (ఇది ప్రత్యేకమైన సాముద్రికశాస్త్ర మనే పేరుతో ఉండి దీని వివరణ ఆయుర్వేదంలో ఎక్కువగా కనబడదు.)

2. లక్ష్యనిమిత్తం :- (8) మానవుడు సేవించే అహితాహార విహారాదుల వలన జనించే వ్యాధులలో కనుపించే లక్షణాలున్నూ !!

3 నిమిత్తానురూప - (9) వేరే ఏకారణం లేకుండగనే కేవలం మరణం మాత్రమే కల్గించే, ప్రతిమనుష్యునిలోనూ అంత్యకాలంలో విధిగా కన్పించే నిశ్చిత మరణ సూచక లక్షణాలున్నూ.

ఈపై వివరించిన మూడింటిలోనూ ప్రధానమైనది నిమిత్తానురూప అరిష్టలక్షణాలు, దాని తర్వాత ప్రధానమైనవి లక్ష్యనిమిత్త అరిష్ట లక్షణాలు (వ్యాధికాలంలో కనుపించేవి) ఇవి రోగోత్పాదక దోషాలచేత

ఉద్భవించేవిగానూ సార్వశారీరికంగా సంచరిస్తూ చికిత్సకు లొంగనివిగానూ ఉంటాయి. అయితే ఈవిధమైన అన్నిలక్షణాలను అరిష్ట (మృత్యుసూచక) లక్షణాలని చెప్పడానికి వీలులేదు. వీటిని అసాధ్యములనియూ, ప్రత్యాఖ్యేయ లక్షణములనియూ, ప్రాచీన ఆచార్యులు ప్రత్యేకమైన వ్యాధులలో వివరించారు. అనేక సమయాల్లో ఇటువంటి అసాధ్య లక్షణాలు దీర్ఘకాలంవరకూ కొనసాగేవిగా ఉంటాయి. ఇటువంటి సమయాల్లో అనుభవంలేని వైద్యుడు రోగిత్వరలోనే మరణించునని భ్రమించి భయపడి చికిత్స చేయక వదలివేసే అవకాశంఉంది. అందుచేత లక్ష్యనిమిత్త లక్షణాలను నిర్దిష్టంగా అరిష్టలక్షణాలని భ్రమించరాదు. నిమిత్తానురూప లక్షణాలు మాత్రం నిస్సంశయంగా అరిష్టలక్షణాలే! ఇవి ఉత్పన్నమైన తర్వాత మరణం ఇక నిశ్చయమనే తెల్సుకోవాలి. అందువలన బుద్ధిమంతుడైన వైద్యుడు తనఅనుభవంచేతనూ, శాస్త్రజ్ఞాన సహాయంచేతనూ అసాధ్య లక్షణాలనూ, అరిష్టలక్షణాలనూ విమర్శించి తెలుసుకోవాలి

ఈపై అసాధ్య అరిష్టలక్షణాలను ఏవిధంగా పరీక్షించి తెలిసికోవాలి అన్నది చరక సంహితలో వివరంగా వర్ణించబడింది. (10) ఈవివరణలన్నింటిని పైని వివరించిన వివిధ విభాగాల్లో చేర్చి అధ్యయనం చేయడం క్రమమైన పద్ధతి.

## I పురుష సంశ్రయ భావములు

### 1. పంచేంద్రియ వికృతి—

ఎ) ఇంద్రియార్థ వికృతి :- జ్ఞానేంద్రియ విషయాలయిన వర్ణం (ఛాయ), స్వరం (వాక్కు), గంధం, రసం మరియు స్పర్శల్లో కలిగే వికృతులు.

బి) ఇంద్రియార్థ గ్రహణ వికృతి - రూపం (దృశ్యాదృశ్య), గంధ, రస, శబ్ద, స్పర్శల వికృతులు.

## II అవయవముల వికృతి

శరీర అవయవముల సహజ ఆకృతిలోను, వాటి వాటి రౌక్ష్య, స్నేహ, గౌరవ, లాఘవాది సహజగుణాల్లోను కలిగే వికృతులు.

III శరీర క్రియావికృతి

భోజన గ్రహణం, ఆహారపాచనం, విహారాదుల (తృష్ణా, శ్వాసోచ్ఛ్వాస, బల, నిద్రా, వాక్, చేష్టాదుల) వికృతులు.

IV ప్రకృతి - వికృతి

సహజ శారీరక మానసిక లక్షణాలలో కల్గే విశేషమైన వికారాలు,

V సత్త్వ (మనో) వికృతి.

స్వాభావికమైన నిర్మలసత్త్వం, భక్తి, శౌచం, శీలం, ఆచారం, స్మృతి, మేధ, హర్షం, గ్లాని, నిద్ర మొదలగు క్రియలలో కల్గే విపరీతమైన వికారాలు.

VI వ్యాధి క్రియావికృతి

రోగముల పూర్వరూపం, రూపం (వేదన), విశిష్టవ్యాధులు, ఉపద్రవాలు లక్షణాలు వీటిలోకల్గే వికృతులు.

## II పురుష అనాశ్రయ భావములు

(అ) రోగికి సంబంధించిన - దూతకు దారిలో విఘ్నం కల్గుట, రోగి కుటుంబంలోగాని, ఆర్థిక సాంఘిక పరిస్థితులలో గాని ఆకస్మిక వికారాలు.

(ఆ) చికిత్సకు సంబంధించిన:- సరైన ఔషధం దొరకక పోవుట, చికిత్సకునికి విఘ్నములు ఎదురగుట మొదలగు వికారాదులు.

(2) పురుషసంశ్రయలక్షణాలు -

(అ) పంచేంద్రియ విషయ వికృతి -

1. చక్షుర్విషయం - వర్ణం

శరీరంయొక్క సహజమైన వర్ణాలు అయిన కృష్ణ (నలుపు), శ్యామ (నీలిరంగు) శ్యామావదాత (నీలి పసుపు మిశ్రమం) అవదాత (పసుపు) రంగులు మార్పుచెంది నీలశ్యామ, తామ్ర (రాగిరంగు), హరిత (పసుపు పచ్చ) శుక్ల (తెలుపు) రంగులుగా మారుట.

అరిష్టం :- ప్రాకృత శరీరవర్ణం మాని వికృతిని పొందుట. కుడి-ఎడమలలో, ముందు వెనుకలలో, పైనిగాని, క్రిందగాని ఈవిధంగా శరీరంయొక్క ఏదో ఒక భాగంలో సహజవర్ణం మరొక భాగంలో వికృతవర్ణం ఉండుట. గోళ్ళు, ముఖం, మూత్రం పురీషం, హస్త, పాదాదులు, పెదవులు మొదలగు ప్రదేశాల్లో వికృతవర్ణం కన్పించుట. నెమ్మదిగా ఈవికృత వర్ణములుగల పుల్లు, వ్యంగ, తిల, కాలక, పిడక మొదలగునవి ముఖం, శరీరంలోని ఇతర భాగాలలో జనించుట, శీఘ్రంగా శరీరవర్ణం కారణం లేకుండగనే మార్పుచెందుట, అంగరూక్షత, అతిరోమహర్షం, అతిగ్లాని (దౌర్బల్యం) గోళ్ళ దంతాలు మొదలగు వానిలో పూవువంటి చిత్రములేర్పడుట, పురుగులు ఎక్కువగా చేరుట, పెదవులు నల్లనేరేడు పండువలె మారిపోవుట మొదలగునవి వర్ణవికృతులు.

1 ఛాయ - చర్మం రంగుకాంతి (ముఖంలో కనుపించే కాంతి) ముఖంపై కనుపించే కాంతి నాభసీ, అగ్నేయీ, వాయవీ, అంభసీ, పార్థివీ అని ఐదు విధాలు - ఇవి ప్రాకృతవర్ణాలు. మానవుల ప్రకృతిని బట్టి వారి వారి ముఖవర్ణం కాంతి ఉంటుంది. కాని ఈకాంతులలో నిష్కారణంగాగాని, రోగసమయంలోగాని కల్గేమార్పులు అరిష్టాన్ని సూచిస్తాయి. ముఖ్యంగా 'వాయవీ' ఛాయ అత్యంతం అశుభం. (11)

2. శ్రోత్రోవిషయం - స్వరం (వాగింద్రియ కార్యం) ప్రాకృతంగా సహజంగా ఆరోగ్యస్థితిలో వినిపించే శబ్దాలుగాక ప్రాకృతమైన సూక్ష్మమైన, గ్రస్తమైన, అవ్యక్తమైన, గద్గదస్వరంతో, దీనస్వరముతో, వణకు స్వరంతో వచ్చేశబ్దాలు (స్వరం) అరిష్టాలుగా తెలుసుకోవాలి. మరియు గుర్ గుర్, భుస్ భుస్ మని మొదలగు శబ్దాలతో గూడి వర్షావాయువు వ్రణం భాగంనుంచి బయటకు వచ్చుటను గూడ అరిష్ట సూచకంగానే గమనించాలి. (12)

(3) ఘ్రాణవిషయ - గంధం

వివిధ పుష్పాల, లతల, చెట్ల, ఆకులవాసన అనుభవములోనికివచ్చుటి (చందనం దుర్గంధంతోను - పురీషం సుగంధయుక్తంగాను ఉండుట)

శరీరంలో బురద, చేపతైలం, వసా, ఘృతముల వాసన వెలువడుట మొద
అగు లక్షణాలు అరిష్టములుగా గమనించాలి.

వ్రణగంధం :- మద్యం, అగరు, ఘృతం, జాజికాయ, పద్మం, చంద
నం ఇత్యాది దివ్యగంధములు వ్రణంనుంచి వెలువడుట లేదా ఎలుకల
దుర్గంధం, పాచిపోయిన మాంసంవాసన, నల్లులవాసన వ్రణంనుంచి వెలు
వడుట కూడ అరిష్టసూచకమే॥ (13)

రసనేంద్రియం :-

(నాలుక) రసజ్ఞానం (శరీరంలో రసజ్ఞానశక్తి మారుట.)

అరిష్టం :- రసజ్ఞానంలో వికృతులు ఉన్నట్లుండి జనించుట అంటే
తీపివస్తువులు కారంగానూ, వికారంగానూ; కారంగా, పులుపుగా, కటు
వుగా నుండేవి తీపిగాకూ మొదలగు విధంగా అగుపించుట.

శరీరరసవికృతి :- ఈగ, పేలు, నల్లి, సన్నని పురుగులు, మొదలగు
ప్రాణులు శరీరంపై ఏవిధమైన ప్రాణి లేకుండు నప్పుడు కూడ అరిష్ట లక్ష
ణంగా గుర్తించాలి. (14)

(5) స్పర్శనేంద్రియం చర్మం - (దానిరిష్టములు)

ఎల్లకాలం స్పందించే శరీరంలోని కొన్ని ప్రదేశాలు స్పందన రహి
తం కావడం, విరుద్ధస్పర్శలను పొందడం (సంధులు జారుట, శిథిల. గుట,
రక్తమాంసముల దౌర్బల్యం, చెమట అతిగా కారుట లేక పూర్తిగా నశిం
చుట మొదలయినవి.

వ్రణం - దాని అరిష్టములు

పిత్తవృద్ధి ద్యోతికాలయిన (ఎఱుపు - పసుపు) వర్ణంలో ఉన్ననూ
శరీరంలో దాహం, మంటలేకపోవుట, లోదాహం, బయట చల్లదనం, కఫ
లక్షణాలుగల వ్రణాల్లో దాహం ఇదే విధంగా విపరీతగుణాలు కలగటం
అరిష్టలక్షణంగా గ్రహించాలి. (15)

(ఆ) ఇంద్రియార్థగ్రహణ వికృతి

1. దృశ్య - (రూప) ఆకాశం ఘనరూపంతోనూ, భూమి శూన్యం
గానూ, గాలి వెలుతురూ, చీకటి ఆకారంతో గూడియు, మంచుమున్న

అగ్ని కనబడకుండ పోవుటయు, నిర్మలమైన నీటిలో కల్మషం, పురుగులు అగపడుటయు, ప్రవాహం నిలచిపోయినట్లుగానూ, సహజమైన రంగులు విపరీతంగానూ, సూర్యుడు మట్టిముద్దవలె, చంద్రుడు సూర్యునివలెనూ, కన్పించుట,వివిధ ప్రేతపిశాచాదులు కన్పించుట, మాట్లాడుట, మానవులు లింగవ్యత్యాసంలో కన్పించుట, దృశ్యవస్తువులు అదృశ్యమై, అదృశ్య వస్తువులు కన్పించుట ఇవన్నియును దృశ్య (రూప) అరిష్టములు. (16)

2 గంధవిషయక :- వివిధ గంధములను పోల్చలేకపోవుట లేక విపరీతంగా పోల్చుట లేదా సంపూర్ణ గంధజ్ఞానం నశించుట.

3. రస - ముఖరోగం లేకుండగనే అకస్మాత్ రసజ్ఞానం నశించుట (17) లేదా వివిధరసాల వికృతానుభవం. (18)

4. శబ్ద - వినిపించే శబ్దాలు వినబడకుండుట, వినబడనివి వినుచుండుట, చెవిరంధ్రాలు (బాహ్యంగా) వ్రేళ్ళతో మూసికొన్నపుడు లోపల అనుభవమయ్యే జ్వాలా (గుయ్ మనే శబ్దం) శబ్దం వినబడకపోవుట, ద్వేషపూరిత శబ్దాల్లో ప్రీతి, ప్రియవచనాల్లో ద్వేషం లేదా సంపూర్ణ శబ్ద జ్ఞానం నశించుట. (19)

5. స్పర్శ :- శీత, ఉష్ణ, శ్లక్ష్ణ, ఖర, మృదు, కఠినాది గుణముల విపరీతానుభవం, అత్యుష్ణశరీరప్రకృతి ఉన్ననూ లోపల అతిశైత్యం అనుభవించుట, వణకుచుండుట మొదలగు లక్షణాలు రిష్టసూచకములు. (20)

ప్రతిజ్ఞాన కర్మేంద్రియం యొక్క సహజమైన ఇంద్రియార్థ గ్రహణ శక్తి హెచ్చుగుట లేదా నాశం చెందుట లేదా అతీంద్రియ విషయాలను గ్రహించుట కూడ అరిష్టమే. (21)

**2. అంగావయవముల వికృతి**

శరీరంలోని వివిధ అవయవాల అంగప్రత్యంగాల సహజ ఆకృతి, వర్ణం, స్థానం, క్రియ మొదలగు వానిలో కనుపించే వికృతులు వ్యాధి అసాధ్యతనూ, రోగి మరణాన్ని నిశ్చయంగా సూచిస్తాయి ఉదా - ఎఱ్ఱగా ఉండేవి అన్యవర్ణంగాను,నలుపురంగుగలవి తెల్లగానూ, తెల్లనివి నల్లగానూ, మృదువుగా నుండేవి కఠినంగానూ, కఠినం మృదువుగానూ, అగుట, లావుగా విశాలంగా ఉండే అవయవాలు సన్నగా కృశించుటయు,సన్నగా కృశించి

ఉండేవి లావుగా విశాలంగానూ, పొట్టివిగా ఉండేవి మిక్కిలిపొడవుగానూ, అగుట సతతం స్పందించే రక్తనాళాలు మొదలగు స్థానాల్లో స్పందననాశం మరియు స్పందనలేని ప్రదేశాల్లో స్పందనం, మాంసరక్తముల అతిదౌర్బ ల్యం, అస్థిసంధులచేష్టారాహిత్యం లేదా అతిచేష్ట, అతిస్వేదనాశం ఇవి అన్నియు శరీరంలోని వివిధ అంగప్రత్యంగాల రిష్టసూచక లక్షణాలే!!

దంతములు - అతిమలయుక్త (పరికీర్ణ), తెలుపురంగుగా మారుట, లేదా రక్తశ్యావవర్ణం, దంతపతనం మొదలగునవి.

పక్షములు - (కనురెప్పలు) అంటుకొని యుండుట, అతిమలయుక్త, అతివాపు, ఎల్లప్పుడూ అదరుచుండుట.

చక్షువులు (కన్నులు) - ముందుకు పొడుచుకొనివచ్చుట, లేదా మిక్కిలి లోనికి పోవుట, ఎల్లప్పుడు కదులుచూ రెప్పలు వాలుచుండుట, లేదా రెప్పవాల్చక చూచుచుండుట, విపరీతదృష్టి, విభ్రాంతదృష్టి, వ్యస్త దృష్టి, విపరీతమైన రంగులు కన్పించుట

మన్య - స్పందరహితంగా నుండుట.

ఉదరం - శ్యావ, తామ్ర, నీల, హారిద్రా శుక్లవర్ణాలలో సిరాజాల ములు పొడుచుకొని తేలి కన్పించుట.

గోళ్ళు - పండిన నేరేడువర్ణం కల్గియుండు రక్తమాంసక్షయం కల్గి యుండుట.

పాద, ఊరు, జంఘా, స్ఫిక్, ఉదర, పార్శ్వ, పృష్ఠ, పాణి, గ్రీవ, తాలు, ఓష్ఠ, హృదయ, లలాటములు :- అతిస్వేదంతో కూడి యుండుట, చల్లగనుండుట, స్తబ్ధమై చలనరహితమగుట, రక్తమాంసరహితమై దారుణ మగుట మొదలగునవి.

గుల్ఫ, జాను, వంక్షణ, గుద, వృషణ, మేఢ్ర, నాభి అంస, స్తన, మణిక, పర్శుక, హను, నాసికా, కర్ణ, అక్షి, భ్రూ, శంఖ, ప్రదేశాలు - స్త, వ్యస్త, స్థానచ్యుతములగుట లేదా ముడుచుకొనిపోవుట.

భ్రూ, శిరః, కేశములలో వర్తులములేర్పడుట, జారిపోవుట, కేశ ములు బలాత్కారంగా పీకిననూ నొప్పిలేకుండుట, అభ్యంగం లేకపోయి

ననూ అభ్యంగమాచరించినట్లుండుట, కేశముల సహజస్నిగ్ధత్వం నశించి తలలో దారులు ఏర్పడుట.

నాస - గ్లాని, దౌర్బల్యం, ఎత్తుగనుండుట, వాపులేకపోయిననూ వాచినట్లనుభవం, కుటిల, స్ఫుటిత, శుష్క, మగ్న, సశబ్ద శ్వాసవెలువడుట.

నాసాద్వారం - మిక్కిలి వెడల్పు, మిక్కిలి చిన్నదిగ ముడుచుకొనుట, ఎండిపోవుట (వంకరగా నుండుట)

ముఖం :- ఎండిపోయి, పీక్కొని పోవుట, తెల్లగాగాని, నల్లగాగాని, నీలంగాగాని, ధూమ్రవర్ణంగాగాని ఉండుట.

ఓష్ఠము :- అతిశుక్ల, అతిరక్త, అతినీల వర్ణములతో గూడి శుష్కించుట, పై పెదవి పైకి, క్రింది పెదవి క్రిందకు జారుట.

జిహ్వ :- చేష్టాహీనమై స్తబ్ధమై పడుట, బరువై ముళ్ళుగుచ్చుకొన్న అనుభవం, శుష్కించి, నల్లనై, కర్కశమై వాచిఉండుట.

హస్త, పాద, తాలు, మన్యాప్రదేశాలు మిక్కిలిచల్లనై కఠినమై లేదా మృదువై ఉండుట.

శిరస్సు - అతిగా క్రిందికి వాలిపోవుట, ధూళి నిండియుండుట.

లలాటం - అతి స్వేదం, ధమని - సిరాజాలం, వివిధ రేఖలు, చంద్రికలు వికృతంగా కన్పించుట.

హృత్ ప్రదేశం - విపరీతమైన శూలానుభవం. (22)

(బి) శరీర క్రియా వికృతి -

శ్వాసోచ్ఛ్వాసలు అతిదీర్ఘమగుట లేదా అతిహ్రస్వమగుట, ఛిన్నశ్వాస, కాకోచ్ఛ్వాసం (దీర్ఘ ఉచ్ఛ్వాసం తీసికొని అతిస్వల్ప నిశ్వాసం అనంతరం తెలివి తప్పుట), ఉచ్ఛ్వాసశైత్యం.

కేశలోమములను పెకలించినను రోగికి వేదనానుభవం కాకుండుట.

భాషణం - మాట్లాడుతూంటే గుండెల్లో విపరీత వేదనానుభవం.

అన్ననిగరణం - నోట్లోపెట్టిన పదార్థం బయటకు వచ్చి వేయుట, నాలుక కంఠంలో చిక్కుకొని పోవుట. ఆహారం పచనం జరుగక అట్లే

యియుండుట, అతితృష్ణ, శీఘ్ర బలనాశనం (శారీరిక-మానసిక రెండు బలాలున్నూ) సర్వఇంద్రియముల శక్తిక్షీణించుట, నిద్రానాశం, కారణం లేకుండగనే రాత్రియందు ముఖంపై అతిగా చెమట పట్టుట. (23)

వికృతచేష్ట - జానుఘట్టనం (మోకాళ్ళు కొట్టుకొనుట), పాదపాతనం (కాళ్లు ఎత్తివేయుట), నోరు వక్రంగా చేయుట, నఖఖాదన (గోళ్లుకొఱుకుట) వ్రేళ్లతో వెంట్రుకలను బలంగా లాగుచుండుట, తలను ఎల్లపుడూ త్రిప్పుచుండుట, క్రిందిదవడ జార్చి నోరుతెరుచుకొని యుండుట, శరీర కంపం, మత్తగతి, మత్తవాక్యం, నవ్వకూడని విషయానికి నవ్వుట, ఆశ్చర్యపడుట, బట్టలను విసరివేయుచుండుట, ఇంకను ఎన్నో శరీరవికృతిచేష్టలు చేయుచుండుట అరిష్టలక్షణాలుగ తెలుసుకోవాలి. (24)

ప్రకృతి - వికృతి -

మానవుడు జన్మించేటపుడే దోషాధిక్యానుసారంగా ఏడువిధాలైన దేహప్రకృతులు (శరీరస్వభావాలు) ఏర్పడతాయి. కొందరు ఏకదోషజ, కొందరు ద్విదోషజ, మిగిలినవారు మిశ్రమప్రకృతికి చెంది ఆయాలక్షణాలను జీవనపర్యంతం పొందిఉంటారు.

జీవితకాలంలో ఈసహజ ప్రకృతులు మార్పు చెందుటగాని, వాటి లక్షణాలలో మార్పుగాని జరుగదు. కారణం లేకుండ ఈ ప్రకృతులలో మార్పులుగాని లక్షణముల మార్పుగాని జరిగినచో అది అరిష్టలక్షణంగా గ్రహించాలి

ఇదే విధంగా మూడువిధాలైన మానసిక ప్రకృతులలో (మానసిక స్వభావాల్లో) కూడ అరిష్ట లక్షణాల్ని అన్వయించ వచ్చును. (25)

**5.** సత్త్వవికృతి - (మనోవికృతి)

భక్తి, శీలం, స్మృతి, బుద్ధి, త్యాగం, శౌచం, బుద్ధి, ఆచారం, మేధ మొదలగు కళ్యాణగుణాలు కారణం లేకుండగనే నాశమగుట, దీర్ఘకాలం తెలివితప్పుట, బంధు, మిత్ర, గురు, దైవ, అన్నపానాదుల యందు ద్వేషం, అతికోపం, రోషం, హింసాప్రవృత్తి, రౌద్రం, భయానకం మొదలగు భీకరలక్షణా లుత్పన్నమగుట. (26)

## 6. స్వప్నవికృతి

అ. శుభస్వప్నములు :- దేవతలు, బ్రాహ్మణులు, స్నేహితులు, రాజులు, సాధువులు, మండేఅగ్ని, నిర్మలమైన నీరు, చేపలు, తెల్లని పూల మాల, తెల్లనిబట్టలు, పండ్లు, విశాలమైన భవనములు, ఇండ్లు, నదులు, తటాకములు, పాము, జలగ-వీటిచేత కరవబడినట్లు (సు సూ 26/75-18) కన్య, కుమారుడు, గొడుగు, అద్దం, సింహం, ఏనుగు - వీటిని గాంచుట, తూర్పు ఉత్తరదిక్కుల సంచరించునట్లు, కష్టములనుండి ముక్తి, పితృదేవతల అనుగ్రహం, రోదించుట, శత్రువులను, దోషులను గెల్చుట. (అ.హ.శా. 6/67 71) ఇటువంటి స్వప్నములను చూస్తే రోగి ఆరోగ్యమును తిరిగి పొందవచ్చును. (27)

ఆ. అశుభస్వప్నములు :- తలనుండి పొదలు, లతలు, పెరిగినట్లు, పక్షులు తలపై గూడు పెట్టినట్లు, తల గొరిగించి కొన్నట్లు, కాకి, కుక్క, గ్రద్ద-గ్రద్దగూబ, రాక్షస, ప్రేత, పిశాచాదులచేత కలవబడుట, ధూళి రాశి, భస్మరాశి, శ్మశానం, వీటిలో పొర్లాడుట, స్నేహపాన, అభ్యంగ, ఛర్ది, విరేచనముల సేవించినట్లు, ధనలాభం, కలహం, బంధం, పరాజయం, పాదరక్షలనాశం, పాదచర్మం పగులుట, సూర్యచంద్రాదులు, నక్షత్ర గ్రహాలు రాలి పడుట, చితి, రక్తవర్ణపుపూలు, అంధకార ప్రవేశం, రక్త వర్ణపుమాల ధరించి నవ్వుతూ దక్షిణ దిశకేగుట, ఎఱుపు కన్నులుగల పురుషదర్శనం, దీర్ఘమైన కేశ, నఖ, స్తనములుంగల నల్లని మాలలు బట్టలు ధరించిన స్త్రీలు కాళరాత్రిదర్శనం- ఇవి అన్నియు రోగిగాంచిన, మరణాన్ని ఆరోగ్యవంతుడు గాంచిన, రోగాన్ని సూచిస్తాయి.

(చ ఇం 5/27-40)

మఱియు జ్వరరోగి కుక్కలతోను, శోషరోగి కోతులతోను, ఉన్మాదరోగి రాక్షసులతోను, అపస్మారరోగి, ప్రేతములతోనూ స్నేహం చేసినట్లుగనూ, అతిసార, ప్రమేహరోగులు నీరు త్రాగినట్లుగను, కుష్ఠరోగి స్నేహపానం చేసినట్లుగనూ, గుల్మరోగికి పొట్టలోను, శిరోరోగికి తలలోను

మొక్కలు మొలచినట్లుగను, ఛర్దిరోగి చక్కగా తినినట్లు, శ్వాసతృష్ణా రోగులు దూరం నడచినట్లుగను, పాండురోగి పసుపు అన్నం తినినట్లుగను, రక్తపిత్తరోగి రక్తం త్రాగినట్లుగను స్వప్నములు గాంచినట్లయితే అది తప్పక అరిష్టమును సూచిస్తుంది. (28)

7. వ్యాధిక్రియా వికృతి :- పూర్వరూపారిష్టములు :-

1. పూర్వరూపంయొక్క లక్షణాలు అన్నియును ఒకేకాలంలో గుంపుగానూ, బలిష్ఠంగానూ వ్యక్తమగుట అరిష్టం అనబడుతుంది.

2. జ్వరంలో సంపూర్ణపూర్వరూపదర్శనం.

3. శోషము ప్రతిశ్యాయ వృద్ధి, బలహాని, నారీకాంక్ష, కుక్క, ఒంటె, గాడిదలపై కూర్చుండి దక్షిణదిక్కుకు ప్రయాణమైనట్లుగను, ప్రేతములతో కూర్చుండి, మద్యపానం చేసినట్లుగనూ, కుక్కలు తన్ను ఎత్తుకొని పోతున్నట్లుగను, స్వప్నములువచ్చుట మరియూ జ్వరవేగం వృద్ధియగుట, శరీర శోషము, కాలుచేతులలో విపరీత శ్రాంతి, గూటి ఎముకలో వేదన, హిక్క, రక్తఛర్ది, ఆనాహం, పార్శ్వశూల.

4. రక్తపిత్తం - ఆకాశమూ. చుట్టూఉన్న సర్వ పదార్థాలూ ఎర్రగ రక్తవర్ణంలో కన్పించుట, స్వప్నములో స్త్రీలచే మోసికొని పోబడినట్లు కాన్పించుట, కారణం లేకయే తలచునవ్వుట, శరీరంలో సిరలు పరివర్తనం చెంది కన్పించుట, రోమకూపములు సంవృతములగుట (ముడుచుకొని పోవుట) అత్యామ్లాభిలాష.

5. గుల్మం :- అతిదౌర్బల్యం, శూల, ఆటోపం, ఆంత్రకూజనం, గోళ్లలో వైషమ్యం, రంగుమారుట, వ్రాత్ ప్రదేశమునుండి లతలు, పొదలు, ముళ్ళు జనించినట్లుగ స్వప్నం వచ్చుట.

6. కుష్ఠం :- శరీరానికి ఏవిధమైన వస్తువైనను అవి బాధ, నొప్పి, పుండ్లు, దీర్ఘకాలంవఱకూ పక్వంచెందక యుండుట, నగ్నంగా జ్వాల లేని అగ్నికి నెయ్యి పోస్తున్నట్లు కలవచ్చుట, హృదయ ప్రదేశంనుంచి తామరపూలు పుట్టినట్లు కలవచ్చుట.

7. ప్రమేహం -

స్నానం చేసినను కూడ శరీరముపై మలినములు, చీములు చేరుట, చండాలురతో కూడి వివిధములైన ఘృతతైలాదులు త్రాగినట్లు స్వప్నములు.

8. ఉన్మాదం :-

ఆయాసం, ఉద్వేగం, మోహం, అసందర్భంగా వివిధస్థానాల్లో వ్యక్తమగుట; అరతి, బలహాని, ఆహారద్వేషం, ఉదర్దం, చిత్తనాశం, అతి క్రోధం, అతిత్రాసనం, అతిహాసం, నవ్వు, మూర్ఛ, అతిపిపాస, నీటిలో మునుగుట ఇత్యాది స్వప్నములు గాంచుట.

9. అపస్మారం:-

పగలు చూసి రాత్రియనియు, లేనిశబ్దములు గలవనియూ, భ్రమించుట; ప్రేతములు కూస్తున్నట్లుగాను, తన్ను మోసికొని పోతూన్నట్లుగాను కలగాంచుట.

10. బహిరాయామం :-

హనువు, మన్య, కన్నులు, నిలిచిపోవుట; చక్కులి (శష్కులి) వంటి పదార్థాలు తాను తినినట్లుగను, వాంతి చేసికొన్నట్లుగానూ కల గాంచుట. (29)

సర్వవ్యాధి అరిష్టం :-

యోగ్యమైన చికిత్స జరుగుతున్నప్పటికిని రోగవృద్ధి, స్వర దౌర్బల్యం, బలవర్ణనాశం, ఊర్ధ్వశ్వాసం, ఊష్మనాశం, వంక్షణశూల, సదా అరతి (దేనివల్లనూ సుఖం కల్గకపోవుట) అపస్వర, అపశబ్దములు తఱచు వినబడుచుండుట, రోగి ఉమిసినది వివిధ వర్ణములతో కూడి యుండుట, ఫేనంతో కూడిన రక్తం ఉమియుట, విపరీత కుక్షిశూల, అరోచకం, అతి తృష్ణ, అతి అష్ఠీలావృద్ధి, నాసికావక్రత, భ్రూచ్యుతి, అతి అంతర్దాహం, పార్శ్వ, ఉరోగ్రహ, హృదయగ్రహం, గుదగ్రహం, పురీష మూత్రములను నిరోధించుటచే మిక్కిలి నొప్పి, బాధ, శరీరంనుంచి అతి

స్వేదం, పురీష మూత్రములు తీవ్రంగా విసర్జింపబడుట, దంతములలో అధికమలం పేరుకొని పోవుట; నోరు, ముఖము వాడిపోయి యుండుట, దారుణ వ్యాధులు తలయెత్తుట, మరియు ఇంకను అన్ని అసాధ్యలక్షణములు, తీవ్రములైన మార్పులు, కన్పించినచో సర్వవ్యాధులలోను ఇవి అరిష్ట చిహ్నములుగా గ్రహింపవలెను.

వ్యాధి లక్షణ అరిష్టం –

సామాన్యంగా రోగంయొక్క సర్వలక్షణాలూ ఒకే కాలంలో బలిష్ఠమై శీఘ్రంగా ఉత్పన్నమగుట.

దుర్బలుడయిన రోగికి –

1. ఆనాహం, అతిసారం రెండు లక్షణాలూ కలిసియుండుట.
2. ఆనాహం తృష్ణ కలిసి ఉండుట.
3. ఉదయంవేళల జ్వరం శుష్కకాసం అతిగానుండుట.
4. ఉరస్సులో అతిగా కఫసంచయం కలిగి వివిధ వర్ణములతో కఫం బయటకు ఉమియబడుట.
5. రోమహర్షం, చిక్కని మూత్రం, వాపు, దగ్గుజ్వరం, మాంసక్షయం.
6. త్రిదోషములు బలిష్ఠమైన వృద్ధిని చెందుట.
7. వాపు తర్వాత జ్వరం, అతిసారం లేదా వీటితర్వాత శోథ (వాపు) గాని ఉత్పత్తియగుట, పాండువు, అతి తృష్ణ, అత్యుచ్ఛ్వాసం, కలుగుట; మన్య, హను స్తంభం, అతిబలనాశం.
8. ఏ స్థితిలోను సుఖం కలుగకపోవుట, తమఃప్రవేశం.
9. బలమాంస అపారక్షయం.
10. కన్నులలో మిక్కిలిపచ్ఛదనం, ముఖం ఉబ్బియుండుట, శంఖప్రదేశములో మాంసక్షయం, ఉష్ణశరీరం, అతిగా భయపడుట, అతిగా కృశించుట.
11. అల్పభోజనం, ఎక్కువమూత్రం మరియు మలం విసర్జించుట.
12. అతిదౌర్బల్యం, అతిభోజనం, అల్పమైన మూత్రపురీషాదుల విసర్జన.

13. ఇష్టమైన, పుష్టిని కల్గించే ఆహారం గ్రహించినవూ, కృశించిపోవుట.
14. కంఠకూజనం, అతిశ్వాసం, శిథిలత గల్గించు అతిసారం, అతి పిపాస, శుష్కించిన నోరు.
15. హ్రాస్వమైన అంతఃశ్వాసం, విషం తినినట్లుగా ఆరాటం చెందుట.
16. ఊర్ధ్వశ్వాసం, అతికఫసంచయం, బలవర్ణ ఆహారక్షయం.
17. కన్నులలో (చూపులో) ఊర్ధ్వదృష్టి, క్రింది దవడ వణకు.
18. దారుణమైన జ్వరం దగ్గు, శూల, అన్నద్వేషం, కంఠప్రదేశం వాచియుండుట.
19. నాలుక అంగుటికి అంటుకొనియుండుట, ముల్లుతో గ్రుచ్చినట్లు అనిపించుట.
20. మేఢ్రం, వృషణములు బాగా లోపలికి చొచ్చుకొనిపోవుట లేదా అతిక్రిందికి వ్రేలాడిపోవుట.
21. మాంసం నశించి శరీరంలో కేవలం ఎముకలు మాత్రమే మిగిలి యుండుట.

ఈ పైలక్షణాలన్నీ దారుణ అరిష్ట సూచకలింగాలే.

## వ్యాధిలక్షణ (రూప) అరిష్టములు – విశిష్టవ్యాధులు

రాజయక్ష్మ – మోట్లాడుతూంటే విపరీతమైన ఛాతీనొప్పి, తిన్న అన్నం వాంతియగుట, ఒకవేళ కడుపులో మిగిలినవూ జీర్ణంకాకపోవుట, త్వరగా బలం నశించిపోవుట, అతితృష్ణ, గుండెనొప్పి.

గంభీరహిక్క – రక్తాతిసారం, అతిస్వేదం, అతిదాహం.

ఉదర – మూత్రం వెలువడకుండుట, పురీషం వెలువడకుండుట, శ్వాస, ఊష్మనాశం, శరీరం చల్లబడుట.

శోథ:– (వాపు) కుక్షినుంచి హస్తపాదములవరకు ప్రసరించే వాపు, చాలకాలం నుండి ఉన్నది, పాదముల తొడల దౌర్బల్యం, చేతుల వాపు, గుహ్య ప్రదేశంలోను ఉదరంలోను వాపు, బలవర్ణక్షయం, ఆకలి నశించుట

జ్వరం :- సంతాపంచేత దాహం, తృష్ణ, మూర్ఛ, బలక్షయం, ప్రవేపజ్వర పీడితునికి సాయంత్ర మగుసరికి ముఖంపై ఎక్కువ చెమట పట్టుట.

అతిసారం - తృష్ణా, శ్వాస, శిరోరోగం, మోహం, దౌర్బల్యం, అంత్ర కూజనం (ప్రేగులు అరచుట)

రక్తపిత్తం - రోమకూపములనుంచి రక్తస్రావం.

శ్వాసకాసలు -అతిసారం, జ్వరం, హిక్క, ఛర్ది, మేఢ్రం మఱియు వృషణముల శోధ (వాపు)

ఉదరం - విరేచనానంతరం పొట్ట ఉబ్బియుండుట, అతితృష్ణ, విరేచనం అయిన పిదప కూడ పొట్టలో శబ్దములు, నొప్పి; నోరు, గొంతు, తడారిపోవుట.

శంఖకం - మూర్ఛావస్థ.

శూలం - అతివార, అతిప్రమాణ, అతిశీఘ్రరక్తఛర్ది, అతికుక్షి శూల.

శోధం - వాతశోధ రోగికి అతిసారం, తృష్ణ. (30)

విశిష్టవ్యాధులే అరిష్టములగుట -

మహాగదములు - వాతవ్యాధులు, ప్రమేహం, కుష్ఠం, అర్శస్సు, భగందరం, అశ్మరి, మూఢగర్భం, ఉదరం ఈ యెనిమిది ఘోరవ్యాధులు కూడ సహజంగానే అసాధ్యములు. పైగా ఇవి ఉపద్రవములతో కూడి యున్నచో పూర్తిగా అరిష్టసూచకములనియే చెప్పవచ్చును.

ఉపాయం - అంటే అతిశీఘ్రంగా ఒకటి కంటె ఎక్కువవ్యాధులు శరీరంలో ఉత్పన్నమగుట. ఉదాహరణకు- తీవ్రజ్వరసంతాపంచేత మూర్ఛ, తృష్ణ ఇత్యాది వ్యాధులు కల్గుట అసాధ్య లేదా అరిష్టలక్షణం.

అపాయం .- అతిశీఘ్రంగా శరీరంనుంచి వ్యాధి నిర్గమించుట.

వేదన :- ఏదో ఒకటి రెండులక్షణాలు మాత్రం జనించి శరీరాన్ని నాశనం చేసే అవకాశమూ ఉంది. వీటిని గూడ అరిష్టములనే అంటారు.

ఉపద్రవం :- ఉపద్రవములతో కూడిన వ్యాధులు మరణకారకములూ అసాధ్యములున్నూ. (31)

## II పురుష అనాశ్రిత భావములు - లక్షణములు

1. ప్రతిచ్ఛాయ - రోగికి తన నీడ, తన ప్రతిబింబం నీటిలోను అద్దంలోను మొదలగు వానిలో కన్పించే ప్రతిబింబం, మఱియు రోగి యొక్క కృష్ణమండలంలో ఇతరులకు కన్పించే బింబము వీటి నన్నింటిని 'ప్రతిచ్ఛాయ' అంటారు. రోగికి ఎండ, వెలుగు, దీపకాంతి - వీటిని గాంచుట తోడనే తన నీడ వికృతమై కన్పించుట (భిన్న, ఛిన్న, హీన, అధికములుగా, పెద్దదిగా, విశాలంగా, వివర్ణంగా, వికృత సంఖ్యతో కనిపించుట).

ఇతరులు (వైద్యులు) రోగియొక్క కన్నులను చూచుటతోడనే అతని కృష్ణమండలంలో తన ప్రతిబింబం కనబడకపోవుట లేదా వికృతిగా కన్పించుట కూడ అరిష్ట లక్షణములే. (32)

2 దూత :- రోగియొక్క చికిత్స నిమిత్తమై వైద్యునికోసం అరు దెంచే మనుష్యుని 'దూత' అని పిలుస్తారు ఆ దూతయొక్క నడవడి, భాష, జాతి, ధారణ, చేష్టలు రోగియొక్క పరిస్థితిని గురించియూ, వైద్యుడు ఉద్యమింపబోవు (చికిత్సయొక్క) ఫలాఫలములను గూర్చియూ ముందుగా కొంత జ్ఞానాన్ని సూచిస్తాయి.

ప్రశస్తదూతలక్షణాలు :- రోగియొక్క ఆరోగ్యవిషయమై తీవ్ర ఆసక్తిగలవాడున్నూ, మనస్సును తన అధీనంలో పెట్టుకొన్న వాడునూ, కరుణగలవాడునూ, తాను తెలియచేయు అప్రశస్తలక్షణములను గూర్చి విచారించి భయపడువాడున్నూ, ఆరాటపడువాడున్నూ, మంచి ఆరోగ్య

సూచకలక్షణములగూర్చి సంతోషించువాడున్ను అయిన దూతను ప్రశస్త మైన దూతనుగా గ్రహించాలి. ఈతని దర్శనం చేతనే రోగికి ఆరోగ్య మునూ, వైద్యునికి యశస్సున్నూ, కల్గుతాయి. (33)

అప్రశస్త దూతలక్షణములు :- రోగిపైనీ, అతని పరిస్థితి పైనీ నిర్లక్ష్యం గలవాడున్నూ; ఏడ్చుచూ, విచారించుచూ, వికృతంగా నవ్వుచూ నిష్ఠుర అమంగళ శబ్దాలు పల్కుతూ వచ్చువాడునూ; వైద్యుని దూరం నుంచే బిగ్గరగ పిల్చువాడున్నూ; తనకాళ్లతో భూమిని తన్నుతూ భస్మ రాశి, గడ్డి, అంగారరాశి అనువానిపై నిలుచువాడున్నూ; వివిధ శరీరావ యవాలతో వికృతచేష్టలు చేయువాడున్నూ; తనచేతిలో వివిధ అమంగళ వస్తువులను, కట్టెలను, బొగ్గులను, శస్త్రములను ధరించినవాడున్ను; మలిన వస్త్రములను ధరించినవాడున్నూ; ఎఱ్ఱనిబట్ట, పూమాల, గంధములు ధరించి ముండనం చేయించుకొన్నవాడున్నూ; షండుడును, పాషండుడును, దురాత్ముడును, స్వయంగా వ్యాధిచేత పీడింపబడుచున్న వాడున్నూ; అగు దూత అప్రశస్తుడనబడతాడు. (34)

3. ఔత్పాతిక -

వైద్యుడు రోగిని చూడడానికి వెడుతూండగా దారిలో అతనికి కనబడు శుభాశుభ శకునములకు ఔత్పాతికములని పేరు.

శుభశకునములు - ఉదుంబర, అశ్వత్థ ఆదిప్రశస్త వృక్షములు, మణి, ఛత్రి, కళ, ధ్వజ, రాజులు, దేవుళ్ళు మొదలగు మంగళసూచక వస్తువులు; వృషభం, సింహం, గుఱ్ఱం, ఏనుగు మొదలైన ప్రాణులు; మఱియు అనేక మంగళనాదాలు, మంగళసూచక సామగ్రి, వ్యక్తులు; పుష్పాదులు ఎదుర గుట లేదా కనుపించుట.

అశుభశకునములు :- పిల్లి, కాకి, కోడి, గుడ్లగూబ, సర్పం, కుక్క, మొదలగు జంతువులు వికృతంగా అరచుట, దారికి అడ్డంగా వచ్చుట, శరీరంపై పడుట, అశుభసూచక వస్తువులు, జనులు కన్పడుట, శబ్దములు విన పడుట, కఠిన, పరుషశబ్దాలు, విరుద్ధదృశ్యాలు. (35)

4. ఆతురకుల భావావస్థాంతరాలు :-

వైద్యుడు రోగియొక్క గృహాన్ని ప్రవేశించగానే చూచెడి, వినెడి శుభాశుభాలక్షణాలు.

శుభలక్షణాలు :- సర్వమంగళ సూచక వస్తువులు, శబ్దాలు, మాటలు, మంత్రములు వినుట వైద్యునికి రోగియొక్క పరిజనం సంతోషంతో స్వాగతం పల్కుట, రోగి సుఖమైన శుభసూచక స్థానాన్ని, సామగ్రిని, బట్టలను పొందియుండుట, సంతోషంతో ప్రసన్న చిత్తుడై యుండుట మొదలగునవి శుభలక్షణాలు. ఇట్లుగాక పైనివివరించిన వాటి కన్నింటికీ విపరీతమైనచో అశుభలక్షణాలుగా పరిగణించాలి. (36)

విశేషసూచన :- ఔత్పాతిక మరియు ఆతురకులభావావస్థాంతర ముల లక్షణాలనుగూర్చి ప్రాచీనకాలంలో తీవ్రమైన గురి, నమ్మిక ఉండేవి. దీనిని వివరించే ప్రత్యేక శకునశాస్త్రమనే గ్రంథమే రచింపబడినది. కాని ఈ మారుతున్న యంత్రయుగంలో ఆధునిక కాలంలో పై విషయాలపై జనులకు నమ్మిక లేకపోవడం మూలంగా ఈ కాలంలో వైద్యులు పైవిష యాలకు ఎక్కువ ప్రాధాన్యం ఈయవలసిన అవసరం లేదనిపిస్తుంది.

5. భేషజ సంవృత్తి -

వైద్యుడు చికిత్సకు ఉద్యుక్తుడవుతూండగా ఆతనికి కగ్గే గోచరించే శుభాశుభ లక్షణాలు.

అశుభలక్షణాలు :- రోగికోసమై తగిన ఔషధములను మూలికలను పొందుటలో అశక్తుడగుట, పొందలేక పోవుట. పొందిననూ తగిన ఔషధం - యోగం తయారుచేయలేక పోవుట, చికిత్సా పాదములు దుర్లక్షణ ములతో గూడియుండుట లేదాకారణాంతరాలవల్ల చికిత్సఆగిపోవుట (37) ఇవన్నియు అశుభలక్షణాలు. ఇట్లుగాక వీటికి విరుద్ధమై శుభఫలాన్నిఇచ్చి వైద్యునికి యశస్సునూ, రోగికి ఆరోగ్యాన్ని సూచించే లక్షణాలన్నీ శుభ లక్షణాలే.

6. భేషజ వికారయుక్తి -

చికిత్సాక్రమం అంతయూ ఊహించినట్లుగా ఫలితాన్ని ఇచ్చి రోగికి వైద్యునికి గూడ తృప్తిని సంతోషాన్ని కల్గించేవి శుభలక్షణాలు.

అట్లుగాక ఊహించిన ఫలితాన్ని ఈయక ఔషధాలు పనిచేయక విరుద్ధ కార్యం చేయుట, సరిగా యోచించి గావించిన శోధన, శమన, శస్త్ర క్రియాదులు వికటించి ఉపద్రవాలను గల్పించుట ఇత్యాదులు వికారము లనబడతాయి. (38)

చరమకాల లక్షణాలు -

ప్రాణధారక లక్షణాలయిన శ్వాసోచ్ఛ్వాసాదులు, దేహోష్ణం, వాక్శక్తి, అన్ననిగరణశక్తి, మలమూత్రాదుల విసర్జనశక్తి మొదలగునవి అతి కష్టంతో నడుచుచుండుట లేదా పూర్తిగా నశించి పోవుట, ప్రాణ (ఉపతాప) అంటారు. అంగావయువాల బల, చేష్టానాశం; శుక్రం స్థాన చ్యుతిని, వాతం ఉన్మార్గ గమనాన్ని పొందుట, రక్తమాంసముల క్షయం, అతి దౌర్బల్యం, శరీరోష్మం నాశనమగుట, స్వరగంధ వర్ణములలో విశేష వికృతి, శరీరంలోని నవరంధ్రాలూ ఎండిపోయి మూసుకు పోవుట, అనవ రతం స్పందించవలసిన మన్య, హృదయం, నాడి సంపూర్ణంగా స్పంద రహితమగుట, రోగియొక్క సహజ ప్రకృతి మారుట, వికృతలక్షణములు హెచ్చుగుట, ఊహించని పరిణామాలు ఎదురగుట మొదలగు నవన్నియూ చరమకాల (మరణకాల) లక్షణాలుగా తెలుసుకోవాలి.

ఇంద్రియాలు - సర్వేంద్రియశక్తి, చేష్టా నాశం; శబ్ద స్పర్శ రూప రసగంధాదుల అజ్ఞానం లేదా విరుద్ధజ్ఞానం లేదా సంపూర్ణ జ్ఞాననాశం.

మానసిక లక్షణాలు :-

ధీశక్తి, విజ్ఞానం నశించుట, చేతనానాశం, దౌరాత్మ్యం (కూడని పనులు చేయుట), మనస్సులో విపరీతభయం, స్మృతి, మేధా, హ్రీ, శ్రీ, ఓజస్సు, తేజస్సులనాశం, శీలం, భక్తి, నశించుట లేదా విపరీత మగుట, దారుణస్వప్నములు గాంచుట, తెలివిగా ఉండియే ప్రేతపిశాచాదులను యమ దూతలనూ లేదా దేవదూతలనూ గాంచుట, వారితో మాట్లాడుట మరియు ముఖంపై ప్రేతలక్షణాలు స్పష్టంగా కన్పించుట. (39)

మరణం సమీపించే సరికి ఆత్మ (జీవుడు) శరీరం నుంచి మెల్లిదిగ వేరయి పోతాడు. ఆత్మలక్షణాలు లేని నిశ్చేతన శరీరం అచేతనమై కట్టెయై

పోతుంది. ఇక ఈఅవస్థలో మిగిలేది కేవలం పాంచ భౌతిక మలరూపమైన పార్థివ శరీరం మాత్రమే. (40) ఈ అవస్థకే పంచత్వం పొందుట అని కూడ పేరు. ఈ నిర్జీవశరీరం (శవం) కుణపం (దుర్గంధయుక్తం) కావడం మూలంగానూ, నిరుపయోగం కావడంవల్లనూ, అనేక విధాలుగా నాశనం చేయబడుతుంది.

## అధ్యాయ సారాంశం :-

1. వివిధ అరిష్ట లక్షణాలు నిర్దిష్టమరణ సూచకములే. మరియు అవి ఆసన్నమరణ సూచకములు.

2. పురుష సంశ్రిత లక్ష్యనిమిత్త, మరియు నిమిత్తానురూప అరిష్టములకే ప్రాముఖ్యం - పురుష అనాశ్రిత భావములకు ఆయాఅశుభ సూచకములకు ప్రాశస్త్యం తక్కువ.

3. శరీరం నుంచి ఆత్మ వేరుపడడమే మరణం అనబడుతుంది. ఆత్మ త్యజించిన ఈ శరీరం నిరుపయోగం, అచేతనం.

## శాస్త్రోక్త ప్రమాణ శ్లోకాలు

1. పుష్పం యథా పూర్వరూపం
 ఫలస్యేహ భవిష్యతః।
 తథా లింగ మరిష్టాఖ్యం
 పూర్వరూపం మరిష్యతః॥ (చ. ఇం 2/8)

2. నత్వరిష్టస్య జాతస్య
 నాశోఽస్తి మరణాదృతే।
 మరణం చాపి తన్నాస్తి
 యన్నారిష్ట పురస్సరం॥ (చ. ఇం. 2/5)

3. ఏతాన్యరిష్ట రూపాణి
 సమ్యగ్ బుద్ధ్యేత యో భిషక్ ।
 సాధ్యాసాధ్య పరీక్షాయాం
 స రాజ్ఞః సంమతోభవేత్॥ (సు.సూ. 32/7) (చ ఇం. 12/90)

4. చ. విమాన. 8-సార, సంహనన, ప్రమాణ సాత్మ్య ఇత్యాది వివరణ.
 (చ. శా. 8/51) (సు. సూ. 35/3-17)

5. తత్ర తు ఖ ల్వేషాం పరీక్ష్యాణాం కానిచిత్ పురుష మనాశ్రితాని,
కాని చి చ్చ పురుషసంశ్రయాణి। (చ. ఇం. 1/4)
6. వికృతిః పునః లక్షణ నిమిత్తా చ లక్ష్యనిమిత్తా చ నిమిత్తాను
రూపా చ ॥ (చ ఇం. 1/62)
7. తత్ర లక్షణనిమిత్తా నామ సా యస్యాశ్శరీరే లక్షణాన్యేవ హేతు
భూతాని భవంతి। దైవాత్. . । (చ. ఇం. 1/6)
తేన దైవమేవ నఖరేఖా పద్మాది సాముద్రికోక్తలక్షణయుక్తే శరీరే
రాజ్య ధనగమన వధ బంధనాది రూప వికృతిప్రాప్తౌ హేతుః ..।
(చక్రపాణి)
8. లక్ష్యనిమిత్తాతు సా యస్యా ఉపలభ్యతే నిమిత్తం యథోక్తం
నిదానేషు। (చ. ఇం. 1-6)
9. నిమిత్తానురూపాంతు నిమిత్తార్థానుకారిణీ యా, తా మనిమిత్తాం
నిమిత్తమాయుషః ప్రమాణజ్ఞాన స్యేచ్ఛంతి భిషజో భూయశ్చా
యుషః క్షయ నిమిత్తాం ప్రేతలింగాను రూపాం॥ (చ. ఇం. 1/6)
10. చరక ఇంద్రియ. 1/3.
11. చ. ఇం. 1/8-13, 17-25, 7/10-17, సు. సూ. 28/13-15.
అ. హృ. 5/44-50.
12. చ. ఇం. 1/14-16; 11/22, సు. సూ. 28/16.
13. చ. ఇం. 2/8-16 సు. సూ. 28/9-12.
14. చ. ఇం. 2/17-22.
15. చ. ఇం. 3/4 సు. సూ 28/13-15 · 32/3-5.
16. చ. ఇం. 4/7-18. 11/4-6 సు. సూ. 30/15-23 · అ హృ. శా.
5/33.
17. చ. ఇం. 4/21 : సు. సూ. 30/13.
18. చ. ఇం. 4/22: సు సూ. 30/12.
19. చ. ఇం. 4/19-20 సు. సూ. 30/46
20. చ. ఇం. 4/23 సు. సూ. 30/7-9.
21. చ ఇం. 4/24-25.
22. చ. ఇం. 3/5-6 8/3-26 . సు. సూ. 22/29.

23. చ. ఇం. 6/3_24 : 3/5_6. సు. సూ. 31/5_21. అ. హృ. శా. 5/53_60.
24. చ. ఇం. 9/14 : 17/25 : అ హృ. శా. 6/117_119.
25. సు. శా. 4/28 అ. హృ. శా. 5/122.
26. చ. ఇం. 11/7.
27. సు. సూ. 29/75_81 · అ. హృ. శా. 6/65_70 అ సం. శా. 12.
28. చ. ఇం. 5/27_40. సు. సూ. 29/54_74 అ.హృ. శా. 6/40_60 అ. సం. శా. 12
29. చ. ఇం. 5/3_26 అ. సం. శా. 11.
30. చ. ఇం. 6/ .25 : 7/17_31 . 8/3_26 : 9,14_32 10,3_20: 17/8 20 12/3_4 అ సం. శా. 11.
31. చ. ఇం. 9/33 · 4/22_25 · సు. సూ. 33/4_26 అ. హృ. శా. 5/101_107.
32. చ. ఇం. 7/3_9 ... అ. హృ. శా. 5/41_45.
33. చ ఇం. 12/67_70 సు సూ. 29/23_26. అ. హృ. శా. 6/1_29 (మిశ్ర) అ. సం. శా. 12.
34. చ. ఇం 12/9_24 సు సూ . 29/3_22 అ. హృ. శా. 6/1_29.
35. చ ఇం 12/71_79 సు.సూ. 29/9 27_33 అ.హృ.శా. 6/30_39 · అ. సం శా. 12 చ. ఇం. 12/25_31. సు సూ. 29/34_45.
36. చ ఇం. 12/80_88; చ. ఇం. 12/32_42: సు. సూ. 29/46. అ హృ. శా. 5/1 26_130. అ. సం. శా. 12.
37. చ. ఇం. 12/6_8_27
38. చ. ఇం. 12/27: సు సూ 29/21, సు. సూ. 33/5_6. చ. ఇం. 12,6_8
39. చ. ఇం. 12, 13_61.
40. న మ్రుతస్యాత్మలింగాని తస్మాద్దాహు ర్మహర్షయః।
శరీరం హి గతే తస్మిన్ శూన్యాగార మచేతనం।
పంచభూతావశేషత్వాత్ పంచత్వం గత ముచ్యతే।
(చ. శా. 1/73_74)

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 1 | సూత్రస్థానంలో | నిదానస్థానములో |
| 11 | 2 | నిర్దిశ్యదియతే | నిశ్చిత్యదీయతే |
| 19 | 5 | క్రి.పూ. 3000 సం॥ | క్రీ.పూ. 2000,1000 సం॥ |
| 20 | 5 | కృములు | కన్నులు |
| 21 | 28 | లిస్బర్ | లిష్టర్ |
| 31 | 17 | స్థనిక | స్తనిత |
| ,, | 23 | కుపణ | కుణప |
| 32 | 14 | చక్ర. చ.శా 1/68 | చక్ర.చ.శా 1/99 |
| 33 | 15 | ప్రణార | ప్రహార |
| 34 | 5 | దుష్టాపచారజ | దృష్టాపరాధజ |
| ,, | ,, | పూర్వాపచారజ | పూర్వాపరాధజ |
| 37 | 20 | వృక్క | వపావహన |
| 41 | 8 | కషాయ కటుతిక్త | కషాయతిక్త |
| 47 | 6 | దేహస్థీయ | దేహస్త్రీయ |
| ,, | 10 | 26 శా. 8/15 | చ.శా 7/15 |
| ,, | 18 | క్రక్త్యాష్మ | పక్త్యాష్మ |
| ,, | 21 | అ హృ.సూ. 10/1-2 | అ హృ.రూ 11/ 1-2 |
| ,, | 22 | కటౌ | కటి |
| ,, | 24 | నాభిరామానయః | నాభిరామాశయః |
| ,, | 27 | సుతరాము ద. | సుతరామురః |
| 48 | 3 | గోప్యమాణ | శోష్యమాణ |
| ,, | 6 | కోష్ణో | కోష్ఠే |
| ,, | 16 | చ.చి 16/196 | చ.చి 26/293 |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 49 | 8 | వసంతాచార్య | టీసటాచార్య |
| ,, | 13 | వసంతాచార్య | టీసటాచార్య |
| ,, | 17 | వసంతాచార్య | టీసటాచార్య |
| 50 | 14 | సర్వేషామేవ | సర్వేషాంచ |
| 59 | 26 | సు.సూ 45,15 | సు.సూ 35/24 |
| 61 | 24 | క్రమా | క్లమా: |
| 62 | 3 | విగాతకృత్ | విఘాతకృత్ |
| 62 | 5 | శరీర పరిధావన | శరీరే పరిధావతాం |
| ,, | 15 | అ సం. సూ. 16 | అ. సం. సూ. 19 |
| 68 | 4 | పెగురుటను | పెరుగుటను |
| 69 | 13 | పంథానం | పంథానాః |
| 79 | 20 | శుక్రాది | శుక్రాణి |
| ,, | 25 | శుక్రాణి | శుక్రాజాంసి |
| ,, | | చ. సూ 2/4 | చ సూ 28/4 |
| 80 | 15 | ద్విదర్ధతః | ద్విదర్ఛతః |
| 82 | 4 | అన్న | అన్య |
| ,, | 23 | చ. సూ. 18/12 | చ. సూ 17/22 |
| 83 | 20 | శిరాణా | సిరాణా |
| 86 | 26 | పుల్లని వమనములు | పుల్లని త్రేనుపులు |
| 92 | 23 | క్రోథ | క్రోర |
| 93 | 22 | శైత్య | శ్వైత్య |
| 94 | 6 | సంధివిశేష-వౌర్బల్య | సంధివిశ్లేష-దౌర్బల్య |
| 95 | 4 | తేజస్సు | ఓజస్సు |
| 97 | 1 | విపత్తి | వ్యాపత్ |
| 99 | 4 | ప్రపంచ | ప్రముఖ |
| 99 | 8 | లక్షణాలు | సంఖ్యలో |
| ,, | 24 | అల్పపరిమాణంలో | అల్పబలముతో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 100 | 3 | రోగంలో | రూపావస్థలో |
| ,, | 18 | వింద | లింగ |
| 101 | 3 | కారణాలు | లక్షణములు |
| 105 | 12 | శిశిత | శిశిర |
| ,, | 24 | కటిశ్వాప | కటిస్వాప |
| 108 | 23 | రతి | రీతి |
| 109 | 4 | నెమ్మదిగా | శీఘ్రముగా |
| 111 | 20 | (48) | (47) |
| 114 | 11 | ఆప్యరోగాలు | యాప్యరోగాలు |
| ,, | 15 | ఆరుస్థితులను | ఆరవస్థితిని |
| ,, | 21 | ఐదవ | ఆరవ |
| 116 | 24 | విష్కంభ | విష్టంభ |
| 117 | 26 | ధాతు-దేశ | దోష-దేశ,దోష-దూష్య |
| ,, | | | దోష-దేహ,దోష-ఋతు |
| 121 | 1 | ఆకాలమరణం | అకాలమరణం |
| 122 | 2 | క్రియాలకాలవిమర్శ | క్రియాకాల విమర్శ |
| ,, | 5 | వర్ణాదిషు | వర్షాదిషు |
| ,, | 12 | సు.సూ. 20/18 | సు సూ. 21/18 |
| ,, | 17 | అ. హృ.సూ 10/42 | అ హృ.సూ 11/42 |
| 123 | 14 | సు, సూ. 21/24 | సు. సూ 21/32 |
| ,, | 21 | కార్శ్శ్య | కార్శ్య |
| 124 | 2 | శౌక్ల్యాదిఖిః | శౌక్ల్యాదిభిః |
| 125 | 22 | శ్లైప్మిక | శ్లైష్మిక |
| ,, | 23 | శిరా | సిరా |
| 126 | 7 | క్రమాదిభి: | శ్రమాదిభి |
| ,, | 13 | చ.సూ 18/86-88 | చ.సూ 17/76-77 |
| 128 | 13 | సు.సూ 2/34 | సు.సూ 21/34 |
| ,, | 22 | మధుకోశమా.ని 1/4 | మధుకోశమా.ని 2/14 |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 129 | 7 | ఆల్హాణ | డల్హాణ |
| ,, | 12 | అ.హృ.సూ 10/5-22 | అ.హృ.సూ. 11/5-22 |
| 130 | 3 | చ.చి. 20/40 | చ.చి. 21/40 |
| , | 15 | దృహ్యాతేషు | దృర్హ్యాతేషు |
| ,, | 25 | చ.చి. 26/26 | చ.చి. 29/29 |
| 131 | 4 | చ.సూ 10/7-8 | చ.సూ 10/17-18 |
| ,, | 13 | మా.ని 2/83 | మా.ని 2/73 |
| ,, | 17 | ప్రీడా | పీడా |
| 132 | 15 | చ.శా 2/72 | చ.శా. 1/73-74 |
| ,, | 23 | అ.హృ | అ.హృ, 5/132 |
| 133 | 5 | పరంవరా | పరంపరా |
| 133 | 14 | గ్పోత్తి | రోగోత్పత్తి |
| 135 | 4 | విశేహేణ | విశేషేణ |
| 136 | 7 | ప్రత్యేక | స్వతంత్ర |
| ,, | 10 | అప్రధాన | అనుబంధ |
| 138 | 24 | బుద్ధతా | ఖడ్గతా |
| 139 | 1 | ఊర్హ్వా | ఊదర ఖుష |
| ,, | 3 | కషాయాసతా | కషాయాస్యతా |
| ,, | 13 | అంగావతరణ | అంగావదరణ |
| ,, | 14 | శ్రోణిత | శోణిత |
| ,, | 16 | కాదులా | కామలా |
| ,, | 22 | బలాధిక్య | కఫాధిక్య |
| 140 | 20 | భిప్ప | ఛిప్ప |
| 141 | 27 | అవిసక | అలసక |
| 142 | 10 | అర్శ | అర్శస్ |
| 146 | 6 | అధిష్ఠానాలుగా | విధములుగా |
| 147 | 21 | స్వాభావిక | స్వాభావిక |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 149 | 10 | జాటజ | జాతజ |
| 150 | 16 | షరికరజ | సంకరజ |
| 151 | 9 | 13 | 31 |
| ,, | 15 | పీతికా | నీలికా |
| ,, | 16 | దద్న | దద్రు |
| ,, | 18 | తాలుక | శాలంక |
| ,, | 19 | గలనూడిక | గలశుండిక |
| 160 | 28 | అంశాశ | అంశాంశ |
| 122 | 18 | ఉత్తి | ఉత్పత్తి |
| 162 | 2-3 | శోగావస్థలు | వ్యాధులు |
| ,, | 24 | అతి | అని |
| 127 | 9 | అనుపశయం | ఉపశయం |
| 171 | 18 | చతుర్విధావా | చతుర్విధా |
| ,, | 22 | డ వి 4/87 | డ. వి 4/8 |
| 177 | 18 | స్రోతోవిషయ | శ్రోత్రవిషయా |
| 178 | 16 | స్యందన | స్పందన |
| 180 | 25 | స్త, వ్యస్త | స్రస్త, వ్యస్త |
| 181 | 4 | స్భుటిత | స్ఫుటిత |
| 182 | 26 | అతిశోపం | అతికోపం |
| 186 | 21 | ఆపార | అపార |
| 187 | 4 | విషం | దెబ్బ |
| 190 | 12 | పామండ | పాఖండ |
| 191 | 19 | ఔషభము | ఔషధము |
| 192 | 2 | శషన | శమన |
| 192 | 6 | శ్వ్యాసోచ్ఛ్వ్యాసాదులు | శ్వాసోచ్ఛ్వాసాదులు |

ముద్రణము . బి. వి. అండ్ కో., ప్రెస్, రాజమండ్రి-1.